# మధుమావతి

మొదలైన నాలుగుకథలు.

శ్రీ డాక్టరు నేలటూరు వేంకటరమణయ్యగారు

రచించినవి.

ప్రథమముద్రణము

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్

4. మల్లికేశ్వరస్వామి గుడిసందు

లింగిసెట్టివీథి, మన్నడి

మదరాసు.

1950

 [రు 2-0-0

# ఉపోద్ఘాతము

నేను వృత్తిచే కథారచయితనుగాను. కథకుని కుండ వలసిన లక్షణములు నాయందుకలవేమో తెలియదు. ఈ కథల రచనకు కారకులు మిత్రులు శ్రీ ఖాసా సుబ్బారావుగారు. వారి ప్రోత్సాహము లేకుండిన వీనిని నేను వ్రాసియుండను. ఇవి యన్నియుఁ దొలుత వారి తెలుఁగుస్వతంత్రయందు ప్రకటింపఁ బడినవి. పుస్తకరూపమున వానిని మరలఁ బ్రకటించుకొనుట కనుమతి యొసంగినందులకు వారికి కృతజ్ఞుఁడను.

ఆధునికాంధ్ర వాఙ్మయమున కథానకరచన ముందుకు వచ్చినది; ఇది యాంధ్రులకు కేవల మపరిచితమైన నూతనసంవిధానముగాదు ; ఆంధ్రులకు చిరకాలమునుండియుఁ గథలపై నాదరాభిమానములు గలవని 'గాటబీసుశే చదివి గాథలు ద్రవ్వ తెనుంగువారికిన్' అను ఎఱ్ఱాప్రెగ్గడవాక్యమువలన విదితమగుచున్నది. ఆంధ్రమున కథానకవాఙ్మయము చాలగలదు. మన పెద్దలకు వచనరచనలు రుచింపమిచే నిది చాలవఱకు పద్య రూపమున వెలసినది. ఆంధ్రమందు కథానకరచన ఎప్పుడు ప్రారంభమాయెనో నిశ్చయించిచెప్ప లేము; కాని మన మెఱిఁగిన కథానకరచయితలలో ప్రథముఁడు కేతన; ఆతనికి వెనుకటివాఁడు మంచన;పదునాల్గవ శతాబ్దమున అన్నయ జక్కన గోపరాజులు; వారికి తరువాత పేర్కొనఁదగినవారు అనంతామాత్యయజ్జ

నలు; అటుపిమ్మట దూబగుంట నారాయణకవియు భానయయు వేంకటనాథుఁడును పద్యకథానకవాఙ్మయమును బెంపొందించిరి ; పదునేడు పదునెనిమిదవశతాబ్దులందు కదిరీపతి అయ్యలరాజు నారాయణరాజుల రచనలలో నిది పరిపూర్ణతనందినది. మొట్టమొదట మనకథానకములు సంస్కృతమునుండి యాంధ్రీకరణములు ; తరువాత నవి యనుకరణములుగ మారినవి; కడపట నవి సంపూర్ణస్వాతంత్ర్యము నందినవి. మఱియు దేశకాలాభిరుచుల ననుసరించి వానిస్వభావము మారుచువచ్చినది. ప్రారంభదశయందవి కేవలము సాహసవిషయాత్మకములు. తరువాత నవి నీతిబోధకములైనవి. కడపట శృంగారప్రధానములుగ పరిణమించినవి.

వచనకథానక రచనయు నూతనముగాదు. పదునెనిమిదవశతాబ్దమున నెప్పుడో ప్రారంభమైనట్లున్నది. పందొమ్మిదవశతాబ్దమున ముద్రణాలయములు వచ్చునప్పటికే యది చక్కఁగ నభివృద్ధినందినది; కాని విద్యాధికుల నిరాదరణవలన నది వాసికెక్కలేదు. పామరులకొఱకే కథలు రచింపఁబడినవి. తత్కారణమున రచయితలు తమపేరుగూడ వీనియందు ప్రకటింపలేదు; కావున నివి య[illegible]కృతములోని నిర్ణయించుటకు వీలులేదు.

ఆధునికకథానకములకు పైఁజెప్పిన పద్యగద్యకథానకములతో నెట్టిసంబంధమును లేదు. ఇప్పటికథకు లెక్కయును ఆంధ్రమున ప్రాచీనకాలమునుండి వచ్చు కథానకవాఙ్మయముగలదని

మెఱుఁగరు. ఇందులకు మూఁడునాల్గుకారణములు గలవు. (౧)
మన విద్యావిధానమున నాంధ్రభాషావాఙ్మయముల నభ్యసిం
చుటకుఁ దగినయనుకూలములు లేవు; కావున నిప్పటివిద్యాస్థాన
ములలో విద్య నభ్యసించువారికి ఆంధ్రభాషను చక్కఁగనేర్చి
అందలి వాఙ్మయముఁ జదువుటయు గొంచెఁ జేసికొనుట కవకాశము
చాలదు. కావున వారు గ్రంథరచనకు గడఁగినప్పుడు సుపరిచిత
మైన యాంగ్లవాఙ్మయముపై నాధారపడవలసినవారగుచు
న్నారు. (౨) ప్రాచీనాంధ్రకథానకగ్రంథములు సామాన్యపాఠ
కుల కందుబాటున లేవు. కొన్ని ముద్రితములైనను, ముద్రిత
ములుగానివి పెక్కు తాళపత్రసంపుటములలోను కాగితపువ్రాత
ప్రతులందును లిఖితపుస్తకభాండాగారములం దణఁగియున్నవి.
(౩) అధునాతనాంధ్రరచయితల స్వాభిమానాతిశయము.
ప్రాచీనాంధ్రరచన లన్నియు సంప్రదాయబద్ధము లనియు
స్వభావవిరుద్ధములనియు, దత్కారణమున నాధునికులు వీనిని
బఠించి తెలిసికొనఁదగిన విశేషాంశము లెవ్వియు లేవనియు
వీరియం దనేకులు చెప్పుదురు. వీరి ప్రచారప్రాబల్యమువలన
విద్యార్థులకే కాక విద్యావంతులకుఁగూడ నాంధ్రవాఙ్మయము
నెడ నిరసనభావముగలిగినది. (౪) ఆంగ్లమున విద్య నభ్య
సించుటవలన మనవారికందఱకును ఆంగ్లవాఙ్మయముం దత్యం
తాభిమానము గలిగినది. ఆంగ్లేయకవులు, నాటకకర్తలు,
గద్యరచయితలు, శాస్త్రజ్ఞు లెల్లరును మనకు మేలుబంతు
లైరి. ఇది సహజమే. ఆధునికప్రపంచమునం దాంగ్లభాషను

మించినభాష వేఱొక్కటిలేదు. అది సర్వతోముఖముగ నభి
వృద్ధిఁజెందినది. కావ్యనాటకాదిసారస్వతముమాట నటుండ
నిచ్చి నానావిధశాస్త్రములను లలితకళలను కార్మికవిద్యలను
గూర్చిన యుద్గ్రంథములును అందుఁ గానవచ్చినట్లు మఱి
యెందును గానరావు. ఈకారణములవలన మనప్రాంతపద్యగద్య
కథానకవాఙ్మయము ఇప్పటివారి దృక్పథమునఁ బడలేదు.
ఆంగ్లమున విస్తారమైన కథానకవాఙ్మయముగలదు. స్వతంత్ర
ముగ కథానకములను రచించుటతో దృప్తినందక ఆంగ్లే
యులు ప్రపంచమునం దన్నిభాషలలోను గానవచ్చు సుప్ర
సిద్ధకథానకము లన్నింటిని తమభాషలోనికి బరివర్తనము గావిం
చికొనియున్నారు. కాఁబట్టి యాంగ్లభాష నెఱింగినవారికి
ప్రపంచమందలి కథానకవాఙ్మయము సర్వమును కరతలామ
లకము. ఇప్పటి మనకథానక మాంగ్లకథానకవాఙ్మయసంసర్గ
మువలన నుత్పత్తిల్లినదే. ఇంతవఱకు బయలువెడలిన తెనుఁగు
చిన్నకథలయం దనేకము లాంగ్లమునుండి పరివర్తనములే.
కొన్ని యనుకరణములును గలవు. మనకథకులలో నెవ్వరో
కొందఱుతప్ప తక్కినవారు తా మనువదించు నాంగ్లకథలరచ
యితలపేళ్లు చెప్పరు. అనువాదమనియైన తెలియనీయరు.
ఆంధ్రమున స్వతంత్రకథలు లేకపోలేదు. బ్ర. శ్రీ శ్రీపాద
సుబ్రహ్మణ్యశాస్త్రి. మునిమాణిక్యము నరసింహారావు, కొడవటి
కుటుంబరావుగారలు ఆధునికాంధ్రసాంఘికార్థికవిషయములను
వర్ణించు స్వతంత్రకథలను రచియించియున్నారు. ఈతరగతికిఁ

జేరినవాఁడే కరుణకుమారుఁడు. వీరు రాబోవుతరము కథకులకు మార్గదర్శకు లనుకొనవచ్చును.

కథానకము కేవలము క్రీడావాఙ్మయముగాదు; పాఠకుల మనసును రంజింపఁజేసి శ్రమను మరపించుటకొఱకే యది యుత్పత్తియైనదని యెంచరాదు. అదియు నొకకళ. కల్పనా చాతుర్యము, శిల్పనైపుణ్యము, భాషాజ్ఞానము మొదలగునవి కథకున కుండవలసిన యత్యంతావశ్యకమైన లక్షణములు. కథానకముల భాషనుగూర్చి యొక్కమాట చెప్పవలసియున్నది. మన కథానకములన్నియు మాండలికభాషయందును తఱచు గ్రామ్యమునందును విరచితము లగుచున్నవి. ప్రజానీకముకొఱకు వ్రాయఁబడిన కథానకములు వారికి సులభగ్రాహ్యములగు వ్యావహారికమునసె యుండుట యొప్పు అని దీనికి సమాధానము వీరు చెప్పవచ్చును. కాదనను; కాని కథానకములభాష వ్యావహారికమని యెంచుట పొరఁబాటు. సర్వాంధ్రదేశమునకును గ్రాంథికమున కొక్క మానమెట్లుకలదో వ్యావహారికమునకును నట్టిదొకటి ఆవశ్యకము. దానిలక్షణ మెట్టిదన నాంధ్రదేశమునందన్నియెడల నుండువారికిని సులభగ్రాహ్యమగుటయే. మన కథానక రచయితలందఱును వారివారి మండలములయందలి వాడుకభాష నుపయోగించుచున్నారు. అన్యమండలములవారికిది చాలవఱకు దుర్గ్రాహ్యమగుచున్నది. ఈకారణమున కథకుల కనేకులకు ఆంధ్రదేశమంతటను వారిప్రతిభకుఁ దగిన ప్రాపకము లేకపోవుచున్నది. కావున కథానకరచనయందు సాధ్య

మగునంతవఱకు మాండలిక గ్రామ్యభాషలను త్యజించుట యుక్తము.

ఈ చిన్నసంపుటమందలి కథలు నాలుగును కథారచన యందు నా ప్రథమప్రయోగములు (experiments). నాలుగును చరిత్రాత్మకములే. దీనికి రెండు కారణములుగలవు. మిత్రులు ఖాసా సుబ్బారావుగారు తమ పత్రికకు చరిత్ర కథలనే వ్రాయుమని నియోగించుట యొకటి. ఆంధ్ర దేశచరిత్రను కథలరూపమున జనుల కెఱుకపఱచి తన్మూలమున వారిని చరిత్రాధ్యయనకు పురికొల్పవలయునను అభిప్రాయము రెండవది. కాని చారిత్రకకథల రచనయం దవలంబింపవలసినపద్ధతి యెద్దియో నేనే నిర్ణయించుకొనవలసివచ్చినది. ఏలయన ఆంధ్రమున నింత వఱకు చరిత్రకథలు వ్రాసినవారే లేరు. కొన్ని నవలలు గలవు గాని యవి యంతగ నుపకరింపవు. వానియందు కొన్ని చరిత్రాంశములును వ్యక్తులపేర్లును దక్క చారిత్రాత్మకమని చెప్ప దగిన లక్షణము లెవ్వియును గానరావు. ఆంగ్లచారిత్రకకథలు కొంతవఱకును మార్గదర్శకములైనవి. వానినుండి చారిత్రక కథానకమున నుండవలసిన ప్రధానలక్షణము దేశకాలాత్మక సాదృశ్యతయని గ్రహించినాడను. చారిత్రకకథానక రచయితలు కథావస్తు వెప్పటిదో యప్పటి రాజకీయ సాంఘికార్థికాది పరిస్థితులను వాస్తవసిద్ధము గానీయక ఔచిత్యమునకు భంగము కలుగనీయక కథను పెంపొందింపవలయును. ఇది సుకరముగాదు. సంపూర్ణచరిత్రజ్ఞానముగలిగినగాని చారిత్రక

కథానకముల రచియించుటకు శక్యముగాదు. చరిత్రజ్ఞాన
మనఁగా రాజకీయములను తెలిసికొనుటమాత్రముగాదు. మత
సాంఘికార్థిక, సాహిత్యాది వస్తువిషయజ్ఞానము నెఱుఁగ
నగును.

నాకుగల యల్పచరిత్రజ్ఞానము నాధారపఱచుకొని ఈ
కథలను వ్రాయ సాహసించితిని. ఇవి చారిత్రకకథానకములకు
మేలుబంతులనియెంచుట పొరఁబాటు. పైజెప్పిన చారిత్రకకథా
నకలక్షణములన్నియు నిందు గానరాకపోవచ్చును. ఈతరగతి
కథానకరచన కివి దారిచూపిన నాకడఁక నెరవేరినదని సంత
సింతును.

పాఠకుల కీకథలలోని ఇతివృత్తము చక్కఁగ బోధ
యగుటకొఱకు తదాశ్రయభూతములైన చరిత్రాంశముల
సంగ్రహముగ నిచట వివరించుట యుక్తమని తలఁచితిని.
క్రీ. శ. ౧౨-వ శతాబ్దాంతమున కల్యాణీ చాళుక్యసామ్రా
జ్యము విచ్ఛిన్నమైపోయినది; ౧౩-వ శతాబ్దమధ్యమున దాని
ప్రతిస్పర్ధియైన చోళ సామ్రాజ్యముగూడ నంతరించినది. వీని
స్థానమున స్వతంత్రరాజ్యములు నాలు గేర్పడినవి. దక్షిణమున
మధుర పాండ్యరాజ్యము; ద్రావిడ దేశమంతయును, దక్షిణాంధ్ర
మున నొకలేశమును పాండ్యుల యేలుబడిక్రింద నుండినవి.
దక్షిణ కర్ణాటమును, ద్వారసముద్రమును రాజధాని జేసికొని,
హొయ్సళ బల్లాళు లేలుచుండిరి. పశ్చిమాంధ్రమున నొక
కొంతతో నుత్తర కర్ణాట మహారాష్ట్రములను దేవగిరి

యాదవరాజులు పాలించుచుండిరి. కొంచె మించుమించుగ నాంధ్రదేశమంతయు నోరుగంటి కాకతీయుల యేలుబడియందుండెను. ఒండొరులపై దమయాధిపత్యమును నెలకొల్పుటకొఱకు వీరు నిరంతరము యుద్ధములు సేయుచుండిరి. ఇట్లు వీరు పోరుచుండఁగా దక్షిణాపథముపై డిల్లీ తురకసుల్తాను లెత్తివచ్చి వీరినందఱిని గూలఁద్రోసి దక్షిణసముద్రపర్యంతము గల రాష్ట్రమునంతటిని తమ సామ్రాజ్యమున గలుపుకొనిరి. మొట్టమొదట దేవగిరి యాదవరాజ్యమును క్రీ. శ. ౧౩౧౮-వ సంవత్సరమున దురకలు జయించిరి తరువాత కాకతీయుల వంతు వచ్చెను. ఏడుపర్యాయము లెత్తివచ్చి చిట్టచివర క్రీ. శ. ౧౩౨౩ లో నోరుగంటిదుర్గమును సాధించి కడపటి కాకతీయప్రభువగు ప్రతాపరుద్రుని చెఱపట్టుకొని డిల్లీకిఁ గొనిపోయిరి. కాకతీయరాజ్యమంతట డిల్లీసామ్రాజ్యమున లయమైపోయినది. ఆసంవత్సరముననే పాండ్యరాజ్యముగూడ డిల్లీ తురకసుల్తానులకు హస్తగతమైనది.

కాకతీయులపై డిల్లీసుల్తాను లేడుపర్యాయము లెత్తి వచ్చిరని యంటినికదా. మొదటి యైదు దండయాత్రలును ఖిల్జీ సుల్తానులయాజమాన్యమున నడచినవి. క్రీ. శ. ౧౩౧౯-౨౦ లో ఖిల్జీవంశ మంతరించినది. తరువాత తుఘ్లూకులపాలన ప్రారంభమాయెను. ఈవంశస్థాపకుఁడైన ఘయ్యాజ్-ఉద్దీన్-తుఘ్లూకు మహా దక్షిణభారతమునంతటిని డిల్లీ సామ్రాజ్యమున గలుపుకొన నిశ్చయించి క్రీ. శ. ౧౩౨౩-వ

౦౦॥న తన జ్యేష్ఠపుత్రుఁడును యువరాజును నగు జూనాఖాన్
tughlukunu—ఇతఁడే తరువాత సామ్రాజ్యాభిషిక్తుఁడైన
పిమ్మట మహమ్మదు బిన్ తుఘ్లూకు షహా యను నూతననామ
మును వహించెను—గొప్పసైన్యముతోఁగూడ ఓరుగంటిని
జయించి స్వాధీనముజేసికొనుటకొఱకు వంపెను. జూనా విద్వాం
సుఁడు, కవి, సకలశాస్త్రవిశారదుఁడు. అన్నిశాస్త్రములకంటె
నతనికి గణితమం దభిమాన మెక్కువ. జ్యోస్యమునం దతనికి
గల విశ్వాసము గాఢతమమైనది. విద్వద్గోష్ఠియం దాసక్తి
తఱుగనిది. అతఁడు దండయాత్రలు సలుపునపుడుఁగూడ
శాస్త్రజ్ఞులు కవులు విద్వాంసులు మున్నగువా రతని బరివే
ష్ఠించి పోవువారు. అతనికి నచ్చినకవులలోను జోస్యులలోను
ఉబైదియ్యాదు ముఖ్యమైనవాఁడు. తండ్రి యాజ్ఞప్రకారము
జూనా ఓరుగంటిని ముట్టడించుటకు వచ్చినప్పుడు ఉబైదియ్యా
దతని వెంబడివచ్చెను. ముట్టడి ప్రారంభమై ఆఱునెలలు
గడచినవి. కోట స్వాధీనమగుచిహ్నము లెవ్వియు గానరాలేదు.
సుల్తాను కుమారుని త్వరపెట్టుచు ఉత్తరముపై నుత్తరము
వ్రాయఁగడఁగెను. జూనాఖా నెట్లయిన శీఘ్రముగ కోటను
సాధించి ఢిల్లీకి మరలిపోవ నాతురపడఁజొచ్చి, యొకనాఁడు
ఉబైదియ్యాదును బిలిచి కోట యెప్పుడు స్వాధీనమగునో చెప్పు
మని యడిగెను. నెలరోజులలో కోట హస్తగతమగుననియు,
కానిపక్షమున దనతల నిచ్చెదననియు నతఁడు జవాబుచెప్పెను.
దాదాఁపు నెలరోజులు గావచ్చినవి. కోట వశపడున ట్లగపడ

లేదు. ఉబైయ్యాదుకు తిహాతహాపుట్టినది. జూనా చండుఁడు; దయాదాక్షిణ్యములు లేనివాఁడు. గమ్యప్రకారము ఓరుగల్లు తనికి స్వాధీనముఁ గాకపోయిన పక్షము ఉబైయ్యాదు తల నఱకించుననుటకు సంశయము లేదు. తప్పించుకొనుట యెట్లు? అతనికి దైవ మొకమార్గము చూపెను. డిల్లీకిని ఓరుగంటికిని మధ్య సుల్తాను స్థాపించిన తపాలుచౌకీ లనేకముల నాంధ్రులు నాశముగావించిరి. డిల్లీనుండి వచ్చువార్త లాగిపోయినవి. సందుచూచుకొని ఉబైయ్యాదు కుట్రలు సేయ నారంభించెను. అతఁడు సర్దారులకడ కేగి, 'డిల్లీయందు సుల్తాను మృతిజెందెననియు, ఖిల్జీవంశజుఁ డొక్కఁడు దత్స్థానమున సామ్రాజ్యాధిపతి యాయెననియు జూనాఖానున కీసమాచారము దెలియవచ్చినను సర్దారుల కెవ్వరికి నావిషయమును దెలుపనీయక దాఁచి రహస్యముగ వారినిజంప నుద్దేశించియున్నాఁడనియు' జెప్పెను. ఉబైయ్యాదు జూనాఖానుని కంతరంగమిత్రుఁడగుటచే సర్దారు లిది వాస్తవమనినమ్మి ప్రతాపరుద్రునితో సంధిచేసికొని తమతమ పాళెములను లేపుకొని యచటు వాసి పోయిరి. వారు పోయినపిమ్మట ప్రతాపరుద్రుఁడు జూనాఖానుని సైన్యములపైఁబడి వారిని చెల్లాచెదరు గావించెను. ఇది యంతయు చరిత్ర. దీనిమీఁద నాధారపడియున్నది మధుమావతికథ.

దేవగిరి యాదవరాజ్యము మహమ్మదీయులకు స్వాధీనమైనపిమ్మట యాదవరాజుల దండనాయకులలో నొక్కఁడైన

కంపిలిరాయలు స్వతంత్రుఁడై ఇప్పటి బళ్లారిమండలములోని కంపిలి కుమ్మరములు ప్రధానస్థానములుగ పదియోండ్లకాలము తత్పరిసర ప్రదేశముల నేలెను. ఏలిన భూమి విస్తృతమైనను, రాజ్యకాలమల్పమైనను అతనికీర్తిప్రతాపములు ఢిల్లీసామ్రాజ్యము నాలుగుచెఱఁగులను దాకినవి. పాపశాహిపవనములట్లూఁగినది. అతఁడునా నతని కుమారుఁడు రాముఁడును మహమ్మదీయులను నిగ్రహించి హిందూధర్మమును సంరక్షింప బద్ధకంకణులైరి. ఢిల్లీసుల్తాను మహమ్మద్ బిన్ తుఘ్లూకునకు మేనత్తకొడుకను ప్రతిపక్షియునగు సగరదుర్గాధ్యక్షుఁడు బహాఉద్దీన్ గర్షాస్పుడు వీరికి పరమమిత్రుఁడు; కావున సుల్తాను కంపిలిరాయలను నిర్మూలించి. యతని రాజ్యమును స్వాధీనపఱచుకొన నిశ్చయించి మూఁడుసార్యాయములు సైన్యముల నంపెను. మొదటి రెండు సారులను సుల్తాను పరాజయమందెను. మూఁడవమా రతనిని జయలక్ష్మి వరించినది. కంపిలిరాయల యంతఃపురస్త్రీలందరగ్ని ప్రవేశ మొనర్చిరి; కంపిలిరాయఁడు కుమారరాముఁడు మున్నగు శూరులందఱును రణశయ్య నలంకరించిరి. క్రీ. శ. ౧౩౨౬ వ వర్షమున కంపిలిరాజ్యము ఢిల్లీసామ్రాజ్యమున లయమైపోయినది. ఈచరిత్రాంశముల నాధారపఱచుకొని వ్రాసినది కంపిలిరాయల కథ.

క్రీ. శ. ౧౩౨౩ వ సంవత్సరమున మధురపాండ్య రాజ్యమును ఢిల్లీసుల్తాను జయించెను. అతని పక్షమున నొక మహమ్మదీయసర్దారచట క్రీ.శ. ౧౩౩౪ వఱకును పాలించెను.

తరువాత సయ్యదు జలాలుద్దీన్ అహసన్‌షా యనునతఁడు సుల్తానుపై తిరుగఁబడి స్వతంత్రుఁడాయెను. ఇతనికిని ఇతని యనంతర మచట స్వతంత్రులై పాలించిన మహమ్మదీయ ప్రభువులకును మధురసుల్తాను లనిపేరు. క్రీ. శ. ౧౩౪౨ లో గయాజుద్దీన్‌దామ్ఘన్‌షాహాయను నతఁడు మధురకు సుల్తానాయెను. ఇతఁడు మనుజ జన్మమెత్తిన రాక్షసుఁడు: క్రూరాత్ముఁడు, హిందువులపాలిటిమిత్తి. కన్ననూరు కుప్పయుద్ధమున ముమ్మడి బల్లాళరాయల నోడించి చెఱబెట్టి క్రూరముగ వధించెను. ఇతఁడు వధించి నందఱు హిందువులను మఱే యే తురక రాజును వధించియుండలేదు. ఇతని తల్లియు భార్యయును పుత్త్రుఁడును ఒకనాఁడే మారి తాఁకుడుచే మడిసిరి. వీర్యాభివృద్ధికొఱ కితఁ డొక యౌషధము సేవింపఁగా నది వికటించి యతఁడు మృతినొందెను. ఇది ప్రతీకారమను కథ కాధారము.

కృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౦౯-వ సంవత్సరమున విజయనగరసామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుఁడాయెను. బహమనీ సుల్తానులకును విజయనగరరాయలకును తరతరములుగ పెరిగి వచ్చుచుండిన పగకారణముగ బహామనీసుల్తాన్ రెండవమహమూదుశాహు దండెత్తివచ్చెను; కాని కృష్ణరాయలచే పరాజితుఁడై పాఱిపోయెను. 'ఛత్రగ్రాహి' యీచరిత్రాంశములపై నాధారపడినది.

---

# మధుమావతి.



మధుమావతి యెప్పటివలె నాదిన మరుణోదయమున మేల్కొనినది. కాల్యకృత్యములను దీర్చుకొని చిత్రశాలం బ్రవేశించినది. ఆ ముందటి దినమున మాచల్దేవి విలిచిన మోహినీ చిత్రఫలకమును వ్రేలగట్టుట కనువగు స్థలమును చిత్రశాల యందు వెదుకనారంభించినది. తూర్పుగోడమీఁద చిత్రింపఁబడి యుండిన తారాచంద్ర దాశకన్యాపరాశరచిత్రముల నడుమ గొంతతావు గానవచ్చెను. క్రొత్త చిత్రఫలకమునుగట్టుట కాస్థల మనుకూలపడునో లేదో చూచుట కాగోడచెంతకుఁ బోయి జేనతోఁ గొలువ నారంభించెను. కార్యవ్యాసంగమున నామె పిల్లివలె నిశ్శబ్దముగ చిత్రశాలంబ్రవేశించిన యంగ రేకుల వాని యాగమనమును గమనింపదాయె. వాఁడును మెత్తమెత్తని యడుగులతో నామెచెంతకు నడచి బారెడు దూరమున నిలిచెను. కొంతసేపటికి మధుమావతి, 'ఈస్థలము చాలును; ఇరుగు పొరుగు యుక్తమైనదే' అనుచు వెనుదిరుగఁ గనే మలిచిపెట్టిన విగ్రహమువలె నిలిచియున్న [1]యంగరేకుల వాఁడు గానవచ్చెను.

"ఏమి బంకయ్యా విశేషము?" అని వానిని హెచ్చరించినది. "అమ్మగారి కియ్యమని ఈ కమ్మ నొకడు యిచ్చిపోయి

---

1. అంగరేకులవాఁడు = అంగరక్షకుఁడు.

నాడు'' అనుచు గుండ్రని తాటియాకుచుట్ట నామె చేతి కిచ్చెను. దానిమధ్య నొక [1]నింబపల్లవము గ్రువ్వఁబడియుండెను. పర ధ్యానముననుండిన మధుమావతి యాపల్లవమును గాంచగనె చకితయాయెను. 'ఈకమ్మ యెవ్వరికి? మాంచద్దేవిగారలకా?' అని యడిగెను.

''కాదు, తమకే''

''తెచ్చినవారెవ్వరో విచారించితివా?

''ఊఁ ప్రధాని అన్నయ్యగారి దేవిడిదాసి''

''సరే, నీవు పోవచ్చు''

అంగరేకులవాఁడు ఆస్థానమునకుఁబోయెను. సంభ్రమ ముతో దొట్రుపడు చేతులతో గమ్మనువిచ్చి పారబట్ట చూచి నది. అందు గానవచ్చినదంతయు నొక్కమాటయే 'వెంటనే రమ్ము కొలువునకు' అని. కొంతసేపు యోచించినది. కమ్మ యందు గ్రువ్వఁబడిన పల్లవమువలన కార్య మవసరమునుట తెల్లము. ఆలస్యము సేయఁగూడదు. తురకదండు వచ్చుచున్న దనువార్త పట్టణమంతటను వ్యాపించి ప్రజలను కలవరపెట్టు చున్నది. దండయాత్రమాట నిజమగునా? అగునేని అన్నయ్య గారు తన్నురమ్మని యాజ్ఞాపించిన దాస్థందర్భమున నేయగునా? ఎట్లయినఁగాని ప్రధానిగారియాజ్ఞ యనుల్లంఘనీయముగదా అని చింతించుచు మెల్లగ నడచి వెలిపంజారమును దాఁటి

---

1. నింబపల్లవముగాని మఱి యే పచ్చనియాకుగాని అవసరమును సూచించును.

వీథిం బ్రవేశించినది. అవగాహనార్థము చెరువునకు బోవు చుండు ఏనుఁగులను జూచుచు కొన్నినిమిషములు నిలిచినది. తరువాత రాజమార్గమువైపు దిరిగి ఇదులూరివారి దేవిడికి పయనము సాగించినది.

## 2. మాచాంబకల.

"మధుమా, మధుమా" యని యభ్యంతరమందిరము నుండి వినవచ్చినది పిలుపు. "ఏమక్కయ్యా" యని లోనికేఁగినది మధుమావతి.

"ఎక్కడకుబోయియుంటివమ్మా యింతసేపు?"

"మదనరేఖగారి యింటికి బోయియుంటిని."

"నాతో నేల చెప్పకపోయితివి?"

"అక్కగారు పూజాగృహమున శారదాదేవి నుపాసించుచుండిరి. మదనలేఖగారి చెలి త్వరపెట్టి తీసికొనిపోయినది."

"ఏమి మునిఁగిపోయినదని?"

"లేదక్కయ్యా, కోలచలము మల్లయ్యగారు క్రొత్తగ నొక యక్షగానమును రచియించినారఁట. దానిని మన వాడలోని నాటకశాలలో బ్రదర్శింపవలయునట."

"దానితో నీకేమిసంబంధము? వేషము వేసుకొనమని యడిగినదా?"

"అందులకుగా దక్కయ్యా. ఆ ప్రదర్శనమునుజూడ తమ్ము ఎట్లయిన పిలుచుకొనిరమ్మని ప్రార్థించినది."

"ఊఁహూఁ-ఇంతకు ఆనాటకముపే రేమి ?"

"మాచాంబ సాంత్వనము."

"మాచాంబసాంత్వనమా ? మాచాంబ యెవ్వరు ?"

"అక్కగారే."

"ఊఁహూఁ."

"అక్కగారికి సమ్మతముగదా ?"

"కాకేమి ?"

"మరి నన్ను మీరు ఏల వెదకితిరి ? నాతోడ నేమైన కార్యముగలిగెనా ?"

"విశేష మేమియు లేదు. నందనవనమునకు బోయి వచ్చెదమని యనుకొంటిని. మొన్న మనము నాటివచ్చితిమే, చంపకలత, అది యెట్లున్నదో చూచిరావలయునని కోరిక పుట్టినది. వేగుజామున నది వాడిపోయినట్లు కలలో చూచితిని. అది మొదలు మనస్సంతయు దానిమీఁదనే యున్నది."

"సందెప్రొద్దున బోవుదము."

"నేను సాయంత్రము వచ్చుటకు వీలులేదు. మహారాజుగారు విచ్చేయుదురని వార్తవచ్చినది."

"రేపటియుదయము బోవుదము."

"అంతవరకు వేచియుండుటకు ఓపిక లేదు."

"మఱి ఏమిచేయుదము ?"

"..............."

“అక్కగారి యాజ్ఞయైన నేను పోయివచ్చెదను.”

“నాహృదయము చక్కఁగా గనుగొంటివి - నా నోటి లోని మాటలను నీవే పలికితివి.’

## ౩. ఓరుగంటిముట్టడి.

మాచాంబ చిత్రశాల ప్రవేశించి పిల్లికూటముఁ జొచ్చి నది హంసతూలికాతల్పముమీఁద కూర్చున్నది. కాని యామె మనస్సన్యథా లగ్నమై యుండినది. చూపు లచటి విచిత్రవస్తువులమీఁద బ్రసరించుచుండినను నవి యెవ్వియు నామె దృష్టికి గోచరము కాలేదు. బహిర్దృష్టి యంతర్దృష్టిలో లీనమగుట చేత నామెకు సన్నిహితపదార్థములు గనఁబడియు గానరాక పోయినవి. దూరమున పుట్టకోటకు వెలుపట అనుమకొండ చెంత ధ్వంసమైన నందనవనము పొడగట్టినది. అది యొక ప్పుడు తనది. అపరూపములైన చెట్లను ఓడవర్తకుల కపరిమిత ధనమునిచ్చి తెప్పించినది. పంజారమునుండి కర్పూరవృక్షములను, మలయమునుండి యగరుచెట్లను, మళయాళమునుండి చందన పాదపములను దెప్పించి కన్నబిడ్డలవలె సాకినది; పారశీకమునుండి గోవ బేహారుల మూలమున రప్పించినది గొజ్జగి యంటులను. తన చేతితోనాటి పాదులుగట్టి ఎరువుపెట్టి నీళ్లు పోసి పెంచినది. ఒక తరగతివా? నానావర్ణములవి. చేరలంత పూవులు; జగముండునంతకాల ముండవలయునని పల్లెనాటి చంద్రకాంత శిలలతో నాదీర్ఘకసోపానములను గట్టించినది. ఆ క్రీడామంటపమున గూర్చుండి యెన్నిపర్యాయము లిష్టా

గోష్ఠియందుండినది ప్రతాపరుద్రమహీపాలునితోఁగూడ. అంతయు గలఁబోఁగాంచిన దృశ్యములవలె మాయమైపోయి నది. హనుమంతుఁడు జొచ్చిన యశోకవనమువలె ధ్వంసమై పోయినది ఆరామము. సమూలముగాఁ బెకలింపబడినవి కప్పు రపుటనఁటులు. చందనాగరు వృక్షములు యుద్ధపుటేనుఁగుల కును, గుఱ్ఱములకును కట్టుకంబములైనవి. దిగుడుబావి చెంత ఢిల్లీసురతాణితోఁపుడేరా; అర్ధచంద్ర చిహ్నముతోడ నాకు పచ్చజెండా క్రీడామంటపము మీఁద నెగురుచున్నది. ఎచ్చట తాను ప్రతాపరుద్రదేవుని సముఖమున విద్వాంసులతోడను, నర్తకగాయకాది కళావంతులతోడను వాదము సల్పుచుండి నదో యచట నుల్లాఘుఖాఁుడును నతని సర్దారులును మంత్రా లోచనలు సాగించుచున్నారు. నిరంతరము దన సంగతినే కోరుచు దినమున కొకసారియైనను దనకు దర్శనమును బ్రసా దించు నామహారాజును జూడగాంచి ఎన్నిమాసములైనవి పురమునుండియు స్థలాంతరమునందుండిన ట్లాయెకదా! ఎంత లో నెంత మార్పు. అన్నిటికంటె మించిన దుఃఖము మధు మావతితోడి యెడబాటు. మధుమావతి తన బహిఃప్రాణము. చేటియై తన కొలువుజొచ్చినను చెల్లెలివలె ప్రాణప్రియమైనది; ఆరోజు తానేల ఒంటరిగా నందనమునకు నంపవలయును. మృతినందియుండినను చింత గలిగియుండదు. తురకల చేజిక్కి నదఁట. ఎట్టి యాపదల పాలైనదో. ఇట్లు చింతాసాగరమున మునిఁగియుండిన యామె చెవిసోకినది దూరమునుండి గాలి

తరగలపై గొట్టుకొనివచ్చిన యస్పష్టఘంటారవము; రాను రాను అది స్పష్టతరముగ వినరా నారంభించినది. మొదట నది యొక కర్ణరంధ్రమును జొచ్చి మరియొక దానినుండి వెలువడిపోవుచుండినను క్రమక్రమముగ మనోవీథికిఁ బ్రాకినది. గాఢనిద్రనుండి మేల్కొనినట్లు విచారజలధినుండి బయలువెడలినది ఆమె చిత్తము. ఆఘంటారవము ఆంధ్రోర్వీశ్వరుడు మోసాలపై మోగియు గడియారపుమోత. సంధ్యాకాలమైనది. వెంటనే శంఖదుందుభులు మోగినవి. వానితోఁగూడ జెలఁగినది ఏకవీరాదేవి యాలయపు ఘనఘంటామహారావము— 'ఘణం ఘణా ఘణ ఘణాం' అను శబ్దము వాతావరణమును ముంచివేసినది దేవి యాలయమున సుదీర్ఘకాల మీ ఘంటానాదమును సేయుటకు గారణ మామె కాద్యమున స్ఫురింపలేదు; కొంత వితర్కింపగా స్మరణకు వచ్చినది. ఆరోజు శుక్రవారమని. వెంటనే ఆమెకొక తలఁపు గలిగినది. తల్పమునుండి లేచి పిలిచినది. 'మదాలసా, మదాలసా' యని.

## 4. పురదేవత.

ఏకవీరాదేవి ప్రాంగణమున దేవి నర్చించుటకు వచ్చియుండిన భక్తజనము గ్రిక్కిరిసి మూఁగియుండెను. అమ్మవారు మహాసత్యముగల దేవతయని ప్రఖ్యాతి. ప్రసన్నురాలైన యామె యొసఁగు వరప్రసాదమునకు మితిలేదు; కోపముగలిగెనేని యామె చేయు కీడిట్టిది యని చెప్పదరముగాదు; కావున ఏకవీరామహాదేవిని ప్రార్థించి వరములు వేడుటకొఱకును కోరిక

లీడేరిన అమ్మవారికి దమ మ్రొక్కుబడులను జెల్లించుటకొఱ
కును బ్రతి శుక్రవారమును బ్రజలామె గుడికి మూఁగుట
సామాన్యము. కాని ఢిల్లీ సుల్తాను సైన్యమువచ్చి యోరు
గంటికి ముట్టడి వేసినప్పటినుండియు నమ్మవారిని ప్రార్థించుట
కామె గుడికి పట్టణప్రజలందరు నెడతెఱపిలేక వచ్చుచు బోవు
చుండువారు. ఏడునెలలైనవి తురకదండువచ్చి ముట్టడి వేసి.
ఉల్లూఘుఖానుఁడు చండశాసనుఁడు. కోటలోనివారిని వెలుపటి
కిని వెలుపలివారిని లోనికి బోనీయరాదని యతఁడు కట్టుదిట్టము
గావించెను. మనుష్యుల రాకపోకలు నిలిచిపోవుటయే కాక
పట్టణమునకు దాని పరిసరప్రదేశములనుండి సాధారణముగ
వచ్చు నాహారాది పదార్థములుఁగూడ రాక యాఁగిపోయినవి,
కోటలోని జనుల కనుదినముగా జీవనముసాఁగుట కష్టతరము
గాఁజొచ్చినది. ప్రతాపరుద్రమహారాజు నతని మంత్రులును
రెండుసంవత్సరముల పర్యంతము ముట్టడిసాగినను చాలునంతటి
సామగ్రిని ,చేర్చియుండినను కూరగాయలు, తమలపాకులు,
పాలు, పెరుగు మొదలగు పదార్థములు దుర్లభము లాయెను.
ముఖ్యాహారపదార్థము లంగడియందింకను విక్రయింపఁబడు
చుండినను ముందటివలె పుష్కలముగ చిక్కుటలేదు. ఒకటికి
పదియైనవి వెలలు. మఱియు నగరి యాజ్ఞ లేక ఏవస్తువును విక్ర
యించుటకు వీలులేకవచ్చినది. నగరిపెద్ద తలారి నాగయగన్నమ
నీఁడు వర్తకులకు మిత్తివలె దోఁచెడివాఁడు; హఠాత్తుగ నతఁడు
తనకింకరులతో అంగడులను బ్రవేశించి వర్తకుల మర్మవ్యాపార

విధానములను బరిశీలించి నగరి కట్టుబాటుల నుల్లంఘించి వేర
సారములను నడపు వాంగ బేహారులను కఠినముగ శిక్షించుచుం
డుటవలన ఎంతటిధనవంతులైనను అప్పుడప్పు డర్ధభోజనముతో
దృప్తినందవలసివచ్చెడిది. క్రమక్రమముగ మనికి సౌఖ్యము
దగ్గుటచే బ్రజలకు మనశ్శాంతి చెడెను. కలియుగరాక్షసులైన
తురకలవలనియుపద్రవము దొలఁగించుకొనుటకు మార్గములను
వెదుకసాగిరి. కష్టము లతిశయించుకొలఁదియు భగవద్భక్తియు
గాఢతరముగాఁజొచ్చెను. పట్టణపుగుళ్ళన్నియు ప్రజల భక్త్యా
దరములకు పాత్రములాయెను. ఇతర దేవతలందఱికంటె నేకవీరా
మహాదేవి అతిశయముగా వారి పూజాపురస్కారములకు గుఱి
యాయెను. ఆమె యోరుగంటి పురదేవత; మఱియు కాకతమ్మను
పైదోడు. పట్టణప్రజలను గాకతిరాజవంశమును సంరక్షింపవల
సిన బాధ్యత యామెయం దతిశయముగనుండెను; కావున
నామెయందె పట్టణప్రజలదృష్టియంతయు లగ్నమైయుండినది.

శుక్రవారము దేవికి పవిత్రమైనదినము. ఉదయము
మొదలు మధ్యాహ్నమువఱకును బలిసమర్పణము జరిగెను.
మ్రొక్కుఁజెల్లించువారుదప్ప నన్యు లెవ్వరు నప్పు డమ్మవారిని
దర్శించుటకురారు. సందె కొలువు ముఖ్యము; కుంకుమతో దేవీ
సహస్రనామార్చన జరుగుసమయ మది. దేవాలయనియోగ
ములవా రందఱును నాలాయముగ సందెకొలువునకు రావలసి
యుండెను. ఆరోజు దేవాలయ ప్రాంగణమున నెప్పటికంటె
ప్రజ మూఁగియుండినది. చంక నిఱికించికొనియుండిన జవనిక

తంత్రిని శ్రుతి కనుకూలముగ మీటుచు మొలనున్న డక్కిని వాయించుచు, బవనీడొకఁడు పరశురామునికథను పాడ నారంభించెను ; సమస్తలోకజనని ఏకవీరాంబికను మాతెత యొక్కతె సంధ్యాఘంటానిస్వనమున లీనమైపోవునట్టి మధుర స్వరమున గీర్తించుచు గానముసేయఁ దొడఁగినది; మఱికొందఱు తాళములు వేయుచు జవనికలు మీటుచు 'తక దుందు'మ్మను మృదంగశబ్దములు మోగించుచు ఏకవీరా దేవిని, మాహురమ్మను, రేణుకా దేవిని వర్ణించు తందానపదములు పాడుచుండిరి. అన్నిటికంటె హృదయంగమమైనది వీరిడాళూన్యకటీర మండలులగు శంభళీ స్త్రీలనృత్యము. వీరి పాట, తదనుగుణమైన యాట, దానితోఁగూడిన యభినయకౌశల్య మెల్లవారి మనస్సు నాకర్షించినవి. అమ్మవారి కొలువుసందడియందు నిమగ్నులై యుండిన భక్తజనులదృష్టిని ద్వారమువైపునుండి వినవచ్చు పల్యంకవాహుల హెచ్చరికధ్వను లాకర్షించెను. చెమటగారు నల్లనిబోయీలు పన్నిద్దరు 'ఓహుం ఓహుం' అను నటుపులతో నందలము నొకదాని మోచి తెచ్చి ద్వారము చెంత దింపిరి. పెద్దబోయి యందలముతలుపుం దెఱచెను. తరుణవయస్కురాలు స్త్రీ యొకతె యందుండి బయలువెడలి వెనుదిరిగి యందళములోనికి చెయిజాచెను; ఆమె కైదండ యూతగొని మేఘగర్భమును జించుకొని బయటికి వచ్చిన మెఱుపువలె నొకజవ్వని బయటికి వచ్చినిలిచెను. వెంటనే "మాచల్దేవి, మాచల్దేవి" యనుశబ్దము మాఱుమ్రోగినది దేవాలయప్రాంగణమున.

## మాచల్దేవి.

మాచల్దేవి సుప్రసిద్ధ యువతీమణి. రూపమున నామెను మించినస్త్రీ యాంధ్రమండలమున లేదనిన నతిశయోక్తి కాదు. ఆమె యందచందములను తగురీతియందు వర్ణించుటకు భాష యందలి మాటలుచాలక కవులు భగ్నయత్నులగువారు. వృత్తిచే వేశ్యయైనను నామెకుగల గౌరవమును జనానురాగమును రాణివాసస్త్రీలకుఁగూడ లేదు. కళలయందును, విద్యల యందును నామెకుగల నేర్పపారము. చక్కని కవయిత్రి; గాంధర్వవిద్యయందామె యందరికి నాదర్శప్రాయ; వీణా వాదనకౌశలమున తుంబురు నారదాదులనుఁగూడ నధఃకరించినదని సంగీతవిద్వాంసులు మెచ్చుకొనెడివారు; సంభాషణ చమత్కారమున కామె పుట్టినిల్లు. ఆమె రూపవిద్యాగుణ సంపదలచేనాకర్షితుఁడై నవలక్షధనుర్ధరాధనాథుఁడు సర్వాంధ్ర సామ్రాజ్యాధిపతి కాకతి వీరరుద్రమహీపాలుఁ డామెకూటమిఁ గోరివచ్చెను. ఆమె యా మహారాజును వలచినది. ఆయన తన్ను విడనాడిపోకుండ తన పైటకొంగునకు కట్టేయుంచుకొన వలయునని సర్వదా ఆయనమనస్సును రంజింపఁజేయుటకు సదుపాయములు వెదకుచుండెడిది. చదువుటయందును, పాడుట యందును, చతుర యగుటవలనను, వీణావాదనకౌశలమున నెఱజాణ యగుటవలనను, ప్రతిభతో సంభాషించుటయందు ప్రౌఢయగుటవలనను నామెకు ప్రతాపరుద్రమహారాజును సంతోషపెట్టుట సులభసాధ్యమాయెను. ఒక్కొక్కప్పుడు

సంస్కృతాంధ్ర కావ్యములను జదివి వినిపించి యందలివిశేషము
లను విశదీకరించి చెప్పెడిది. సంస్కృతమున వాల్మీకిరామాయ
ణమును దెలుఁగున తిక్కన సోమయాజికృత విరాటోద్యోగము
లును ఆమెకు నచ్చినవి. సాహిత్యము మహారాజునకు నచ్చక
యుండు వేళల కోకిలస్వరమున పాటలుపాడెడిది. ప్రియము
గా దేని వీణవాయించెడిది. వీణారవము వెగటుగ దోచినప్పుడు
సొగటాలాటకై యాతనిం బిలిచెడిది; నెత్తమాడుటకు ఇచ్ఛ
లేనపుడు వింతమాటలతో గారవించెడిది. మహారాజును దనకు
వశునిగఁ జేసికొనుట కామె తన నేర్పుమీఁదనే యాధారపడి
యుండలేదు. ఆయన విద్వత్ప్రియుఁడనియు, గవిజనకల్పవృక్ష
మనియు నామెకుఁ దెలియును. పేరెన్నికకెక్కిన విద్వాంసులను,
కవిశ్రేష్ఠులను నేదేని యొకవ్యాజమున దనమందిరమునకాహ్వా
నించి, వారితో శాస్త్రచర్చలను రసవిచారములను సల్పి వస్తు
వాహనములు మున్నగు నుపాయనములనొసఁగి యాదరించె
డిది. తఱచుగ నీవిద్యా వివాదములు మహారాజు సమ్ముఖము
ననె జరుగుచుండుటచేత నాంధ్రకవిపండితజనులయందు మాచ
ల్దేవి ముంగిలి ద్రొక్కనివారు లేరు. శాకల్య మల్లన, హుళక్కి
భాస్కరుఁడు, మల్లికార్జునభట్టు మొదలగు మహాకవులామె
ఈవిని రుచిచూచినవారలే. ఆపిచ్చిజంగము పాల్కురికి సోమ
నాథుఁడొక్కఁడే యామెను సరకుసేయ నిరాకరించెను; కాని
యాతని ద్విపదలయం దామె కత్యంతాభిమానము.

"వడిఁబాఱుజలమున కోడ లెల్లగాళ్లు
వడిఁగాలుచిచ్చున కోడ లెల్లనోళ్లు
వడివీచుగాడ్పున కోడ లెల్లఁదలలు."

అను బసవపురాణ ద్విపదలను మననముజేసి యందలి రచనాసౌందర్యమును పలుమారు మెచ్చుకొనెడిది. కాని యందఱి కంటె రావిపాటి త్రిపురాంతకుఁ డామె కత్యంత ప్రియుఁడు. అతని ప్రేమాభిరామ మామెకు నచ్చినరూపకము. తనచే బారితోషిక మందఱు కవులును విద్వాంసులును పొందలేదు! ఎవ్వరైనను తనమాట నెత్తిరా? అతఁ డొక్కఁడే తనకీర్తిని బ్రకటించి తన కపురిత్వమును బ్రసాదించెను. ప్రతాపరుద్రుని కాలమున నోరుగంట నక్షరాస్యులైన వారికందఱికి ప్రేమాభిరామము పారాయణగ్రంథమాయెను.

"కల్లఁజెప్పము వినుమీకుఁ గలప్రసిద్ధి
ఢిల్లిసురతాణికిని లేదు పల్లవోష్ఠి"

అనుకవివాక్యములు మెఱుఁగనివా రోరుగంట నెవ్వరును లేరు. కావుననే యామె హఠాత్తుగ నా సంధ్యాసమయమున నేకవీరామహాదేవి ప్రాంగణమున నొంటరిగ పొడచూపగనె 'మాచల్దేవి, మాచల్దేవి' యను సమ్మోదనినాదము స్వాగతమొసఁగినది.

సంభ్రమాదరములతో దనకు స్వాగత మొసఁగు జనులవంక నామె తేఱిచూడనైనను చూడలేదు. తిన్నతిన్నగా గర్భగృహమువంక నడువసాగినది. అర్చకుఁ డొకఁడు ఆమె నెదు

ర్గాని దేవికి గర్పూరహారతి యియ్యఁబోవుచున్నారనియు, దనతోఁగూడ వేంచేయవలయుననియు మఱియు నేమేమొ చెప్పఁదొడఁగెను. కాని పరధ్యానమై యుండుటచేత నాతని మాట లామె చెవిసోకియు వినరాకపోయినవి. గర్భగృహ ద్వారముకడ నిలిచి పెద్దయర్చకుఁడు అమ్మవారికి నివాళించిన కర్పూరఖండజ్వాలను భక్తులకు జూపుచుండెను. అందఱవలె మాచల్దేవియు కర్పూరజ్వాలవైపు హస్తమునుఁజూపి కన్నుల నద్దుకొనెను. అర్చకుని సమ్మతిఁగొని దేవి మూలవిగ్రహము చెంతకుఁబోయి, మెడనున్న వలుద ముత్యాలహారమును దీసి యామె కంఠమున వేసి, యామె పాదములకడ సాష్టాంగ పడెను. ముహూర్తమువఱకును లేవలేదు. పట్టణమును, మహా రాజును, ప్రజలను,తురుష్కులబారిఁ బడనీయక కాపాడవలయు నని వేడుకొనినది; ప్రాణప్రియయగు మధుమావతి నే యపాయ మును జెందనీయక సురక్షితముగ తనయొద్దకు జేర్చుమని బతి మాలుకొన్నది. కొంతసేపటికి దేవి మొగము మందహాస ముతో వికసించినది. అభయముద్రయందుండు హస్తమునుఁ జాచి, యామెశిరముపై నిడి 'లే' యనినది. మాచల్దేవికి నిదు రించి మేల్కనిన ట్లయినది. ఎప్పటివలె నమ్మవారి విగ్రహము యథాస్థానమున నుండుటను గాంచినది. చుట్టును అర్చకులు నిశ్శబ్దముగ నిలిచియుండిరి. మరల నమ్మవారి ముందు మోకా రించి కూర్చుండి యామె పాదములపై శిరమునిడి, 'అమ్మా, మహామాయి, జగజ్జనని, నాకు ప్రసన్నురాలైతివి; నాకోర్కె నీడేర్పుము తల్లీ' యని మొఱపెట్టినది.

## 5. తురకదండు విడుదల.

సందేశాము—తురకదండు సమీపించినది. వేలకొలఁది గుఱ్ఱముల డెక్కలచే రేగిన రజోధూళి యాకాశము నావరించి, గాలిచే దఱుమఁబడిన మేఘపుంజమువలె క్రమక్రమముగఁ బైకొని, దగ్గరకు వచ్చుచుండెను. దూరమునుండి యస్పష్టముగ వినవచ్చుచుండిన గుఱ్ఱపునడక నడి రానురాను స్పష్టతరముగ విన నారంభించెను. సముద్రఘోషమువలె నొక మహారావము వాతావరణము నందంతటను నిండుకొనెను. పురపరిసర ప్రదేశమునందు కృషికర్మను సాగించుచుండినవారు తమ పనులను వదలిపెట్టి యథాయథలై, యనుకూలస్థలముల కాత్మసంరక్షణార్థము పరుగులిడ నారంభించిరి. కొందరు పుట్టకోటలోనికిఁ బాఱిరి. మఱికొంద అనుమకొండ పురప్రాకారము మఱుఁగుజొచ్చిరి. కోటదర్వాజాలు మూయఁబడెను. అనుమకొండ ద్వారముఁగూడ వాని ననుసరించెను. అచట నచట నప్రమత్తులై యుండినీ మఱికొందఱు, సమయమున సురక్షితస్థానమును జేరఁజాలక, తోటలయందును నుపవనములయందును దాఁగుకొనుట కనువైన గుప్తస్థానములను వెదుక నారంభించిరి.

చీఁకటి వాలినప్పటికి కోట గోడ క్రిందికి వచ్చి చేరినవి సుల్తానుదళములు. మొదట నెలగోలు గుఱ్ఱపుఫౌజు; దాని వెనుక పాయదళము; దాని వెనుక వస్తుసామగ్రులను మోచుకొనివచ్చు పెటికెల యెడ్లును కంచరగాడిదలును, నుష్ట్రవర్గ

మును; వస్తుసామగ్రిని రక్షించుచు నెడవంకను వలవంకను నశ్వా
రూఢులైన ఖురాసాని విలుకాండ్రును, వారి ననుసరించి తురగ
బహుళమైన ప్రధాన సేనాభాగమును; దానిపిమ్మట యుద్ధపు
టేనుఁగు ఘటలును నడచివచ్చెను; పాళెము దిగ నాజ్ఞాపించు
నగార మ్రోగెను. ఎవ్వఱి కనుకూలమైన తావుల వారు
విడుదు లేర్పఱచుకొనవలయునని నల్లూఘఖానుని యుత్త
రవు ఫౌజులోని బారుబారునకును బ్రాకెను. స్కంధావారము
నంతటను అలబలముపుట్టెను; ఒండొరులఁ బిలుచు సైనికుల
యఱుపులును దమ తమ యనుచరుల నాజ్ఞాపించు దళనాయ
కుల ధృష్టవాక్యములును, పెరికెలయెడ్ల యంబారవములును
హయహేషలును, గజఘీంకారములును గలసి భూనభోంత
రాళము నొక యవ్యక్తశబ్దపూరముతో నింపివేసినవి. సైని
కులు తమ యునికిపట్టుల నేర్పఱచుకొనఁగడఁగిరి; కొందఱు తమ
తమ వాహనములనుండి పన్నాగమునూడ్చి వానిని విడుచు
చుండిరి; గుడారములను పందిళ్లను మసీకులను కొందఱునిర్మింప
నారంభించిరి. సేనావారమున వలయు పదార్థములను విక్ర
యించుటకొఱకు బంజారులు మొదలగు దండు బేహారులు
మండిగల నెత్తగడఁగిరి. శిఖరముల నెత్తించి తమ మిత్రులకు
దమ యునికిపట్ల నెఱుకపఱచుటకై వానిపై తమ చిహ్నము
లను గొందఱు నిలుపుచుండిరి. గుడారములేని సామాన్య
సైనికులందఱు బావులు చెఱువులు మొదలగు జలాశయముల
చెంత నచటనుండు చెట్లకొమ్మలను నఱికి పందిళ్లు వేసి, యారా

మములందలి పూబొదరిండ్లనుగోసి తెచ్చి పచ్చియాకులతోఁ గప్పులు పెట్టుచుండిరి; పనిచేయ నోపికలేనివారు చెట్లక్రిందను క్రీడామంటపములందును వసతు లేర్పఱచుకొనుచుండిరి. తమ శిబిరములను వేసికొని కొందఱు వెనుకచిక్కిన తమవారలను వెదకుచుండిరి. స్కంధావారమును సంరక్షించుకొఱకు, సుల్తానుజాదయుత్తరువు మేరకు దానిచుట్టును కొయ్యసామానులతో గొందఱు ఖత్కరును గట్టుచుండిరి. చెట్లన్నియు యుద్ధపు టేనుఁగుల కాలానములాయెను. బహిరంగస్థలములన్నియు అగాడీపిఛాడీ మేకులతో నిండెను.

## కాఫిర్ ఔరత్.

ఉల్లూఘుఖానుడు మాచల్దేవి యారామమున విడిసెను. దిగుడుబావిచెంత సుల్తానుగారి తోపుడేరా; దాని కించుక తూర్పున యుల్లూఘుఖానుని తెల్లగుడారము; అతని నాంతరంగికులగు నుమ్రాలడేరాలు దాని కనతిదూరమున వేయవలసిన ట్లాజ్ఞయాయెను. కార్ఖానాధిపతి గుడారములను నిలుపఁదగిన తావులఁ గొలిపించి వాని నెట్లు వేయవలసినది పనివారలకు వివరించి చెప్పుచుండెను. సుల్తానుజాదాగారి గుడారము వేసియాయెను. ఉమ్రాల శిబిరములు కొన్నియరగొఱగ ముగిసినవి. మఱికొన్నిటికి స్తంభముల నప్పుడే నిలువఁబెట్టి టరిగుత్రాళ్లను బిగించుటకు మేకులు కొట్టుచుండిరి. క్రీడామందిరమునకు సమీపమున సగము వేయఁబడిన నీలిడేరాయం దుమ్రాయొకఁ డొక చార్పాయి దగ్గరనిలిచి కూచిచేయునపుడు ధరించి

యుండిన దుస్తులును దీయుచుండెను. అంగతలత్రమును శిర స్త్రాణమునుదీసి సమీపమున నిలిచియుండిన సిలెహ్దారు చేతికిచ్చి మొలనుండు కమ్మర్బందును సడలింపనారంభించెను. ఇంతటనె డేరా వెలుపల చప్పుడు వినవచ్చినది; మొదట నతఁడు డేరావేయు పనివాండ్ర శబ్ద మనుకొనెను; కాని యాలకించివినగా నది బల వంతముగా మనుష్యుల నీడ్చుకొనివచ్చు కాళ్ల చప్పు డైనట్లు తోఁచెను; పరిశీలించి చూడవలయునని యెంచి యా యుమ్రా డేరావాకిటివైపు పోకయడుగు బెట్టెను. ఇంతటనే జమేదా రొకఁడు, డేరావాకిట తెరను దొలఁగఁద్రోసికొని లోపల బ్రవే శించి వంగి సలాముజేసి, 'సర్దార్ సాహేబ్, ఏక్ కాఫీర్ ఔరత్కు, చార్ పాంచ్ కాఫీర్ షైతాన్లకి పకడ్లేవుచేసి తెచ్చి న్యాన్; సర్దార్ వారి హుకుం అయితే లోపల్కి తీస్కొన్వచ్చి, తమ్రాకి సిపుర్దు చేస్తాన్. ఏంహుకుం హుజూర్' అని యడిగెను.

''సుబ్హానల్లా! ఔరత్కు పకడ్లేవ్ చేసిన్యావు? అందర్కి జల్దీగా తీస్కొరా'' యని యతఁడు ఆజ్ఞ చేసెను. వెంటనే జమా దారు డేరావెలుపలికి పోయి మరల నిద్దఱు విచ్చుకత్తుల సిపా యీలమధ్య విఱిచికట్టిన చేతులుగల జవ్వనిని, నలుగురు పురు షుల నడిపించుకొని లోపలికి వచ్చెను. ఆ జవ్వనిని జూడగనే యా యుమ్రాచిత్తమున కొంచము తొట్రుపాటు కలిగినది, ఎవ్వతయో కూలిపనివలన జీవనముజేయు సామాన్యస్త్రీ జమా దారుచేతికి చిక్కియుండునని యాతఁడు తలచెను. కాని యామె మనోహర సౌందర్యమును చిన్నవోయినను చెన్నుదరగని ముఖ

విలాసమును నాతనికి విభ్రాంతి కలిగించినవి; చిత్తమున నేదో నూతనభావము మొలకెత్తినది. జమూదారున కామెను బంధ విముక్తురాలిని సేయుమని యాజ్ఞాపించెను; అతఁ డాయాజ్ఞ నిర్వహించినపిమ్మట తక్కిన కైదీలను దోడ్కొనిపొమ్మని యుత్తరువిచ్చి వారితోఁగూడ నాతఁ డచటినుండి పోయిన పిమ్మట, నామెతట్టు తిరిగి యామెను ప్రశ్నింప నారంభించెను.

"అయేపరీ, నామెషుమారా చీస్తు?"

"..............."

"జబాని పార్సీ నదాని?"

"................"

"దర్ జబానీ తిలింగ్‌గూయి, నీపేరేమి?"

అతఁడడిగిన విషయ మామె కప్పుడు బోధపడినది; వెంటనే కొంచెము వెళుచుమాటలతో చెప్పినది జవాబు. "నాపే రేమైన తమకెందుకు? ఎవతెనో పేరులేని నిర్భాగ్యు రాలిని; నా దురదృష్టమువలన మీ చేఁజిక్కితిని."

"నాకి రాస్తీ జవ్వాబ్ చెప్తావు లేదు?"

"రాస్తీయో పాస్తీయో నీతురకగోడు నాకేమి దెలియును?"

"తెల్వోదూ నీకి? జవ్వాబ్ చెప్పు లేకోపోతే—"

"లేకపోయిన నేమిచేయుదువు? చంపెదవా? ఈ తురక రాక్షసుల చేఁబడినవారికి, చావుదప్ప మఱి ఏమి కలుగును?"

"నేను ఎవోరి తెల్సా నీకీ?"

"ఎవ్వరైన నాకేమి?"

"నీకీలేదు భయం?"

"భయపడి ఏమి లాభము. చావునకు తెగించినవారికి సముద్రము మోఁకాటి బంటి లోఁతేఁట!"

"నాకి చిక్కిన్యావ్ - మాతుర్క యుద్ధపు చట్టప్రకారం నీవు నాకి దాసి అయిన్యావ్. నీకీ నేను బీబీ చేస్కుంటాన్. నిఖాకర్డాగ్."

"తురకలు పశుప్రాయులని మావారు చెప్పుదురు; దానికిది నిదర్శనము."

"నిదర్షణం? నేను చార్పాయి జానవ్వరా? పినో ప్యారక్. నేను జానవ్వరుకాను! ఇన్సానమ్; బల్కే షాఇరమ్; నాకీపేరు ఉబయద్; ఇంకా, సూల్తాన్ జాదాలేదు మహమద్ ఫక్రుద్దీన్ జూనాఖాన్ బిగతుఘ్లుక్, ఆయ్నా నాకీదోస్తు. నేగ ఏంచెప్తే అదిచేస్తాడు. నిల్వామంటే నిల్వాలా కుంకోమంటే కూకాల్వాలా. నాకీ షాదీ చేస్కో నేను నీకీ గులాం అయితాగ."

అతని మాటలు వినఁగానే ఆమెకు యోచనకలిగినది. అతనిచేఁజిక్కినది; పులివాతి కండవలెనైనది తనగతి. తప్పించుకొనిపోవ సాధ్యముకాదు. ఇష్టముండినను లేకపోయినను వాఁడు తన్ను విడువఁడు. వానితో వ్యర్థముగ వికటించి తాను పొందు లాభమేదియు గానరాదు. ఇంతవఱకు ఉబయదు ఘనతపినియున్నది. అతఁడు సామాన్యుఁడుకాఁడు. మహర్షియని

ప్రఖ్యాతినందిన హాజరత్ నిజాముద్దీన్ ఔలియాగారిశిష్యుఁడు. మహాకవులని జగత్ప్రఖ్యాతినందిన ఆమీరుఖుస్రూ అమీరు హాసన్ డిల్హావీల సంగడికాఁడు. కవిమాత్రుఁడు కాఁడు. జ్యోతిష శాస్త్రవిశారదుఁడు. సూల్తాన్ జాదాగారికి జ్యోతిషమున గాఢ విశ్వాసముగలదని జనవాక్యము. అతఁడు తన కనుకూలుఁడైన, నతనిమూలమున తనకేమైన లాభముగలుగదాయని చింతింపఁ గడఁగినది. చీఁకటింటఁ బొడకట్టిన దీపశిఖవలె నూతనముగ నంకురించిన యాశ యొకటి వాడుబారిన పుష్పలతకు వర్షపాత మట్లు ఆమె ముఖమును వికసింపఁజేసినది. ఆమె ముఖ వికాసమునుగాంచి ఉబయ్యదామె తనకు బ్రసన్నురాలాయె నని నిశ్చయించి యామెను జేరఁబోయి మృదులములైన యామె హస్తములను రెండుచేతులఁ బట్టుకొనెను. ఆమె మనసునం దేమనుకొనెనో తెలియదు. అతని సాహసముచే సబ్బురాలైనదేమొ అతని వారింపదాయె.

## 6. ఉబయ్యద్ జో న్యుఁడు

గుడారతలమంతయు నిండఁబఱచియుండిన మెత్తని పారశీ తివాసిమీఁద వేసియుండిన దమస్కసు పట్టుపఱుపుపై మెత్తని యొఱుగుదిండు నానుకొని కూర్చుని యున్నాఁడు ఉబయ్యదు. పఱుపున కొకవైపున నతని ఢిల్లీముచ్చలజోడు. ఎదుట నుండు హుక్కాపాత్రనుండి చుట్టచుట్టుకొని నిద్రించు పాము వలెపడియున్నది హుక్కాగొట్టము. మఱియొకవైపునుండు కురుచ మేజామీఁద షరాబునించిన గాజుపాత్రయు, రెండు

మూఁడు ప్యాలాలును బెట్టియుండినవి. కాని యతఁడు హుక్కాగొట్టము స్పృశించనైన లేదు; షరాబుపాత్రము వంక దృష్టినైన బఱుపలేదు: పింగళవర్ణములైన యతని నేత్రము లర్ధనిమీలితములై యుండినవి; ముఖము చింతానిమగ్నతను సూచించుచుండినది. అతిసిగూఢమైన మహాసమస్య కతఁడేదో సమాధానము వెదకుచున్నట్లు తోఁచినది. కొంత సేపటికి చెయిజాచి కుడిప్రక్క యొరుగుదిండుపైనుండు పుస్తకముఁ గొని, కుడిచేతి నడిమివ్రేలిని నాలుకపై నిడి తడిజేసికొనుచు పుటల నొక్కొకటిగా దిరుగవేయ నారంభించెను. కాని పుస్తకమును జదువలేదు; అతని మనసున కేకాగ్రత చెడినది. వెనుకప్రక్కనుండి సన్నని యలుకుఁ డాతని చెవిసోకినది. పుస్తకమును మూసి యతఁడు యథాస్థానముననుంచి వెనుకకు తిరిగి చూచెను. చిలుకయొకటి గుడారపు అంతర్భాగమునుండి యెగిరివచ్చి అతని వెనుకనుండు డేరాస్తంభమున వ్రేలుచుండిన కమర్బందుతోటి ఖడ్గముపిడిపై వ్రాలియుండినది. వాకిటి కడ్డముగ తెరగ వేసియుండిన కుసుమ్భరాగపు సూరవరపు దుప్పటి యొకమూల కీడ్వఁబడి ద్వారమున నొక స్త్రీ నిలిచి చిలుకవంక దృష్టి సారించుచుండినది. ఆమె ధరించియుండిన జరీబుటాపూల సన్నని యాకుపచ్చ పట్టుపైజామా; ఆవన్నె చీనా పట్టు అంగరకా, బురుసా పైరుమాలులవలన నామె యవన స్త్రీ యనుభ్రమను గల్గించుచుండినను చంద్రుని మచ్చవలె నామె ముఖజ్యోత్స్నకు మెఱుఁగు గలిగించు సన్నని కస్తూరి నామ

మా మె హిందూ నారీమణి యని ప్రకటించుచుండినది. మెడ నుండు కట్టాణిముత్యాలహారమును, సీలాలకములతోఁ గూడిన మోమును మబ్బు చాటుననుండి తొంగిచూచు తారాచంద్రు లను స్మరణకుఁ దెచ్చుచుండినవి. ఆమె మోహన స్వరూపము గన్నులఁబడగనే యబయ్యాదునకు నూతన చైతన్యముఁ గలిగి నది. దేహమాద్యంతము గగుర్పొడిచినది. తాను కూర్చుండి యుండిన పఱుపుమీఁద నొకమూల కొసరిలి 'ఆయియే. జానె జాఁ'అని తన ప్రక్కతావుచూపి కూర్చుండ రమ్మని యాహ్వా నించెను. మెత్తమెత్తని యడుగులతో నామె తిన్నఁగ లోనికి వచ్చినది; అత్తరువాసనలు డేరాయంతటను గుబులుకొన, వచ్చి యతని నొరసి కూర్చుండినది. ఆ సువాసన యతని నాసాపుట ములు సొరగనే యతని రక్తమునకు పోటు రేఁగినది. ఆమె మెత్తని వ్రేళ్లతో జందఱచందఱ్యైయుండిన గడ్డమును పుణికి చిక్కుడలించి మిసమిసలాడుచున్న బోడితలను మెల్లఁగ నిముర మొదలిడెను. అతని యానందము మితిమీఱినది; రెండుచేతుల నతని కపోలద్వయమునుబట్టి, ముఖమును ముఖమునకుఁ జేర నీడ్చుకొని ఫాలతలమును మూర్కొని కన్నుల రెంటిని ముద్దు గొనినది; అంతట నతనికి బ్రజ్ఞమీఁద పట్టుతప్పి యామెకు సంపూర్ణముగ వశంవదుఁ డాయెను.

అడిగినది ఆమె. 'తాము ఎప్పటివలె ఖుషీగా నుండక విచారముగ నున్నట్లు కానవచ్చుచున్నారే, కారణమేమి? యుద్ధమునందు ఏమైన వైపరీత్యము గలిగినదా ? లేక ఖయా ల్బాసు సుల్తాన్ జాదాగారేమైన నుపద్రవము గలిగించిరా?'

"వైపరీత్యం జంగ్ మేఁ? హాఁ వైపరీత్యంవుంది, లేదు."

"ఇట్లు విరుద్ధపు జవాబుచెప్పిన నాకేమి తెలియును."

"విరుద్ధం? షినోజానెమర్. ఒకప్రచ్ఛం చూస్తే వైపరీత్యం వుంది; పచ్ఛాంతరం చూస్తే లేదు. కాఫిరాన్కీ మాకీ యుద్ధం కాలేదు. సాత్ ఆట్ మాహానుండి కిల్లామాకీ గిరిఫ్తు కాలేదు. ఏమి మార్పు నహీఁ. అవుతే మేం కిల్లా జరూర్గా గిరిఫ్తుచేసి జల్దీ డిల్లీకి సుల్తాన్‌వారి పాబూస్సీంమ్‌డానికి పోవాలా అని సుల్తాన్‌జాదాగారి ఇష్టం. పాపీ తిలంగి దుష్మన్లు రస్తామే డాక్ చౌకీలకీ నాషనం చేసిన్యార్. ఇక్కీ ఖబర్ ఢిల్లీకి తెల్వదు. సుల్తాన్‌వార్కి కోపం వచ్చింది. ఖత్మీద ఖత్ నవిష్తు చేస్తున్నారు. సుల్తాన్ జాదాగార్కి కోట తొందర్గా పట్వాలనీవుంది. కాఫీర్లు అజీమతాక్లేరు."

"మీరేమి చేయగలరు?"

"మాకీ సుల్తాన్‌జాదాగారు జోష్యం చెప్మనీ సలహా అడిగిన్యార్."

"ఏమని జోస్యము?"

"కిల్లా ఎప్డు గిరిఫ్తు అయితుందని."

"ఎప్పుడు స్వాధీనమగును?"

"అఖ్తర్లు వుండే తర్వా చూడ్వాలా."

"ఎప్పుడు తెలియగలదు."

"ఎక్ హాఫ్త్‌లో."

“నక్షత్ర విద్య మీకు హృదయకవిలేకదా, గుణించి గ్రహచారఫలము కనుఁగొనుటకు మీవంటివారికిఁగూడ నొక వారము పట్టునా ?”

“నేఁ బడా అఖ్తర్ షుమా రని చెప్తారు లేదు అది నిక్షయం. కానీ బాగా దర్యాప్తుచేసి ఆస్మానీ చహ్ర్ తెల్సుకోవడం ముష్కిల్. హప్త్ కాలం చాలాస్వల్పం.”

## 7. పోయినచిలుక.

అందలమువచ్చి వాకిట నాగినది. మాచల్దేవి చెలితోఁగూడ వెలువడినది. ఆమెమన సింకను నేకవీరామహాదేవి పాదములయందు లగ్నమైయుండెను. కీలుద్రిప్పిన జంత్రపు బొమ్మవలె నడువసాగినది మందిరములోనికి. కడపచెంతకు జేరునప్పటికి మీఁదవచ్చి వాలినది, యెచ్చటనుండియో రెక్కలు తటతటగొట్టుకొనుచు జిలుకయొక్కటి. అదివచ్చి మీఁదవ్రాలగనే కూడవచ్చుచుండిన చెలియన్నది, ‘అక్కయ్యా, అక్కయ్యా,’ ఇది పాఱిపోయిన పెంపుడుచిలుక; మెల్లగ పట్టుకొనుడు, మరల నది ఎగిరిపోకముందే.’ యని, మాచల్దేవి యామాటలవిని దీర్ఘసమాధినివీడి బహిఃప్రపంచముపై దృష్టిసారించు యోగినివలె చైతన్యమును బొందినది. మెల్లమెల్లగ చేతిని భుజముమీఁదికిఁ జాచి పట్టుకొనినది. అవును అది తన పెంపుడుచిలుకయే. అదుగో మధుమావతి దాని మెడనుగట్టిన కట్టాణిముత్యాలపేరు. అది తప్పించుకొని పోయి నెలరోజులు కావచ్చుచున్నవి. ఎచటనుండినదో ఇన్ని

రోజులు? అని యోచించుచు దానివంక జక్కఁగాఁ దేఱిచూచి నది. దాని రెండుకాళ్ళకును నేవో కట్లుకట్టియుండినట్లు తోఁచెను. చెలితోఁగూడ మోసాలజొచ్చి యచ్చటి యూయల మంచముపై గూర్చుండి కడు జాగరూకతతో విప్పినది కట్లను. ఏమియుఁ గానరాలేదు. రెండుకాళ్ళకు జుట్టియుండిన రెండు వలిపెపుపేలికలుదప్ప మఱి యేమియు లేదు. చిలుక కాళ్ళపై నొక గాయమేనియు గనఁబడలేదు. మఱి యాకట్లేల ? అం దేదో రహస్యముండవలయును. జ్ఞప్తికివచ్చినది. ఒకనాఁడు మహారాజుగారును, ప్రధాని యన్నయ్యగారును, శివ దేవయ్య మొదలగు మంత్రివర్గమును క్రీడామంటపమున గూడియుండినపుడు పాండ్యదేశమునుండి యొక రసవాది యదృశ్యమషీరసమును తయారుచేసి తెచ్చినాఁడని మాటల సందర్భమున నెవ్వరో చెప్పిరి. గుడ్డపై గాని కాగితముమీఁద గాని యా మషీరసముతో వ్రాసిన వ్రాఁత తడియాఱఁగనే యదృశ్యమగుననియు, జెమ్మతగిలిన మరల గానవచ్చుననియు ననుకొనుచుండిరి. అట్టి రహస్యపువ్రాత యా పేలికలమీఁద దాగియుండునా? అని కొంతసేపు చింతించి పరిశీలించి చూచు తలఁపుతో నొంటిగ శయనగృహమునకుఁ బోయినది. మంచము ప్రక్క ముక్కాలిపీటపైనుండు పన్నీటితిత్తిని గొని యా పేలి కలపైఁ బన్నీటితుంపురులను జిలుకరించినది. చెమ్మగిల్లఁగనే కానవచ్చినవి యొక్కొక్క పేలికమీఁదను నొక్కబంతి వింత యక్షరములు; కాని వానిం జదువుటకు మాచల్దేవికి శక్యము

గాలేదు. స్త్రీస్వభావమువలన యంతరార్థమును గనుఁగొనవల యునని యామె కత్యంతమైన జిఘృక్ష గలిగెను. రాజధాని యందంతటను ఆరహస్యమును విప్పి చెప్పఁగల వ్యక్తియొక్కఁడే. ప్రధాని యన్నయగారి కొక్కరికే యాధునిక లిపులను బోలి ప్రాతవ్రాతలు గరతలామలకములు. ఆయనగారిని దర్శించిన గాని వాస్తవము తెలియరాదని నిశ్చయించుకొనెను.

## 8. అలుఁగులేని బాణము.

పట్టణమున నసాధారణమైన సంచలనము పుట్టెను. తురకదండు కోటను లగ్గలుపట్టుదురని వార్త యెల్లయెడల వ్యాపించెను. వారి పెద్ద జోస్యుఁడు గ్రహముల చర్యను జక్కఁగ పరిశీలించి నెలరోజులలో సుల్తాను జాదా గారికి కోట పట్టుబడునని జోస్యము జెప్పెనట. తన జోస్యము తప్పిన తన తల నిచ్చెదనని ప్రతిజ్ఞచేసెనట! నిజ మెవ్వరికి తెలియును? కాని ప్రధాని యన్నయ్యగారును మహారాజుగారును దుర్గ పాలకుఁడు నాగయ గన్నమనేని నగరికిఁ బిలిపించి తురక లేక్షణమునందైనను లగ్గలు పట్టవచ్చుననియు, రేయింబవళ్లు కోటను అప్రమత్తులై సంరక్షింపవలయునని యాజ్ఞాపించినది మాత్రము నిశ్చయము. మఱియు గోటబురుజులకు డెబ్బది యైదింటికి గావుండు డెబ్బదియైదుగురు నాయకులను బిలిపించి తమతమ బురుజులను తురకలచేఁ బడనీయకుఁడని యుత్తరువు చేసి నిండుకొలువునందు వారినెల్ల ధనవస్త్రవాహనభూషణాదు లతో సత్కరించిన విషయము నందఱెఱిఁగినదే. మఱియు రావు

సింగమనేఁడు, పోలయరెడ్డి, పోతుగంటి మైలినేఁడు, గోంకారెడ్డి, పెద్దరుద్రుఁడు మున్నగు శూరులు దమ తమ పరివారములతోఁ గూడ నవసరములగు తావులకుఁబోయి పోరుటకు సంసిద్ధులై వారివారి విడుదలయం దుండుటయు సర్వజనులకు విదితమే. ఈ ప్రయత్నములను జూచి ప్రజలు దురకలెప్పుడు పైఁబడుదురో యని భయమంది ఆయుధపాణులై యెవ్వరి గృహములకడ వారు గాపుండిరి.

పట్టణప్రజలంద అలజడిపడియుండినను, నాలుగైదు రోజుల పర్యంతము ఢిల్లీఫౌజు లెప్పటివలె జాగరూకతతో నుండిరి; కాని కోట లగ్గలు పట్టు ప్రయత్నము సేయరైరి. తరువాత మంజనీకులను యవనాగ్నిజ్వాలలను వెదజల్లు పాశ్చాత్య యంత్రముల ననుకూలమైన తావుల కోటగోడలకు సమీపమున దెచ్చి నిలువఁబెట్ట నారంభించిరి. మరుసటి యరుణోదయముననె కంపిలిద్వారము పై యుద్ధపుటేనుఁగు ఘటను డీకొల్పిరి. ఉదయమంతయు నేనుఁగులు దర్వాజా కంచు తలుపుల నశనిసంకాశములగు తమ కుంభస్థలములతో బొడువ నారంభించెను. కోటగోడలు భూకంపమునకువలె నదురగడ గెను; పిడుగులుబడిన ట్లేనుగుఁల సంఘట్టన శబ్దము పట్టణము నందంతను మారుమోగుచుండెను. కోటగోడలు చెక్కుచెదరలేదు. కంచు తలుపులయం దొకబీటికయేనియు గానరాలేదు. అంతట విసివిరేమొ తురకలు తమ యత్నము నప్పుడు మానుకొనిరి. కాని యాసంధ్యాసమయమున దేవర

బురుజుపై మంజనీకులనుండి శిలావర్షము గురియించిరి. మఱి యొకనాఁడు వేకువజామున, ధరణికోట గవనికడ యవనాగ్ని వ్యాపించి గోడలపై బ్రాక నారంభించెను. గోంకాయరెడ్డి తన యనుచరులచే నచట సేకరించియుండిన ఇసుకను దెప్పించి యగ్నిజ్వాలలపై గుమ్మరింపించి చల్లార్పించెను. ఇట్లు అనుదిన మేదియో యొక క్రొత్తవిషయము జరుగుచుండినను కోటను లగ్గపట్టుటకు తురకల కెచటను సందుదొరకదాయె.

ఆరోజు ఆషాఢ బహుళ అమావాస్య. దినమంతయు ఆకాశము మేఘాక్రాంతమై సన్నసితూర పడుచుండినది. అస్త మయ మగునప్పటికి ఉత్తరపుగాలి రేఁగినది; మేఘము గాలిచే గొట్టుకొనిపోవునని తలఁచిరిగాని యట్లు జరుగదాయె. చలి, సన్నతూర వర్షముగామారినది. నేలయందప్పుడె చలపలు చల పలుగ నీరు నిలువఁదొడఁగెను. కటికచీఁకటి. బారెడుదూరమున నే ముండునదియు కానరాకుండెను. తురకల స్కంధావారము మాటుమణిగి నిశ్శబ్దముగ నుండెను. ప్రతిదినము వారి శిబిర ములనుండి గానవచ్చు నెగడీల పొడయైన గానరాదాయె. అప్పు డప్పుడు గన్నమనాయుఁడు తలారి బలగముతోఁగూడ సోదన దివియలఁగొని గస్తితిరుగుచుండెను. గమనింపఁదగిన యంశ మేమియు గానరాలేదు. హనుమంత భీమసేన బురుజులమధ్య వారు పరిశీలించుచు తిన్నగ సాగుచుండఁగా వినవచ్చినది, నిశ్శబ్ద ప్రపంచమును జీల్చుకొని గుడ్లగూబ హుంకారము. ఎచటి గస్తివా రచట నాఁగిపోయి సోదనదివియలు వెలుపటికి

జూచి చూచిరి. ఏమియు గనంబడదాయె. అది కేవలము గూబ యఱపేయని నిశ్చయించి యచటనుండి తరలిరి. ఇంతటనె వచ్చిపడినది, నాగయ గన్నమనేని శిరముపై నొక బాణము. దాని యాకస్మికతవలన నాతఁడు దద్దరిల్లెను. చిత్రము, అతని కేమియు గాయము తగులలేదు. అచ్చెరువందుచు క్రిందఁబడి యున్న శరమును చేత నెత్తికొని, యాతఁడు దానిని దివ్వెసమీపమునసుంచి చూచెను. బోధపడినది గాయముతగులక పోవుటకు గారణము. అది సామాన్యమైన బాణముగాదు; దాని కలుఁగు లేదు. అలుఁగునకు బదులు దాని కొక సన్నచీటి చుట్టియుండెను. తొట్రుపడుచు నతఁడు దానిని విప్పిచూచెను.

"మేలుకో నాగన్న, మేలుకోవయ్యా! చీకటిలో దయ్యాలు చెలరేగునంటా." అనుపాట మొదటిచరణము వ్రాసియుండినది. దీనివలన నాగమనేఁడు రానున్న యాపదను దప్పించుకొనుమని యెవ్వఁడో యజ్ఞాతమిత్రుఁడు దన్ను హెచ్చరించుచున్నాఁడని తెలిసికొనెను.

అర్ధరాత్రి. వాయుచలనమువలనఁ గలుగు వృక్షఘోషము సత్త్వహీనముగ వ్రాలు నాదారు చినుకుల సడియుఁ దప్ప మఱి యేశబ్దమును వినరాదాయె. పట్టణములోని ప్రజలు నిదురించుచుండిరి; చలిగాలితాకుడు కోర్వజాలక తురుష్క సైనికులు తమ శిబిరములయందు ముడిగికొనిరి. కోటకావలి బలము బురుజులను నలంగములను నాశ్రయించెను. గస్తి తలవరుల పొడ కానరాలేదు. ఆ చలియందు శత్రువులు కోటపై

రాజాలరని చింతించిరేమొ. క్రిమికీటకాదులు సైతము సుషుప్తి నందినవి. కాని భీమసేనబురుజుప్రాంతమున నెచ్చటనో సన్నని యలుకుడైనట్లు తోఁచినది. బురుజునకు గొంత దూరమున గాలికి గదలు చెట్టునీడవలె కోటగోడమీఁద నెద్దియో తారుచుండునట్లు సంశయము గలిగినది. అది కేవలము భ్రమజనితము గావలయును. కన్నులు గానరాని చీఁకటి. మఱియు నాబురుజుప్రాంతమున చెట్టు పుట్టలెవ్వియు లేవు. ఇఁక నీడ కదలుట కవకాశ మెచటిది? కాని యీ నీడ రానురాను అభివృద్ధిచెందినట్లు తోఁచినది. ఒకటి, రెండు, పది, యేఁబది, నూఱు...ఏమి చిత్రము! సడిచప్పుడు లేక నడయాడుచున్నవి. పిశాచములా......

హఠాత్తుగ వెలువడినవి హనుమంత భీమసేన బురుజుల నుండి జోదనదివియలు నూర్లకొలఁది చీఁకటిని జించి పట్టపగలు గావించినవి. అవి నీడలుగావు, పిశాచములునుగావు. నల్ల యుడుపుల తురక సిపాయీలు. అప్పుడే కోటగోడపై గొందఱు, కోటగోడ క్రిఁద పెక్కురు, గోడలకు వేసియుండు నిచ్చనలపై నల్పసంఖ్యాకులు; కందకమున కవ్వలిప్రక్క ననేకులు గానవచ్చిరి. మోగిన దాకస్మికముగ పుట్టకోటలో రణభేరి. పడకలనుండి యులికిపడిలేచి వీధులవెంబడి దెసదెలియక పట్టణప్రజ పరుగిడ నారంభించెను. తురకలు పట్టణమును బ్రవేశించిరని భ్రమపడి యెచటివారచటనుండి పాఱిపోగడగిరి. కాని గన్నమనీఁడును నతని తలవరులును సందులయందును వీధుల

మొగాళములను శృంగాటకములమధ్యను నిలిచి యెచట గానవచ్చిన ప్రజ నచటినుండి వారివారి గృహములకు మరలుచు చుండిరి.

పెద్ద రుద్రుఁడు కమ్మ పాయదళముతోడను, రావుసింగము నీఁడు వెలమ యీటెగాండ్రతోడను భీమసేన బురుజుచెంతకు పరుగుపరుగునవచ్చి కోటగోడలపై నిరుపార్శ్వములను బాదువు కొనిరి. కాని యల్పసంఖ్యాకులైనను మొదట కోటగోడల మీఁది కెక్కి యుండిన పఠాని ఖురాసానీ సిపాయీలు లగ్గలు పట్టుటయం దారితేరిన యోధులగుటచేత కమ్మ వెలమశూరుల నెదుర్కొని వారి కుచితరీతిని స్వాగతముఁ జెప్పిరి. గోడలమీఁద తురకల సంఖ్యను హెచ్చనీయక క్రిందనుండువారిని పైకెక్కి రానీయకుండుటకై యుడుప నిచ్చెనత్రాళ్లను నఱికివేయవలసి నది హిందువుల ప్రధానకర్తవ్యము. హిందువులను నిచ్చెన సమీపమునకు జేరనీయక బాణఁదోలి క్రిందనుండు తమవారం దఱును మీఁదికెక్కివచ్చుట కవకాశము గలిగింపవలయునని ముసల్మానుల యత్నము. రెండుపక్షములవారికిని చేతులు చేతులు గలసినవి. భీషణమై యారంభించినది తుములయుద్ధము. ఉడుప నిచ్చెనల కడ్డముగ యవనులు బారగిలిన యర్ధచంద్ర వ్యూహమును బన్ని నిలిచిరి; ఒక భుజమున నఫ్ఘానులు; మఱి యొక భుజమున ఖురాసానీలు ; మధ్యనిలిచినాఁడు మల్లు అఫ్ఘా నుఁడు హారమునందలి పదకమువలె. కొండంతటి మనుష్యుఁడు; అంతటి శరీరముగలవాఁ డగుటచే 'పీల్తనుఁడ'ని యతనికి

మారుపేరు; మేఘగర్జనవంటి గొంతు; ఏనుఁగు తొండములను బోలిన హస్తములయందు డమూస్కుసు పట్టాకత్తులనుఁ బట్టి శత్రుల దగ్గర జేరనీయక విసరుచుండెను. అనుక్షణమును పైకి ఎక్కి వచ్చుచుండు తురకమూకల నాప నిశ్చయించి వెలమ కమ్మగడలఫౌజు నిమిషనిమిషమునకుఁ గొండసానువులఁ దాకి చిందఱవందఱలై పోవు కడలి తరంగములవలె మహమ్మదీయ వ్యూహముపైఁబడి ఛిన్నభిన్నముగ వెనుదిరుగుచుండెను.

ఇంతటనే వినవచ్చినది కంపిలి దర్వాజ ప్రాంతమునుండి కలకలము. దాని నాలకించి గోడలమీఁద యుద్ధము సేయుచుం డిన తురకసైనికులు సింహనాద మొనర్చిరి. ఒక్క హుర్మత్తున (తీవ్రముగ పైఁబడుట) హిందువుల పై కురికిరి. అప్పుడు బోధపడి నది, సింగమనేనికి మహమ్మదీయుల యుక్తి. దొంగతనముగ కోటలోఁ జొచ్చి ద్వారములను దెఱచి సుల్తాను సైన్యములను లోనికిఁ బ్రవేశపెట్టుటకుఁ జేసిన పన్నాగమది. అయినను భయ ములేదు; రెడ్డున్నారు కంపిలిదర్వాజను సంరక్షించుటకు; వారికిఁ దోడు రాచవీరు లున్నారు; తురకలకు శృంగభంగము సేయ వారు చాలుదురు. కాని కార్యభారమంతయు తన భుజములపై నానియున్నది. తాను జయించిన కోట నిలుచును. ఓటమి జెందిన తురకలకు హస్తగతమగును. ఈపట్టికి తాను చాలుదు నని యెంచియే మహారాజుగారును బ్రధాని యన్నయ్యగారును తన్నా కార్యమునకు నియమించిరి. వారివిశ్వాసమునకు బాత్రుఁడు గానినాడు తన్ను శూరులయందు పరిగణింతురా? కాని వెలమల

నోడించగలరా ఈతురకలు? ఈతలంపుతో గూడ సింగమనేనికి శివము రేఁగినది; కన్నులనుండి కోపాగ్ని ప్రజ్వరిల్లుచుండ గర్జించినాఁడు, "రండోయి వెలమబిడ్డలారా, కమ్మశూరులారా, ఈపఠాని ఖురాసానీల రక్తమును మన ఈఁటె మొనలకు రుచి చూపింతము. ఏలినవారి యుప్పుదిని పెరిగిన దేహములను వారి కర్పింతము. జే, రణరంగభైరవ! హరహర మహాదేవ"యని. ఈగర్జన తెనుఁగుశూరుల కుద్రేకముఁ గలిగించినది. వీరావేశముతో దమ కెదురు వచ్చుచుండిన తురకలపైఁబడిరి. వారిసంఘట్టన పోటుటలల సంఘట్టనమైనది.

ఈసందడిలో యుద్ధమున సకస్మాత్తుగ నొకయాపద సంభవించినది. వ్యూహ శిరముననిలిచి కయ్యమును నడపుచుండిన మల్లు ఆస్థానునిపాదములు కొకమృతకళేబరమడ్డపడఁగా నతఁడు తట్టుకొని బోరగిల ముందునకు బడియెను. అతని ననుసరించి భుజములవలె నూపుమీఁద వచ్చుచుండిన తురక సిపాయిలు కొంద ఱామహాకాయుని దేహమును దాఁకి యతనిపై బడిరి. వారి వ్యూహపటుత్వము చెడెను. వారిలో గొంత కళవళము బుట్టినది. అదియె సందని కమ్మవెలమ యోధులు వారిమధ్యదూరి వారిని ఖండతుండములుగ నఱుకఁగడఁగిరి. రావు సింగమనీఁడు కొదమసింగమువలె లంఘించివచ్చి తనరెట్టబలము కొలఁది ఈఁటెచేత లేవ బ్రయత్నపడుచుండిన మల్లు ఆస్థానుని రొమ్మునఁ బొడిచెను. గుక్కురుమనక వాఁడసువులనువిడిచి రణశయ్యఁ బరుండెను. సింగమనీఁడు వెంటనె మొలనుండు కటారిని

దూసి వాని తలను ఖండించి యీఁటె మొనఁగ్రుచ్చి జయపతా కముల పైకెత్తి 'జై, రణరంగభైరవ!' యని సింహనాదము గావించెను. తురకలు దమనాయకుని శిరముఁగాంచి భయభ్రాంతులై వెనుదిరిగి పాఱ నారంభించిరి. ప్రాణములతో నెందఱో తప్పించుకొనిపోలేదు. పెక్కండ్రు హిందూభటుల ఈఁటెమొనల కెరయైరి. కొందఱు కందకములోని కుఱికి మడిసిరి. గుట్టలుగ బడియున్న దురకశవముల దొలఁగద్రోసికొనుచు పోయి వెలమ కమ్మవీరులు నిచ్చెనత్రాళ్లనుఁ దెగగోసిరి. నిచ్చెనలపై నింకను మీఁదికెక్కి వచ్చుచుండిన తురక సిపాయీలు కందకమున గూలిరి. కొందఱు మునిఁగిచచ్చిరి. మఱికొంద ఱేదిపోయి యవ్వలి గట్టెక్కిరి.

దీర్ఘాలోచన జేసి పన్నిన షబ్ ఖూ (ఆకస్మికముగ రాత్రి పైఁబడి చేయు దొంగయుద్ధము) ఇట్లు నిష్ఫలముగ పర్యవసానము నందెను.

## 9. జోస్యము సరిపడుట కుపాయము.

గుడారమున వెనుక ప్రక్క పడక గదియందు మంచముపై గూర్చుండి చేతియందలి యద్దమున దనముఖ సౌందర్యమును బరామర్శించుచుండిన దామె. రాత్రి భోజనము తయ్యారు సేయుచుండినాడు ఖాన్‌సామాను (వంటవాఁడు). గుడారపు మొగసాలనుండి వినవచ్చినది పాటపాడు నస్పష్టగళస్వనము. ఉబయ్యాదు గుడారమున లేఁడు, సుల్తాన్ జాదాగారి దర్బారునకు బోయియుండెను. మఱి యామాటాడు

గొంతెవ్వరిది? ఆలకించి విన్నది. ఏకాంతమున నుండగ ఉబ య్యాదు తలచుచుగ మననము సేయు అమీరు ఖుస్రూగారి ప్రేమ గీతములోని మొదటి చరణమువలె దోఁచినది.

"అయే ప్యారక్,
ఆయా చష్మో చిరాఘె దీదయేమన్
రఖ్షో బిస్తాసో బాఘె దీదయేమన్"

ఎవ్వరో కనుగొనవలెనని లేచి మెల్లఁగ నడుగులుచప్పుడు సేయక పిల్లివలె నడచి మొగసాల వాకిలి దగ్గరకువచ్చి తెర సందులనుండి తొంగిచూచినది. ఎవ్వరును గానరాలేదు. అంతయు నిశ్శబ్దముగనుండినది. ఉన్నట్లుండి మరల వినవచ్చినది. 'అయే ప్యారక్'...నిదానించి చూచినది. ఆ పాటను బాడుచుండినది మనుష్యుఁడు గాఁడు, చిలుక. ఉబయ్యాదు చార్పాయిమీఁది యొరుగుదిండుపై గూర్చుండి వల్లించుచుండినది పలుమారు దన యొడయఁడు పాడుచుండఁగ విన్న పాటను. దానిఁ జూడఁగనే ఆమెకు కొంచెము కోపము గలిగినది. తెరను ప్రక్కకులాగి 'అయే, బద్ తూతీ' అనుచు మొగసాలను జొచ్చినది. ఆమె కంఠస్వరమును వినఁగనే 'అక్కయ్యా' 'అక్కయ్యా!' యని పిలుచుచు రెక్కలు జాడించి యెగిరివచ్చి యామె భుజముపై వాలినది చిలుక. కోప మంతట నదృశ్యముకాఁగా దాని నామె ముద్దాడ దొడఁగెను. కాని వారి యేకాంతము దీర్ఘకాలము సాగ లేదు. డేరా వెలుపట సందడి వినవచ్చెను; మఱి రెండునిమిషము లకు డేరాలోపల కుబయ్యాదు ప్రవేశించెను. అతని ముఖవైఖరి

యథావిధముగ నుండలేదు. ఉత్సాహమునకు బదులు చిన్నదన మును, స్వస్థతకు మారు వ్యాకులమును నతని ముఖమున గాన వచ్చుచుండినవి. సుల్తాను జాదగారి దర్బారులో నేదో విపర్య యము నడచెనని యామె యూహించి చేతులనుండు చిలుకను చార్పాయిమీఁదికివిసరి ప్రసన్నవదనముతో నతని నెదుర్కొని స్వాగత మిచ్చినది. చెంతకు జేరి యతని యంగరకా బొందులను విప్పి మొదట నొకచేతిని, పిమ్మట రెండవదానిని వదల్చి మడిచి చార్పాయిమీఁద బెట్టినది; తరువాత రెండుచేతుల నతని చేతు లు పట్టుకొని సమీపముననుండిన సోఫాపై కూర్చుండఁబెట్టి, గాజుపాత్రనుండి వెండిప్యాలానిండ రక్తవర్ణపు షిరాజు షరా బును పోసి యతని నోటికడకెత్తి పెదవులు దాకించి త్రాగవల యునని ప్రార్థించినది; ఉబయ్యాదు మద్యప్రియుఁడైనను రెండు మూఁడు గ్రుక్కలకంటె నెక్కుడు త్రాగఁజాలకపోయెను; అతని నోటికి కదిచేదైతోచెను. ఆమె యతని నడిగినది.

''దర్బారునకు వెడలునప్పుడు నిశ్చింతగ బోయితిరే. ఇప్పటి విషణ్ణతకు గారణ మేమి?'' అని.

'అజల్ (మృత్యువు) కీ దర్షణా అవుతే మొగం యెట్లా నవుంది?'

'అట్లనెదరేమి? ఎవ్వరికి అజల్ దర్శనం అయినది?'

'ఎవరికీ? నాకీ; ఈ బద్ బఖ్తుకి ఖతల్ చేస్తాడు సుల్తాను జాద. అఖ్తిర్ షుమారీచేసి ఆస్మాన్ చహార తెల్వకుండ మోషం చేసిన్యాన్. ఆయన్కు నామీద ఘుస్సా అయితుంది.'

"జోస్యము తప్పినదానికి మరణశిక్షయా? శాస్త్రార్థమును ఒకప్పుడు కూడ తప్పనీయక విశదపఱచి చెప్పగలవారు ఈలోకమున నెవ్వరైన గలరా?

'జానె మన్. నీకీ సుల్తాన్ జాద స్వభావం తెల్వదు. ఆయ్నా పగం దివానా. దివానాకీ ఘుస్సా అయితే వాడ్కి దగ్గ్రావున్నారులేదు వార్కి కష్టం. నేన్ జోష్యం చెప్పి మాసం అవడాన్కి చార్ పాంచ్ రోజులు వున్నాయి. ఈలోపల కిల్లా మస్కి గిరిప్తు కావడం పందేఘం. స్వాధీనం కాకోంతే నాకీ ఖతల్ నిష్చయం.'

సుల్తానుజాద స్వభావమట్టి దేయని యామె యెఱుఁగును. కొంత సేపటివఱకును యోచన సేయుచు కూర్చుండినది. క్రొత్త భావ మొకటి స్ఫురించెను. అయత్నముగ నామె నోటినుండి వెలువడినవి, 'బుద్ధిబలమువలన నెంతటి కష్టములనైనను దాటవచ్చును' అను మాటలు. ఉబయ్యాదు చెవులయం దామాటలమృతధారలవలెఁ బడెను. ఆతని హృదయమున ఆశ నూతనముగ నంకురించెను. నిస్త్రాణవీడి చైతన్యముఁ గలిగెను. అడిగినాఁడు ఆతురముతో, "చే మీఁగూయీ? అకల్ వుంటే కష్టం తప్పుందీ? ఎట్లా తప్తుందీ చెప్పు?" అని.

"మిమువంటి బుద్ధివికాసము గలవారికి నేను చెప్పవలయునా?"

"మాకు ఇప్డా అకల్ పోయింది. బేఅకల్ అవున్నాం. మాకీ సల్హా చెప్పు."

"మీ జోస్యము ప్రకారము కోటసుల్తాను జాదగారికి స్వాధీనపడుటకు ఇంక నెంత వ్యవధికలదు?"

"చార్ పాంచ్ రోజ్."

"అంతవఱకు సుల్తానుజాదగారు ఇచటనేయుండి, అతనికి కోట వశపడకుండిన గదా మీ జోస్యముతప్పును."

"హాఁ, అవ్తే; సుల్తాన్‌జాద ఎక్డాపోతాడు?"

"వినండి. ఈలోపల నతఁడే ముట్టడి చాలించుకొని లేచి పోయిన?"

"నీకీ పిచ్చీ పడ్తూవుందీ యేఁ? ఆయ్నా కిల్లా స్వాధీనం కాక్పోతే పోడు, మాలుం?"

"తెలియును. ఒకవేళ పోయినచో, తర్వాత జోస్యము తప్పని చెప్పుటకు వీలులేదు గదా?"

"హాఁ. అవుతే ఆయ్నా ఎందుకు ముహాసిర్ విడ్చి బాజ్‌గష్తు అయితాడు?"

"పోవునట్లు చేయవలయును. యిచటనే మీయసామాన్యమైన ప్రతిభను వినియోగపెట్టవలయును. ఆత్మరక్షణ కుపయోగపడనిచో బుద్ధివలన గలుగు ప్రయోజనమేమి?"

అప్పటికి ఉబయ్యాదుకు ఆకళింపునకు వచ్చినది యామె భావము. కొంతసేపు చింతించినాడు. చింతించుకొలదియు నామె సలహా సరియైనదని తలఁపు దృఢపడజొచ్చెను. ఆమె బుద్ధి కౌశల్యమును మెచ్చుకొని, యామెను చేరదీసి కౌగలించుకొనుచు,

'నీవు చెప్నా సలహా ఖూబ్ తరస్తు. సుల్తాన్ జాదాను ఇక్డా నుంచి 'బాజ్‌గష్తి చెయ్యడాన్కి దారీ చూడ్వాలా. ఏం వుపాయం?' అని యడిగినాఁడు.

10. మధుమావతికి కనకాభిషేకము.

ఆ యుదయమున కోటయం దెల్ల యెడలను మహోత్సాహసూచనలు గానవచ్చుచుండెను. తురక సర్దారులు సంధి జేసి కొనఁగోరి రాయబారుల నంపుచున్నా రనువార్త పట్టణము నందంతటను వ్యాపెను. పురవాసులకు దలమీఁదిబరువుకు దించినట్లయినది. గుంపులుగ గూడి ముట్టడియందు తాము పడిన కష్టముల నొండొరులతో జెప్పుకొనుచు నికమీఁదనైనను కడుపునిండ భోజనమును, గంటినిండ నిదురయును గలుగునని సంతసించుచుండిరి. తురక రాయబారులకు దగురీతిని స్వాగతము జెప్పి సంధి షరత్తులను నిశ్చయించుటకు వలసిన యేర్పాటులను మంత్రులయాదేశము ననుసరించి పురపాలకుఁడును నతని యనుచరులును జేయుచుండిరి. రాజమందిర పురోభాగమందలి గడియారమున నెనిమిది గడియలు మ్రోసెను. మహారాజు సభామందిరమున బేరోలగ ముండెను. సభామంటపమున దూర్పుముఖముగ నిల్పియుండిన బంగారు సింహాపీఠముపై ప్రతాపరుద్రమహారాజు సుఖాసీనుఁడై యుండెను. అతనివెనుక నిరుపార్శ్వము లందును బంగారుపిడులతోటి వెలికుంచెలఁ బట్టుకొని చామర గ్రాహిణు లిరువురు నిలిచియుండిరి. కుడి ప్రక్క మాచల, యెడమప్రక్క మదనరేఖ; వారి కిరుకెలకు

ను అడపము కత్తి కాళంజి గిండి మొదలగు రాజ్యచిహ్నము
లను ధరించిన యువతీమణులు వరుసదీరియుండిరి. అగ్రభాగ
మున వలపట నన్నయ శివదేవయ మొదలగు మంత్రులును,
దాపటరావుసింగమ పోతుగంటిమైలి ప్రోలారెడ్డి కేతభూపతి
ముప్పిడినాయకుఁడు మున్నగు దండనాయకులును సుచితాసన
ములయందు గూర్చుండి యుండిరి. వారికి వెనుక రాచలెంక
లొకప్రక్కను నాయకుల యనుఁగు లొకప్రక్కను నిలిచి
యుండిరి. మంత్రివర్గమునకును సేనాధిపతులకు నెదుట కొన్ని
యుత్తమాసనము లుంపఁబడియుండినవి. ద్వారదేశమునుండి
రాయబార్లు నలువురు ప్రవేశించిరి. వారి కగ్రభాగమున
గన్నమనీఁడును రెండుప్రక్కలను సాయుధపాణులగు రెండు
వరుసల తలవరులును తోడు నడచుచుండిరి. సింహాసనమును
సమీపింపఁగనె యచట నాగి తురక రాయబారులు నలువు
రును ముందునకువంగి 'పెత్తాతదర్దు మహారాజాగార్కి సలాం'
అని మ్రొక్కిరి. అప్పుడు గన్నమనీఁడు ముందునకు వచ్చి రాయ
బారుల పేరులను మహారాజున కెఱుకపఱచెను. 'దేవ! అవ
ధారు. ఈతఁడు ఉబయ్యాదు, జోస్యుఁడు, శూరుఁడు, కవి;
సుల్తాన్ జాద ఉల్లూఘుఖానుని యంతరంగ మిత్రుఁడు. ఇతఁడు
తైమూరు. ఇతని ప్రఖ్యాతిని దేవరవారు వినియేయుందురు.
మొదట నితఁడు మలిక్ కాఫూర్ గారితో కూడ మన పట్టణము
నకు వచ్చినాఁడట. సుల్తాన్ కుత్బుద్దీన్ ముబారక్ షహాగారి
కాలమున దేవగిరి దండయాత్రయందు దన శౌర్యమును

జక్కగా ప్రకటించెను. ఇతఁడు తిగీన్. జాతివలన మొగలాయి; సుల్తాన్ అల్లా ఉద్దీన్ ఖిల్జీకి కానూరు యుద్ధమున పట్టువడెనఁట. తరువాత మహమ్మదీయదీక్షను బుచ్చుకొని సుల్తానుగారి యనుగ్రహమునకు బాత్రుఁడాయెనఁట. మలిక్ కాఫురునకు నమ్మిన బంటు; ఇతని కత్తివ్రేటునకే కాఫురు తుద కాహుతి యైనది. ఇతఁడు నజీరు; జరీటోపీ ధరించుటవలన నితనికి కులహ్జార్ నజీరను పేరు వచ్చినది. ఖుస్రూఖానుని పట్టణములో ఖైదీచేసి డిల్లీకి తీసుకొనిపోయిన అమీరులలో నిత డగ్రగణ్యుఁడు.''

మహారాజుగారి యాదేశము చొప్పున వారు తమకు నిర్ణీతమై యుండు నాసనములపై గూర్చుండిరి తరువాత రాజు వారితో సంభాషణ నిట్లారంభము చేసెను.

''తమ యాగమనమువలన మేము ధన్యులము. మిము బోటి పరాక్రమవంతుల దర్శనభాగ్యము దుర్లభము. ఇంతటి గొప్ప గౌరవము మాకు గలుగుటకు గారణమెద్దియో వినఁ గుతూహల పడుచున్నారము.''

రాయబారుల పక్షమున సుబయ్యదిట్లు బదులు చెప్పెను:

''మహారాజావారి దర్శణం మాకీ కావడం మా హదృష్టం. మేం రావడాన్కి కారణం తమ్మీ దర్శనం చేస్కొని తమ్మీకాడ శలువ్ తీస్కొని డిల్లీకి పోవ్డానికి.''

''డిల్లీకి పయనమా? మఱి కోట ముట్టడిమాట? డిల్లీకి పోవలయునన్న మీరు సుల్తాన్‌జాదగారి దగ్గర సెలవు తీసుకొనిగదా పోవలయును. మీకు మేము శత్రువులము; మమ్ము

మీరు సెలవు అడుగవలసిన కారణమేమి? సాయబులను నమ్ముటకు వీలులేదు. ఏమి మోసము దలపెట్టినారు?''

''మహారాజా సాహేబ్వారూ బద్నమాన్ పడ్తావున్నార్; మాకీ ద్రోఘం గీఘం తెల్వదు. మాకీ మీద సుల్తాన్ జాదాగార్కి భోత్ ఘుజబ్ పుట్టింది. మాకీ కతల్ చెయ్యాలా వున్యార్.''

''ఏల మీమీఁద వారికంతకోపము కలిగినది?''

''వినండి, మహారాజాసాహేబ్, వినండి. మాసుల్తాన్వారు లేదు ఘయ్యాస్ఉద్దీన్ తుఘ్లుక్ పాదుషావారు, వారు ఎక్ మాహ్రోజుల్ కిషుంద బీమారీపడి ముర్దు అయిపోయి న్యార్. ఢిల్లీలో ఆయన్నా తఖ్తుమీద కూర్చున్యాడ్ ఖిల్జీనిజ్జాద్ వర్ద్. ఢిల్లీ షెహర్యంలో ఉండే సర్దార్లు సరాసర్ ఖిల్జీ పాదుషా హాగారి నమ్మక్ తిన్యాం. మేము వాడి పచ్చం అయి సుల్తాన్ జాదతో జంగ్ చేసి ఆయన్కి తఖ్తు లేకుండా చేస్తాంఅని ఆయన్నా బద్నమాన్ అయిన్యాడ్. అందుక్కి మాకీ రగస్యంగా గిరిఫ్తు చేసి కతల్ చెయ్యాలా వున్యాడ్.''

''ఏమి చిత్రము! ఘయ్యాస్ ఉద్దీన్ సుల్తాన్ మృతినందిరా? వారి స్థానమున ఖిల్జీ వంశజుఁడొక్కఁడు మరల సింహాసనము నెక్కెనా? అయిన మాకు దీనితో నేమి సంబంధము?''

''చిత్తగించండి మహారాజ్, పంబంధం మీకీలేక్పో లేదు. కిల్లా మే మీకి బుజుర్గువార్ హాషం వుంది. మాకీ జాసూదుల్ ఖబర్ తెచ్చిన్యార్. మీకీ పహాయంగా పెద్ద ఉర్దూతో

కూడా షుందర్ బందీ వచ్చి ధరణీ కోటమే మకాం చేస్తున్యార్ మేం ముహాసిమ్ బర్ ఖాస్తు చేస్కుని కూచి చేసిపోయేటప్పు మాకీ దుంబాల మీరు షుందర్బందీ వచ్చికొడ్తే మాకీ భోత్ ముష్కిల్ అయ్ తుంది. మహారాజాగారు మాకీ షమాధానం చేష్కుని పోనివ్వాలా? లేక్పోతే ఇక్డానే వుండి జంగ్ చేసి కిల్లా కు షాదగీ చెయ్యాలా వుంది?'

''మీరు ముట్టడిదిగి ఎంతకాలమైనది?''

''సరాసర్ హాఫ్ త్ మాహ్ అయితుంది.''

''ఇంతకాలము మీరు కోట ఎందుకు పట్టుకొనలేదు?''

''........................''

''ఉత్తరము చెప్పరేమి?''

''దాన్కి గిరిఫ్తు చెయ్యడాన్కి షమయం సరియైంది రాలేద్.''

''అనగా, మీకు శక్తిలేదు.''

''ఒక్పచ్ఛంచూస్తే అదీ షరీ అనీ చెప్పాలా.''

''ఇప్పుడు మాకు సుందరపాండ్య దేవుఁడు సైన్యముతో గూడ సహాయము వచ్చుచున్నాఁడని మీరే చెప్పుచున్నారు కదా.''

''హాఁ.''

'ముందటికంటె నిప్పుడు మాకు బల మతిశయమైనదికదా?'

''హాఁ.''

"మఱి సంధికి ఒప్పుకొనని పక్షమున ముట్టడిసాగించి కోటను పట్టుకొనెదమని బెదరించుటయెందుకు? మీ బెదరింపు మాటలకు లొంగి సంధికి ఒప్పుకొనెదమనియా? భయములేదు. శక్తి కలిగిన మీరు కోటను పట్టుకొనవచ్చును."

"బెద్రించడం కాదూ మహారాజ్, మీరు షంధికిఒప్ప క్పోతే మాకీ ఇష్టంవుణ్ణ్యా లడాయి చెయ్యాలా, లేక్పోయినా చెయ్యాలా అని మాట వర్సాకీ చెప్పిన్యాౕ. అంతే, మహా రాజావారు కోపం చెయ్ డం మంచిదీ కాదు."

"అట్లయిన మీరు కోరునదేమి?"

"కిల్లాదర్రానుంచి మేం కూచిచేసి పోయ్యాతర్వాత తీౕ చహార్ పహ్రా తక్ మీారూ హాషంతోకిల్లాబాహిర్కు రాకూడదు. షుందరబందీ మాకీయెన్కా తమ్ముకొని రాకూండదు. మేమూ తమ్రాని హద్దేదంతా ఇంతే."

"మీరు కోరునది సమంజసముగనే యున్నది." మహా ప్రధానుల వారియభిప్రాయమేమి? శివదేశికులయూదేశమేమి?" అని మంత్రివర్గమువైపు ముఖమై యడిగెను.

ప్రధాని అన్నయ్యగారు తనస్థానమునుండి లేచినిలిచి,

"మహాప్రసాదము. ఏలినవారు సెల విచ్చినట్లు రాయబారుల కోరిక సమంజసమైనదే. వారు కోరువిధమున మనము సంధికి ఒప్పుకొనవచ్చును; కాని యొక్క షరతునకు వారొప్పుకొనినగాని మనము సంధికి ఒడంబడుట యుచితమని నాబుద్ధికి తోచదు. ఏలినవారి యాజ్ఞయైన మనవి చేసికొనియెదను."

"మహాప్రధానులవారు సంకోచపడనేల? తమయభిప్రాయమును మొగమోటపడక తెలియజేయుఁడు. మీ తలఁపు నందుండు షరతు యెద్ది?"

"దేవర దాసి యొక్కతె తురకలకుఁ బట్టుపడి వారి స్కంధావారమున కైదుసేయఁబడి యున్నది.'

"ఎవ్వతె యది?"

"మధుమావతి."

"మధుమావతియా? ఏ మధుమావతి? మాచలచెలి యొక మధుమావతి గలదు. అది కాదుగదా?"

ఆ మాటలను వినఁగనే మాచల్దేవి నిశ్వసించి పలికినది: 'అవును, దేవా! ఈదాసి చెలియలే ఆ నిర్భాగ్యురాలు" అని.

"మహాప్రధానులవారి భావము మధుమావతిని విడుదల సేయింపక సంధికి ఒప్పుకొనరాదనియా?"

"చిత్తము"

అంతట రాయబారులవంక తిరిగి మహారాజు సెలవిచ్చి నారు,- "సర్దారు సాహేబులవారు వినుచున్నారు గదా మా ప్రధానులవారు వినిపించిన షరతును" అని.

రాయబారులపక్షమున ఉబయ్యా దడిగినాఁడు "అది ఎక్డా ఉందో చెప్తే, దాన్కి మీకి సిపుర్దు చెయ్యడాన్కి మాకీ ఆచ్ఛేపన్లేదు."

మహారాజులవారు అన్నయగారి ముఖమునుజూచిరి. వారి భావమును గ్రహించి మహాప్రధాని "షాఇర్ సర్దారు సాహేబులవారిగుడారమునందే" అని బదులుచెప్పెను.

ఆ జవాబును వినఁగనే ఉబయ్యామునకు చిడిముడిపాటు కలిగినది. తన గుడారమునం దింత కాలము నివసించుచుండిన స్త్రీ పేరు మధుమాలతియని యాతఁడెఱుఁగడు. ఆమె సౌందర్యమును గాంచి సమ్మోహితుఁడగుటయే గాక ఆమెయెడ నాతనికి ప్రేమ గలిగినది. మఱియు నామెసలహావలన నతఁడెన్ని యో యుపద్రవములను దాటెను. ఆమెను వారి కప్పగించుట కతని మనసొప్ప లేదు. కావున మహారాజుగారితో మనవి చేసుకున్నాఁడు. "అదీ లేదూ ఆ మధ్మాలతి అది సాధారణం ఔరత్ కాద్ మహారాజ్. దాన్కి బీవీ చేస్కుని నిక్షా కట్వాలావుంది" అని.

"అవును. మీరు సాధ్యమైన ఈ పట్టణస్త్రీలకందఱకును నిక్షా కట్టగలరు. మా దాసిని మాకు ఒప్పగింతురా? మీకు సమ్మతిమేని, మీరు కోరినట్లు మేము ప్రవర్తింపగలము."

"మహ్రాజ్ ఆ ఔరత్కి సిపుర్దు చెయ్యడానికి సాధ్యం కాదు."

"రాయబారి సర్దారు లందఱును ఉబయ్యాదు సాఇర్ గారితో నేకీభవింతురా?"

తక్కిన ముగ్గురు సర్దారులును నైకకంఠ్యముగ, "ఈ అ ఖ్తర్ష్మార్ అపర్ కీ కోషం మాలష్కర్కి నుక్సాన్ చేస్కుంటాం! నహీం మహారాజ్ నహీం, ఆ జన్ కి మీకీ వాపస్ చేస్తాం."

అప్పుడు మహాప్రధాని అన్నయ్య శివదేశికులముఖమును చూచెను. వారి మనసు లేకీభవించినవి. దేశికులవారు మహారాజుగారి కిట్లు చెప్పినారు. "ఇంతవఱకును ఏలినవారు రాయ

బార కార్యమునందే నిమగ్నులై యుండిరి. ఉబయ్యాదు పాఇరు గారు జగత్ప్రసిద్ధినందిన జ్యోతిష్కులు. ఇట్టి మహనీయుల సందర్శనము మరల నెప్పుడు కలుగగలదు? ఏలినవారి భవిష్యత్తునుగూర్చి కొంతవిచారించుట యుక్తమని తలఁచెదను. నాకుఁ గూడ కొంత యభిరుచి కలదు. కొంతకాలము శాస్త్రవినోదమున కాలము గడుపుదము. ఇంతటనె గన్నమనీఁడు తక్కిన రాయబారులతోఁ గూడ వారి స్కంధావారమునకుఁ బోయి మధుమావతినిఁ దోడ్కొని రాగలఁడు.''

''దేశికులవారి మాటలు చాల యుక్తముగ నున్నవి. రాయబారి సర్దారులకు సమ్మతమగునా?'' ఉబయ్యాదు పలుకలేదు. తక్కిన ముప్వురును 'హాఁ'యని తమ యంగీకారమును సూచించిరి.

*　　　*　　　*　　　*

ఢిల్లీ సైన్యము ముట్టడి సాలించుకొని రెండుపాయలుగ చీలి పయనమైపోయినది. స్వామిద్రోహము చింతించి విముఖులైనఖానులు మొదట, వారిని వెన్నంటి నిజదళముతోఁ గూడ సుల్తానుజాద, దేవగిరిమార్గమునుఁబట్టి నడచిరి. తుఫాను తాకుడు తప్పించుకొని వెలువడిన యోడవలె గానవచ్చినది యోరుగల్లు. విఱుగఁబడిన కట్టడములును, నేలచదరము గావింపఁబడిన దేవాలయములును, దగ్ధములైన తోఁటలును, నఱకుడువడిన యారామవృక్షములును, దురకల దారుణకృత్యములను స్మరణకుఁ దెచ్చుచుండినవి; కాని యా విధ్వంసచిహ్నము లెవ్వియు పట్టణ ప్రజల దృష్టి కెక్కలేదు. అది వారికి మహోత్సవదినము;

ప్రాణోపద్రవకరమగు నాపద తొలఁగిపోయినది ఏడుమాసముల పర్యంతము కోటగోడలమధ్య బందివడి యుండినవారికి విడుదలకు మించిన మే లేది కలదు? ఆదినము వారు భగవద్భజనల యందును, నాటపాటలయందును నిమగ్నులై యన్యవిషయములను విస్మరించి యుండిరి. ఉత్సవములు లేని దేవాలయములును, వీణామృదంగాది నిస్వనముల హోరు కలుగని గృహములును లేవు. విపణివీధి యంతయు రసాలపల్లవతోరణములతో నలంకృతమై యుండెను. రాజమందిరములమీఁదను సామంతుల నగళ్ళ యుపరితలములందును నానావిధకేతనములును, వాతపూరణనులును, వీరధ్వజములును గాలియందల్లల నాడుచుండినవి.

సాయాహ్నమైనది. మంత్రగృహమున ప్రతాపరుద్ర మహారాజు సచివులను గూడి రహస్యాలోచన సల్పుచుండెను: ముట్టడి సమయమున కోట సంరక్షణము గావించినవారి నెట్లు గౌరవించి యాదరింపవలయునో విచారించుచుండిరి. ఒక్కొక్క మంత్రియు దనకు గూర్చు నాయకుని శౌర్యపరాక్రమముల నగ్గించుచు వారి నెట్లు బహూకరించిన ఉచితముగ నుండునో వివరించుచుండెను. ఒకమంత్రి రావు సింగమ నేని నగ్గించెను. మరియొకఁడు ప్రోలారెడ్డి శౌర్యమును బొగడెను. ఇంకొకఁడు పెద్దరుద్రుని పరాక్రమమును గొనియాడెను. మంత్రులవాక్యములను మహారాజు సాదరముతో నాలకించి విని కొంతసే పేమో చింతించుచు గూరుచుండి తుద కిట్లు పలికెను. "మీరు పేర్కొనిన నాయకుల పరాక్రమము మే మెఱుఁగుదుము.

ఎవ్వరి పరాక్రమమునకు దగినరీతిని వారిని సత్కరించుటయే సరి. కాని యీ ముట్టడియందు మాకు బోధకాని యంశ మొక్కటికలదు. ఎంత చింతించినను సరియైన సమాధానము స్ఫురింపలేదు. మన నాయకులు మహాశౌర్యముతో బోరాడి నది నిశ్చయమే; కాని వారి శౌర్యమువలన సుల్తాన్‌జాద ముట్టడి లేపుకొనిపోలేదని యందఱెఱుఁగుదురుగదా? మఱి వారేల ముట్టడి చాలించుకొనిపోయిరి? మేము సాయము వేడనిదే సుందర పాండ్యదేవుఁడు సైన్యముతో మాకేల తోడు వచ్చెను?''

అందులకు రామయామాత్యుఁ డిట్లు సమాధానము చెప్పెను :

''ఢిల్లీలో సుల్తాను కాలగతి నందెననియు, ఖిల్జీవంశజుఁడొకఁడు సింహాసనము నాక్రమించుకొనెననియు రాయబారముపచ్చిన ఖానులు చెప్పిరికదా. మునుఁగు పడవను విడిచి పాఱిపోవు నెలుకలవలె ఖానులు సుల్తాన్‌జాదను త్యజించిరి. ఇది సహజమే. ఏలినవారు పూర్వము సుందరపాండ్యదేవుని వీర ధవళార సింహాసనముపై బ్రతిష్ఠించుట లోక మెఱిఁగిన విషయమే. వారు ఇప్పుడు ఏలినవారికి దోడువచ్చుటయందు వింతయేమున్నది? గొప్పవారు ఇతరులవలన తాము పొందిన మేలును మఱతురా?''

''సమంజసముగనే యున్నది. కాని మాకు దృప్తికరముగ దోచలేదు. దేశికుల వారి యభిప్రాయ మేమో?''

"నా యభిప్రాయమును మహాప్రధానుల వారి యభిప్రాయమునుఁగూడ నొక్కటియే. నాకంటె వారు విషయము నెక్కుడు చక్కఁగ విశదీకరింపఁగలరు?"

"మహాప్రధానులవారి యభిప్రాయ మేమి?"

"దేవ, అవధారు. నేను చెప్పబోవునది అభిప్రాయము గాదు. జరిగిన విషయమును సంగ్రహముగ నేలినవారికి మనవి సేయుచున్నాఁడను. డిల్లీయందు సుల్తాన్‌గారు మృతినందను లేదు, సుందర పాండ్యదేవుఁడు మనకు సాయము రాను లేదు."

"చిత్రము! చిత్రము! రాయబారులు వచ్చినప్పుడు మీ రుంటిరికదా! వారట్లు చెప్పుటకు గారణ మేమి?"

"దేవరవారు చిత్తగింపవలయును. రాయబారులు వారు చెప్పినది నిశ్చయమనియే నమ్మిరి. వారు మోసపోయిరి, కాని మోసము చేయలేదు."

"ఎట్లెట్లు?"

"ఇది యొక గూఢ నాటకము. సూత్రధారుఁడు ఏలిన వారి భృత్యుఁడు. కోటయందుండి పాత్రల నాడించినాఁడు. పాత్రలు తురకల స్కంధావారమునందు నటించి ఖానులను మాయా ప్రపంచమున ముంచివేసిరి. తత్ఫలముగ ముట్టడి విడిచి వారు లేచిపోయిరి."

"మహాప్రధానులు విశదీకరింపవలయును. సూత్రధారు డెవ్వఁడు? నాటకస్వభావ మెట్టిది?"

"చిత్తగింపవలయును. సూత్రధారుడీభృత్యుఁడే. శివదేశికులు సహాయులు. ముఖ్యపాత్ర మధుమావతి; దానికి తోడు దేశికులవారి శిష్యుఁడు జంగముదేవర."

"మధుమావతి తురకలకు చిక్కి వారి శిబిరమునందు కైదు నందుండెనే, అది యెట్లు మీ నాటకమాడినది?"

"చిత్తము. అది మొదట మా యాదేశముచొప్పుననే తురక దండునకు పట్టువడి కైదియైనది. తరువాత సుల్తాన్ జాదగారి యంతరంగ మిత్రుఁడగు ఉబయ్యాదును మోహపాశముల దగిల్చి బందిచేసినది. అది మొదలు వారి గుట్టును యెప్పటికప్పుడు దెలియజేయుచు వచ్చినది."

"ఎట్లు?"

'జంగమయ్య మూలమున. సమయమునకుఁ దగినట్లు వేషము మార్చుకొని తురకదండును బ్రవేశించి మధుమావతిని గని వారి యుద్ధరహస్యములను దెలిసికొనివచ్చువాఁడు. తురకదండులో నితఁడు దిరుగని స్థలము లేదు. చిలుకలకు గోరువంకలకు మాటలు నేర్పి ఖాసు మలుక వజీరులకు విక్రయించువాఁడు. సిపాయీలతో వినోదములు చేయుచు వారి చెలిమి సంపాదించి ఇష్టమువచ్చినపుడెల్ల నన్నియెడల సంచరించువాఁడు. ఇతఁడు విక్రయించిన చిలుకయె మొదట ఉబయ్యాదు జోస్యవృత్తాంతమును మనకుఁ దెలియపరచినది. మధుమావతి యాదేశముమీఁద మాచట్దేవి పెంపుడు చిలుకను హరించికొనిపోయి ఉబయ్యాదుకు విక్రయించినాఁడు. మధుమావతి దానిమూలమున సందేశము నంపినది. షబ్ ఖాను విషయమితని మూలముననే నాగయగన్నమనేనికి తెలియజేసినది.

"అద్భుతము. ఎంత యుపకారము చేసినది మధుమావతి! సుల్తాను మరణవార్త దానివలన పుట్టలేదు కదా? పాండ్య బలము వచ్చుచున్నదను వదంతి యెట్లుకలిగినది?"

"చిత్తము, మనవిచేయుచున్నాను. తానుపెట్టిన గడువు లోపల కోట సుల్తానుజాదకు స్వాధీనముగాదని తెలిసికొని, ఉబయ్యాదు తన తలబోవునని భయమందెను. మధుమావతి అతనిని తప్పించుటకు ఉపాయము చెప్పినది. మాసము ముగియుటకుముందే సుల్తాను జాదముట్టడి లేవదీసికొని పోవునట్లు చేసిన నతని జ్యోస్యము తప్పినదని తలఁచుట కవకాశముండదు; అతని తల నిలుచును అని. తక్కువకథయంతయు నుబయ్యాదుచే గల్పింపఁబడెను. తురకసర్దారులను భయపెట్టుటకు మధుమావతి సలహాప్రకారము ఉబయ్యాదు సుందర పాండ్యుఁడు దండుతో వచ్చుచున్నాఁడను వదంతిని పుట్టించినాఁడు."

"మహాప్రధానుల ప్రతిభ యద్వితీయము. మధుమావతి సాహసము ప్రశంసనీయము."

"ప్రతిభ యెంతటి యద్భుతమైనదైనను పరికరములు సరియైనవి లభింపనిచో కార్యము సాఫల్యముగాదు. మధుమావతి యేడుమాసములు తురకల శిబిరమునందసిధారావ్రతము సల్పినది. అది లేకుండిన ఈయవాంతరము గడచియుండదు."

"నిశ్చయము, నిశ్చయము. దాని స్థైర్యసాహసములకు దగినరీతిని గౌరవింపవలదా? ఉచితమైన సత్కారమెద్ది?"

"కనకాభిషేకము."

---

# కంపిలిరాయలు

౧

క్రీ. శ. ౧౪ వ శతాబ్దారంభ దశయందు కంపిలి రాయల కీర్తిజ్వాల ప్రజ్వరిల్లినది. ప్రళయకాలజలధివలె ముంచుకొనివచ్చు మహమ్మదీయ వాహినికి జెలియలికట్టవలె నడ్డపడి రూపుమాసిపోవ సంసిద్ధమైయుండిన హిందూధర్మమును సంస్కృతిని బునరుద్ధరించి కీర్తినందిన మహానుభావుఁడీ కంపిలిరాయఁడు. జాతిచే నితఁడు బోయ. ముమ్మడి సింగయ నాయకుఁ డితని గన్నతండ్రి. బళ్లారిమండల మితని జన్మస్థానము. మంచి శూరుఁడు. చక్కని దళవాయి. దేవగిరి యాదవ రాజగు రామదేవరాయల దండయాత్రలను జయప్రదముగ సాగించి ప్రఖ్యాతిని గడించెను. ఇది యితని జీవితమున బ్రథమదశ.

క్రీ. శ. ౧౩ వ శతాబ్దాంతమున ప్రారంభమైన మహమ్మదీయ దండయాత్రలతో నితని కీర్తిలత ప్రాక నారంభించినది. క్రీ. శ. ౧౨౯౪ వ సంవత్సరమున నల్లాఉద్దీను ఖిల్జీ దక్కనుపై నెత్తివచ్చి దేవగిరి రామదేవరాయని నోడించి తన కరిగాపును గావించుకొనెను. రామదేవుఁ డల్లాఉద్దీనునకు దనకుమార్తె నిచ్చి వివాహము గావించి సంధిచేసికొనెను. ఈవార్త చెవిసోకఁగనే కంపిలిరాయనికి రోత పుట్టెను; రామదేవునితో దనకుగల స్వామిభృత్య సంబంధమును ద్రెంచివేసి, స్వాతం

త్ర్యమును బ్రకటించెను. కంపిలిదేవుఁడు స్వతంత్ర సంస్థాన
మును స్థాపించుట ముఖ్యముగ రెండు పరమార్థములను సాధిం
చుటకే. మహమ్మదీయులను నిగ్రహించి హిందూ స్వాతం
త్ర్యము నుద్ధరించుట మొదటిది. తురకలయొత్తిడిచే సమసి
పోవుటకు సంసిద్ధముగనున్న హిందూ ధర్మమును సంరక్షిం
చుట రెండవది. అది మొదలు తురకలబారినుండి తప్పించుకొని
వచ్చిన హిందూ కాందిశీకులకెల్ల నతని రాజధాని కుమ్మఠము
రక్షణస్థానమాయెను. ఇట్లు ఆత్మ సంరక్షణార్థము కుమ్మఠము
నకు బారివచ్చినవారిలో హరిహరుఁడును బుక్కుఁడును ముఖ్యు
లు. వీరే విజయనగరసామ్రాజ్యమును స్థాపించినవారు. మొదట
వీరు ఏకశిలానగరమున ప్రతాపరుద్రమహారాజుగారి కోశా
గారాధిపతులై యుండిరి. ఉల్లూఘుఖానుఁ డోరుగంటిని సాధిం
చి ప్రతాపరుద్రుని బందిచేసి ఢిల్లీకిఁ గొనిపోయినపిమ్మట వీరు
తురకలబారిఁబడక తప్పించుకొని కుమ్మఠమునకు వచ్చిచేరిరి.
కంపిలిరాయఁడు వీరి నాదరించి తన కొలువున గొప్ప పదవుల
యందు నిలిపెను. ఇట్టి కాందిశీకులు కంపిలిరాయని ఆదర
సత్కారములకు బొందినవారు మఱి యెందరో కలరు.

### ౨ పాపోసులపల్లకి.

మహమ్మదీయులను సరకుగొనక హిందువులకు గన్నా
కగుటచే గంపిలిరాయనియెడ భారతీయ మహమ్మదీయులకెల్ల
నధిపతియగు ఢిల్లీ పాదుశాహుకు ద్వేషము జనించినది. ఇతని
నెట్లయిన, దుదముట్టింపవలయునని పాదుశాహును నతని

నాయకులను నిశ్చయించిరి. అల్లా ఉద్దీను చక్రవర్తి, యభినవ కాలయవనుఁడని ప్రసిద్ధినందిన మల్లిక్ నాయబు కాఫూరును గొప్పదండుతో నాతనిమీాది కంపెను. కాఫూరు కుమ్మరము ముట్టడించి శృంగభంగము నందిపోయెను. ఈవిజయము వలన కంపిలిరాయని కీర్తిప్రతిష్ఠలు మఱింతగ నభివృద్ధినందెను. మహమ్మదీయులతనికి జులకనమైరి. వారి బలపరాక్రమములతనిదృష్టియందు గడ్డిపోచవలె లఘువైపోయినవి. ఒక చిన్న విషయము దీని దెల్లముసేయగలదు ఒకానొకప్పుడు పాదుశాహుపాపోసులు ఢిల్లీసామ్రాజ్యమందలి దాక్షిణాత్యమండలములనుండి చక్రవర్తి ఖజానాకు జెందవలసిన కరమును వసూలుచేయుటకు మామూాలు మర్యాదప్రకారము బయలుదేరినవి. పాపోసుల పల్లకి వచ్చుచున్నదను వార్త చెవిసోకగనే దేశమందంతటను నలజడి పుట్టెడిది. సామంతులేమి, జమీాందారులేమి, మండలాధిపతులేమి, కలవరపడి యెదురుసేవకేగి పాపోసులను శిరముపై నిడికొని సగౌరవముగ దమ యధికారస్థానములకు దోడ్కొని వచ్చి పాదుశాహు భండారమునకు జెందవలసిన కప్పమొసగి కానుకలతోగూడ సాగనంపువారు. ఈమర్యాద కెచటనేనియు యత్కించితు లోపముగలిగినదానికి గారణభూతుఁడైనవాఁడు పాదుశాహి యుగ్రదండనకుఁ బాత్రుడగుట సామాన్యము.

ఒకనాఁడు పాపోసులపల్లకి వచ్చుచున్నదను వార్త కుమ్మరము నడివీధులలో వినవచ్చినది. కంపిలిరాయల చెవిసోకి

నదో లేదో, పొగలేని యగ్నివలె మండిపడినాఁడు కుమార రాముఁడు. ఇతఁడు కంపిలిరాయల జ్యేష్ఠపుత్త్రుఁడు. మఱియు నతని ఖడ్గమండితదక్షిణ హస్తము. వెంటనే గుఱ్ఱము నెక్కి శరవేగమునబోయి పాపోసులపల్లకి నడ్డగించి ఛిన్నాభిన్నము గావించెను; పాపోసులను దూరముగ దన్ని వేసెను. కుమార రాముని సాహసకృత్యమునకు ఢిల్లీసామ్రాజ్యము డిల్లవోయి నది. ఈ యవమానమున కోర్చుకొనఁజాలక పాదుశాహి కోపో ద్దీపితుఁడై కుమారరాముని నతని తండ్రిని నిర్మూలము గావింప వలయునని నిశ్చయించెను.

## 3. పులిమీఁదపుట్ర.

ఇది యిట్లుండగా పులిమీఁద పుట్ర యన్నట్లు మఱియొక యపరాధమువలన కంపిలిరాయఁడు పాదుశాహి కోపమును మఱియు తీక్ష్ణముగఁ బ్రజ్వలింపఁజేసెను. కంపిలిరాజ్యపు టుత్తరగడిప్రదేశమున కృష్ణానది యుత్తరతటమున, సగరను పేరుగల దుర్గ మొకటి యుండెడిది. ఢిల్లీ యవనసామ్రాజ్య ప్రాంతసీమయందలి గడి దుర్గములలో నిదియె ముఖ్యమైనది. దీని నప్పుడు ఢిల్లీ పాదుశాహు మేనత్తకుమారుఁడగు బహా ఉద్దీన్ గర్షాస్పను నతఁడు పాలించుచుండెను. ఇతఁడు పాదు శాహు నాధిపత్యము నంగీకరింపక స్వాతంత్ర్యమునుఁ బ్రక టించెను. గర్షాస్పునకి గంపిలిరాయఁడు మిత్త్రుఁడు; ఈమైత్రి నాధారపఱచుకొని యతఁడు పాదుశాహి సైన్యములచే బరా జితుఁడై తన మండలమున నిలువజాలక సకుటుంబముగ పరా

రిమై కమ్మటమునకు వచ్చి శరణు వేడెను. బహాఉద్దీను మహా మ్మదీయుఁడైనను, ప్రబలుఁడైన ఢిల్లీ పాదశాహునకు గర్భ శత్రుఁడైనను, స్నేహపాశబద్ధుఁడైన కంపిలిరాయ లతని విడ నాడక తనయొద్ద జేర్చుకొనియెను. ఢిల్లీసైన్యము లిక నతని రాజ్యమును ముంచివేయుననుటకు సందియ మేమికలదు?

### 4. శూలముల పండుగ.

శత్రు ప్రాబల్యమువలన రాజ్యమున కపాయ మిట్లు సన్నిహితమగుచుండగా, గృహచ్ఛిద్రము లతని జాలక్షోభ పెట్టినవి. కంపిలిరాయనికి హిరియాలదేవి, రత్నాజియను భార్య లిరువురుగలరు. రత్నాజి వయసున చాల చిన్నది. రూపరి. కుమారరాముని సాహసకృత్యము లామె పసిహృద యము నాకర్షించినవి ఆమె యెఱుకలేకయే యామె మన సాతనియందు లగ్నమైనది. ఆ కుమారుని రూపమును కను లార గాంచవలయుననియు, నతని వాక్సుధారసమును కర్ణ రంధ్రములనించికొని తనివితీర గ్రోలవలయుననియు సర్వదా కోరుచుండెడిది. చిరకాలమునకు సమయము తటస్థమైనది. రాయఁ డూర లేఁడు. అది శూలములపండుగమైనను, రాబోవు తురకలదండయాత్రయందు దేశసంరక్షణకై కట్టించుచుండిన హొసమల (ఆనెగొంది) దుర్గమును సంపూర్ణము సేయించుట కతఁ డచటి కేఁగియుండెను. రాచనగరిలోని యువకులతోఁ గూడ కుమారరాముఁడు నగరిముందరి మైదానమున బుట్టి చెండాడుచుండెను. అంతఃపుర సౌధోపరితలమున నిలిచి రత్నాజి

మొదలగు రాజస్త్రీ లందఱును ఆటను జూచుచుండిరి. ఏ వవశ మున చెండు పోయి సౌధోపరిభాగమున బడినది వెంటనే రత్నాజి యాదేశముపై దాసి దాని దాచినది. ఎవ్వరువచ్చి నను నియ్యక నిరాకరించి రాముఁడే స్వయముగవచ్చిన నిచ్చెద ననెను. పినతల్లి మూడువునకు బోవుట యుచితము గాదని విచారించియు చెండునుదెచ్చి మరల కందుక క్రీడను ముగింప వలయునను నిచ్ఛ ప్రేరేపింపఁగా నచటికిఁ బోయెను. మందిర మతఁడు చేరగనే రత్నాజి యెదురువచ్చి సత్కరించి చెండు నియ్యక మాటలనుబెంచి తన కతనిపైగల మోహమును వెల్లడిచేసినది. రాముఁ డామె కోరికను నిరాకరించి వ్యాకుల మనస్కుఁడై నగరు వెలువడివచ్చి మిత్రులను గలసికొనియెను. శూలముల పండుగ కుమారరామునికి హృదయశూలమై పరి సమాప్తి సందినది.

## 5. విపరీతవార్త.

కంపిలిరాయఁడు హోసమల దుర్గమునుండి మరలి వచ్చెను; పాదుశాహు ఢిల్లీనుంచి బయలువెడలి సైన్యముతో దక్కనుకు వచ్చుచున్నాఁడనియు, గుజరాతు మండలపాలకుఁడు అహమదు అయాసు పాదుశాహు ఉత్తరవు మేరకు కూచిచేసి వచ్చి దండుతోఁగూడ దేవగిరియందు విడిసి, కుమ్మఠముపై దండు గదల్చుకొని వచ్చుటకు ప్రయత్నము సేయుచున్నాఁ డనియు వార్త పట్టణమున ప్రాకినది. వీధుల మొగాళమునను రచ్చ ప్రాకుల క్రిందను జనులు గుంపులు గుంపులుగగూడి విత

ర్శింప నారంభించిరి. ఇట్లుండ మఱియొక విపరీతవార్త వారి చెవుల సోకెను. కంపిలిరాయలు దన ప్రియపుత్రుఁడైన కుమార రాముని కంతఃపుర ద్రోహమునర్ప గడగిన యపరాధమునకు మరణదండన విధించెననియు, నతని దండించుటకు వధ్యస్థానము నకుఁ గొనిపోవుచున్నారనియు వార్త గాలిలో గొట్టుకొనివచ్చినది. గుంపులై యున్న పట్టణ జనము విరియబారి రాజమందిరమువంక ప్రవాహమువలె బరుగిడ నారంభించిరి. వారింకను చాలదూరము పోలేదు; తమ కెదురు వచ్చుచుండు జనసమూహమును గాంచి స్తబ్ధులై నిలిచిపోయిరి. ఆ మూక కగ్రస్థానమున డంగురా వాద్యకుఁడు, వాని వెనుక బారులుతీరి రెండు వరుసల రాజభటులు, వారినడుమ పాశబద్ధుఁడును నవనతశిరుఁడును నగు కుమార రాముఁడు, అతని ననుసరించి యశ్రుపూరిత నయనుఁడగు రాముని యన్న కాటణ్ణ ; అందఱికి వెనుక మహా ప్రధాన దండనాయక బైచప్పయుఁ గానవచ్చిరి. డంగురావాని ఘోషతప్ప మఱియేశబ్దమును వినరాలేదు. ఈయూరేగింపు కోటగవను దాటినది. అంతవఱకు పట్టణ ప్రజలు దానితోగూడ నడచిరి. బైచప్పదండనాయకుని యాజ్ఞయైనది. ప్రజలను కోట వెలుపడనీయక కోటతలుపులు మూయఁబడినవి.

## 6. శిలావర్షము.

కుమారరాముని దారుణ మరణవార్తవిని కుమ్మటము దుఃఖజలధియందు మునిఁగియుండినది. హిరియాళదేవియెడ సానుభూతి చూపనివారును, రత్నాజిని నిందింపనివారును,

గంపిలిరాయని చర్యను ఖండింపనివారును కుమ్మరమున లేరు. అప్పుడే రాముఁడస్తంగతుఁడై వారము గడచినది. కంపిలి రాయఁడు రత్నాజి నగరినుండి వెలుపటికిరాక యుండినను, బైచప్ప దండనాయకుఁడు జతనముతో కోటకావలి కట్టుబాట్లను దృఢపఱచి తురకలు వచ్చిన వారికి తగు రీతిని స్వాగత మొసఁగుటకు వలయు ప్రయత్నములన్నింటిని చేయుచుండెను. ఇట్లుండ ప్రజల గుండెలలో మెదలుచుండిన భయము మూర్తీభవించి వారి కన్నులముందు ప్రత్యక్షమాయెను. ఒకనాఁడు అర్ధరాత్రి సమయమున జనులందఱు ఆదమరచి నిద్రించుచుండఁగా 'రణం', 'రణం' 'రణ' మనుచు రణభేరి మ్రోగినది. దద్దరిల్లి లేచి కోటగోడల ప్రక్కకు కోటలోనివారు పరుగిడిరి. కాని వారి నెవ్వరిని చెంతకు రానీయక కోట కావలివారు వెనుకకు మరలించుచుండిరి. కవచకార్ముకఖడ్గధారియై మధ్యవయస్కుఁడగు సర్దారొక్క డశ్వారూఢుఁడై పదుగురాశ్వికులతో గూడ కోటగోడల వెంబడి స్వారిచేయుచు, కోటగోడలకు గాపుండు భటులకు వారు చేయవలసిన కార్యమును దెలుపుచు, వారా కార్యముల నెట్లు నెఱవేర్పవలసినదియు విదశపఱచుచుండెను. దేవగిరి దర్వాజాకు గాపుండు భటుల కతఁడేదో యుత్తరు విచ్చుచుండగా పిడుగుబడినట్లు పడినది శత్రుసైన్యములోని మంజనీకుచే విసరబడిన గండశిల. వెంటనే దానికి జవాబిచ్చినవి కోట దద్దడములపై నుండు దంచనములు. మంజనీకులును దంచనములును నిట్లిరువాగుల వారిపై శిలావర్షము గురియింప నారంభించినవి.

## 7. హరహర మహాదేవ.

తెల్లవారినది. కంపిలిరాయలు కొలువుదీరి తన నాయకులను సర్దారులను పిలువనంపెను. ఎల్లవారును యుద్ధమునకు సంసిద్ధులై వచ్చిరి; కొలువు ఎప్పటికిని తీరున లేదు. సంగరోత్సాహ మెవ్వరి ముఖమునను గానరాలేదు. కుమారరామునితో పాటుదియు సమసిపోయెనేమో? కంపిలిరాయడును వీరులతో నెప్పటియట్లు పలుకలేదు. అతని ముఖమున గాఢ దుఃఖ చిహ్నము లింకను గానవచ్చుచుండినవి. పలుమారు తనదృష్టి ప్రాయికముగ రాముడు సభాస్థానమున నాసీనుడై యుండు తావుపై బ్రసరించినది. అంతర్గతమైన మానసిక వ్యధ ముఖముపై బ్రతిబింబించుచుండెను. తుదకెట్లో చిత్తమును దృఢపఱచుకొని, కొలువువారిని గలయజూచి, నాయకులారా, శూరులారా, పాదుశాహు మనల నిర్మూలింప నిశ్చయించి దండంపినాడు. కదనభూమి కంపిలి వీరులకు గల్యాణమందిరము కదా. తురకవారికి మన కత్తిపోటు రుచి చూపింపవలయును. ఇప్పుడు మీహృదయసీమల రాముడు తాండవమాడుచున్నాడని యెఱుగుదును. చింతించిన నేమిలాభము? రాముడులేని కొదవ మీ చిత్తముల జేరనీయక శత్రుసంహారమునకు గడంగుడు, లెండు, హరహర మహాదేవ' యని యుద్ఘోషించెను. 'హరహర మహాదేవ' యని ప్రత్యుద్ఘోషము గావించి వీరులందఱును యుద్ధమునకు నడచిరి.

యుద్ధము జయప్రదముగా ముగిసినది. పాదుశాహి సైన్యము వీరావేశముతో బోరినను కంపిలియోధుల ధాటి కాగజాలక వెన్ను చూపవలసివచ్చినది. తురక గుఱ్ఱపు దళము మలిక్ రుక్నుద్దీను ప్రోత్సాహముచే, గాలిచే రేగి పొరలివచ్చి తీరస్థపాషాణములఁదాకి చిందరవందరలైపోవు కడలి తరగల వలె, కంపిలివారియీఁటెబారులపైఁబడి ఛిన్నమాయెను. తురక దండు పరాజయమునంది వెనుదిరిగెను. ఈవిజయమునకు గారణ భూతుఁడామధ్యవయస్కుఁడగు సరదారుఁడు. ఆని మొన నచ లుఁడై నిలిచి పైపైవచ్చు తురక గుఱ్ఱపు ఫౌజు నెట్లు చెంతఁ జేరనీయక చెదరఁగొట్టవలయునో తెలుపుచు వారి యెత్తులకు ప్రతియెత్తులెత్తి శృంగభంగము గావింపకుండిన కంపిలివారి కా దినము జయముకలిగియుండదు. అతఁ డెవ్వఁడో వారెఱుఁగరు. పరికించిచూచిన కుమారరాముని పోలిక కొంత గానవచ్చును; కాని యతఁడు రాముఁ డెట్లు కాగలఁడు? రూపమున రామునికిని యతనికిని జాల వ్యత్యాసముగలదు. మఱియు రాముఁడు తండ్రి యాజ్ఞచే వధింపఁబడెకదా. చచ్చినవాఁడు మరల బ్రతికి యెట్లు రాగలఁడు? అందఱకుఁ గలిగిన సందేహమే కంపిలిరాయనికిని గల్గినది. యుద్ధానంతర మాతనివృత్తాంతము గనుఁగొన ప్రయ త్న మొనర్చెను. కాని యతని యడపొడ యెచ్చటను గాన రాలేదు. సేనాధ్యక్షుఁడైన బైచప్ప దండనాథుని విచారింపగా నతఁ డోరుగల్లు ప్రాంతమును పాదుశాహుపక్షమున బాలించు చుండిన రామరాజుతమ్ముఁడగు గణపనారాధ్యుఁడనియు, కుమా

రరాముఁ డోరుగంటికి పండెపుగుఱ్ఱమును స్వారిచేయుటకు పోయియుండినపుడు వారిరువురికి సఖ్యము గుదిరెననియు, దురకల దుండగములకు సహింపఁజాలక త్రిలింగమునువదలి పూర్వస్నేహమును స్మరించి రాము నాశ్రయించు నుద్దేశముతో నచటికివచ్చి రాముని యకాలమరణమునకు దుఃఖించి శూరుఁడగుటచే నప్పుడు సన్నిహితమైన యుద్ధమున పాల్గొని పంపావిరూపాక్షస్వామి సన్నిధియందు విద్యారణ్యస్వామివారి దర్శనము నపేక్షించి యచటి కేఁగెననియు చెప్పెను.

రుక్నుద్దీను పరాజయము మహమ్మదీయుల క్రోధమును మఱింత విశేషముగ రగుల్కొల్పెను; అహమదు అయాసు మరియొక సైన్యమును సంసిద్ధముజేసి కుతుబుల్‌ముల్కను సర్దారుని యాధిపత్యముక్రింద కుమ్మఠముపై నంపెను. ఇదియు ముందటివలె పరాభూతమై పారిపోయెను. ముందటివలెనే యుద్ధారంభమున మధ్యవయస్కుఁడైన శూరుఁడు మరల పొడగట్టి యెల్లయెడలను దానె శత్రులకు ప్రత్యక్షమృత్యుదేవతవలె గోలుమసగెను. యుద్ధాంతమున ధర్మదారయూదఁగనే యతఁడు సన్నసన్నగ జాఱుకొనఁ బ్రయత్నపడుచుండఁగా కంపిలిరాయఁడు మహాప్రధానిబైచప్పదండనాథునితోఁగూడ రణరంగమును బ్రవేశించి, యతని శౌర్యమును బ్రశంసించి తనకృతజ్ఞతను దెలుపుకొనుటకు సమీపించెను. చెంతకు జేరగనే యతనికబ్బురపాటు కలిగినది. ఆమధ్యవయస్కుఁడగు సర్దారుఁడన్యుఁడుగాఁడు: తనకు చిరపరిచితుఁడే. వేష మెట్లుమార్చుకొనినను

కంపిలిరాయఁ డాతని నానవాలు పట్టెను. సంతసమును కోప మును నతని మనమున బెనఁగొనఁగా బైచప్పదండనాయకుని వంక మొగమై, 'బైచప్పా, రాజాజ్ఞను నెఱవేర్చుటకు నూతన మార్గము నెప్పుడు గనిపట్టితివి? నినుఁబోలిన రాజభక్తిపరాయ ణుఁడగు ప్రధానియుండిన రాజాజ్ఞ యిట్లు (సర్దారునివంక చేయి చూపుచు) గాక మఱి యన్యవిధమున నెట్లు నెఱవేరఁగలదు?' అని గర్జించెను.

"ఈ కుంతవ్యుని యపరాధమును ఏలినవారు సైపుఁడు. నిరపరాధులను దండించుటవలన గలుగు మనోవ్యథను దేవర వారికిఁ గలుగనీయకుండుటకే తమ యాజ్ఞ నుల్లంఘించుటకు సాహసించితిని."

"రాముఁడు నిరపరాధియా?"

"చిత్తము."

"ధర్మాసనము ముందీ విషయము నేల తెలుపలేదు?"

"నిరూపించుటకు సాధనములు లేకపోవుట చేత."

"మఱి నిరపరాధియని యెట్లు కనుఁగొంటివి?"

"రాముఁడు పరదారసోదర బిరుదాంకితుఁడు. అతని చారిత్ర మట్టిదిగాదు."

"ఊహనుబట్టియేనా మహాప్రధానులవా రతఁడు నిర్దో షి యని నిశ్చయించినది?"

"దేవరవా రాగ్రహపడవలదు. కేవలము ఊహపై నాధారపడలేదు. దృఢమైన సాక్ష్యముఁగూడ గలదు. ఏలిన

వారు నగరిలోనికి విజయముచేసిన కుమారుని నిర్దోషిత్వమును తమ చిత్తమునకు సంతృప్తిగ నిరూపింపగలను."

అంతట వారిరువురును నగరికి తరలిరి. బైచప్ప కనుసన్నను గ్రహించి యా సర్దారుఁడు దనయునికిపట్టు వంక మెల్లగ నడచిపోయెను.

ఆదినము కుంమఠమున జనులందఱు సంభ్రమాశ్చర్య కలితచేతస్కులైరి. కుమారరాముఁడు రాజాజ్ఞ మేరకు వధింపఁబడలేదనియు నతఁడు నిర్దోషియని యెఱిఁగి బైచప్ప యతనిం దనయింట నేలమాలియయందు దాచియుంచి యతని నిర్దోషిత్వమును స్థాపించు సాక్ష్యమును సంపాదించి రాజుగారి మనసు కెక్కునట్లు ఋజువుపఱచి యతని హిరియాళదేవి నగరికిఁ జేర్చెననియుఁ దెలియవచ్చెను. ఆ సమాచారము వారి చెవుల కమృతధారాపాత మైనది. సర్వజనప్రియుఁడైన రాముని దాము మరల చూడఁగలుగుదుమను తలఁపు వారి నానందవార్ధిని ముంచి వేసినది. రాజదండనకు వెఱచి రత్నాజియు నామె కంతరంగ సఖియగు సంగళయు నంతఃపురమునుండి యెచటికో పాఱిపోయిరనియు వారుపోయిన పోబడి యెవ్వరికిఁ దెలియదను వార్త వారి నాశ్చర్యముపాలు చేసినది. స్త్రీల సాహస మెంత లేసి దొరలనైన కడగండ్ల పాలుసేయకపోవునాయని యబ్బురపడిరి.

ఢిల్లీనుండి సుల్తాను కూచిమీఁదకూచిచేసి దేవగిరి చేరెను. కంపిలిరాయనితో యుద్ధమున దనసైన్యము లోడిపోయెనని విని సందీప్తాగ్నివలె మండిపడెను. సుల్తాను చండ

శాసనుఁడు. అతనికోప మెప్పు డెవ్వరిని నాశ మొనర్చునో చెప్పుటకు వీలులేదు. అతఁ డహామదయాసును రప్పించి మందలించెను. కంపిలిరాయని శిరస్సుతోఁగాని తాను సుల్తాను సముఖమునకు మరలిరానని ప్రతిజ్ఞ చేసి, అయాసు దండునంతటిని కదల్చుకొని కుంమరముపై బ్రయాణభేరి నరచెను. ప్రయాణ మతఁ డనుకొనినంత శీఘ్రముగ సాగలేదు. ఎండకాలము. దండు దారియందుండు చెఱువులును దొరువులు నిర్జలములై యెండిపోయినవి. కావున దండు కృష్ణాతీరము సేరగనే అయాసు శిబిరములను వేయించి రెండుమూఁడు దినము లచట విడిసి యుండెను. దండచట విడిసియుండఁగా నొకనాఁడు సంధ్యాప్రొద్దున, నయాసు నమాజు చేసి లేవఁగనే, సైనికు లొక హిందూస్త్రీని ఱెక్కలు విరిచి కట్టినదాని నతనిసముఖమున దెచ్చినిలిపిరి. అతఁడు వెంటనే దండు తర్జుమానును బిలిపించి యామె పూర్వోత్తరమును విచారించెను. తనపేరు మాతంగి యనియు, కంపిలిరాయఁడు దన కపకారము జేసినాఁడనియు, దనకు గంపిలి రాజ్యములోని యాయపట్టుల మర్మముఁ జక్కఁగ దెలియుననియు, సుల్తాను గారి కీదండయాత్రను జయప్రదముగ సమాప్తి నందుటకు దాను సర్వవిధములఁ దోడ్పడెదననియు దెల్పినది. అయాసునకు పరమసంతోషముఁ గల్గినది. ఆమెకు ప్రత్యేక మొక డేరా వేయించి సకలమైన వసతులును గల్పించెను. అదిమొద లామె ప్రతిదినము అయాసు కొలువుకూటమునకుఁ బోవుచు నతనికి సలహా చెప్పుచు వచ్చునది.

* * * *

దండు దిగి నెలరోజులైనవి. ఏనుఁగులు, గుఱ్ఱములు, కాల్బలము కోటచుట్టు నేలయీనినట్లు కనుచూపుమేర కానవచ్చుచుండెను. రేయనక పగలనక ఇరుతెగలవారును పోరాడుచుండిరి. కుమారరాముఁడు, కోట సంరక్షకులకు ప్రాణము. కోట కొమ్మలయందును బురుజులమీఁదను అలంగ ములయందును ఒకచోటని వివరింపనేల, శత్రువుల యొత్తిడి ఎచట నతిశయించిన నచట రాముఁడు ప్రత్యక్షమై రక్షకబల మును ప్రోత్సాహపెట్టి పోట్లాడించినాఁడు. మఱియు నెప్పుడు శత్రువులు కునికిన నప్పుడకస్మాత్తుగ ప్రౌఢులైన యాశ్వికులతోఁ గూడ మెఱపు మెఱసినట్లు కోట దర్వాజాలనుండి వెలువడి తురకదండును ఖండతుండములు సేయువాఁడు. ఎంత శౌర్య ముతో బోరినను కోటరక్షకుల బలము సన్నగిల్ల నారంభించి నది. కోటలో సేకరించి యుంచియుండిన వస్తుసామగ్రియు జాలభాగము తరిగిపోయినది. మఱియు గుప్త మర్మస్థానముల నుండి శత్రులకస్మాత్తుగ కోటఁజొచ్చి యచట గళవళము బుట్టిం పఁ బ్రయత్నము సల్ప మొదలిడిరి. ఇఁక కోటనుఁ గాపాడుట దుస్సాధ్యమని యందఱికిఁ దెలియవచ్చెను. తురకలపై విజ యముగాని, యుద్ధమున వారిచే మరణముగాని తప్ప, యన్య మార్గానుసరణము వీరధర్మముఁ గాదని కంపిలిరాయఁడు నిశ్చ యించెను. శరణాగతసంరక్షణ మన్నిఁటికంటెఁ బ్రధానమని తలఁచి బహాఉద్దీన్ గర్షాస్పుని బిలిపించి యతనికి దన దుస్థితినిఁ దెలిపి, తోడిచ్చి సకుటుంబముగ ద్వారసముద్రమునకు బళ్ళాల రాయనికడ కంపెను.

గర్షాస్పుఁడు వెడలిపోయిన పిమ్మట మహమ్మదీయుల యొత్తిడి దుస్సహము కాఁజొచ్చెను. వారి యుద్రేకము హెచ్చ నారంభించెను. క్రమక్రమముగ కోటగోడల సమీపమునకు వారి ముట్టడి సాధనములు జేరినవి. కందకమును పూడ్చుటకు వేలకొలఁది పనివాండ్రు వచ్చి మట్టి మోయఁగడఁగిరి. కోట గోడలక్రిందుగ సొరంగములు ద్రవ్వ నారంభించిరి. ఒక నాఁటి వేగుజామున సుల్తాను సిపాయీలు కోట ఈశాన్య మున నుండు వీరభద్రబురుజు ప్రాంతమున లగ్గవట్టుచున్నా రని సమాచారము వచ్చినది. కోటయం దల్లకల్లోలము గలిగెను. వెంటనే రాముఁడు, కాటణ్ణ, భండారహరిహరుఁడు మొదలగు యోధులతోఁ గూడ వీరభద్రబురుజు వైపునకుఁ బరువిడెను. అతఁ డచటికి జేరునప్పటికి తురక సిపాయీలు కొందరు ఉడుపనిచ్చెనల నెక్కివచ్చుచుండిరి. 'హరహర మహా దేవ' యని సింహనాదము జేయుచు రాముఁడు తోడి యోధు లతోఁ గూడ వారిపై కురికి ప్రళయకాలరుద్రునివలె వారిని సంహరింపఁ గడఁగెను. తత్క్షణమే కాటణ్ణచే నాజ్ఞాపింపఁబడిన వారై కొందఱు మసలు తైలమును, మఱి కొందఱు కుతకుత నుడుకుచుండు నంబటి బానలను, తురక సిపాయీ లపై గుమ్మరించిరి. అనేకు లా వేడికి తాళఁజాలక కందకము లోనికిఁ దుమికిరి. పెక్కురు వివశులై నేలఁబడిరి. ఈ యడా వుడి నడుమ శత్రుసైనికుఁ డొక డదరు బెదరులేక పైకెక్కి వచ్చుచుండెను. వాని తలపై నొక యంబటిబాన పగిలెను. స్థబ్ధుడై యొక్కక్షణ మాతఁడు వివశుఁడై నిచ్చెనపైనుండి

పడబోయినను తెప్పరిల్లి మరల నెక్క నారంభించెను. ఆ సమీపమున గాచుచుండిన కుమారరాముఁడచటకు పరుగిడి నిచ్చెనచేరుల దెగవ్రేయుటకు ఖడ్గము నెత్తెను. తన్ను వ్రేయఁ బోవుచున్నాఁడని భ్రమసి యా సైనికుఁడు తన తలను వెనుక కోసరిలఁ జేసెను. కుమారరాముని కాసైనికునిముఖముఁ గాన వచ్చెను. తక్షణమె ఆతఁ డాశ్చర్యచకితుఁ డాయెను. ఆసైని కుఁడు పురుషుఁడు గాఁడు; పురుషవేషధారిణియైన స్త్రీ. ఆ ముఖము గాంచఁగనే 'సంగళ,' 'సంగళ' యనుమాట రాముని నోట వెడలెను. ఆడుపులివలె నాక్రోశించుచు సంగళ గోడ మీఁది కుటికి చేతనుండు ఈఁటెతో బలముకొలఁది రాముని వక్షస్థలమునఁ బొడిచినది. రాముఁడు నిర్గతప్రాణుఁడై క్రిందఁ బడెను. సంగళయు సొమ్మసిల్లి పడిపోయినది.

*　　*　　*　　*

కుమారరాముని నిర్యాణవార్త కంపిలిరాయని కందినది. తురకలను ముహూర్తమాత్రము కోటలోనికి చొరనీయక అడ్డుపెట్టవలసినదని కాటణ్ణకుత్తరువంపి నగరిముంగిట వచ్చికూర్చుండి దాసి నొకదానిఁ బిలిచి యంతఃపురమున హీరియాళదేవికి సందేశము నంపెను. గడియసేపైనది. అంతఃపుర ముననుండు స్త్రీలందఱును స్నాతలై భూషణాంబరాద్యలంకృతలై వచ్చి వరుసగ నిలిచిరి. వారినిఁ గని చిరునగవుతో 'మే మమరావతికిఁ బయనము వెడలనున్నాము. మావెంట రానిచ్చగలవారు రావచ్చును' అని పలికెను. స్త్రీలందరు నైక కంఠముగ 'మీకు సుస్వాగతమిచ్చుటకు మే మచటికి ముందుగ

జేరవలయును. మాకు వెంటనే పయనమున కనుజ్ఞయిండు,' అని వేఁడుచు నతనిపాదములు శిరసులుదాక నమస్కరించి నగరిలోనికి మరలిపోయిరి.

కంపిలిరాయఁడచటినుండి లేవలేదు. నగరియుం దన్ని మూలల పొగలు రేగినవి. అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లినవి. అన్ని ద్వారములకును రాయని యాజ్ఞచే బీగపుముద్రలు వేసిరి. నగరంతయు చక్కఁగ మండువఱకు నచటనే మాటాడక గూర్చుండియుండి యవ్వల తొడిగియున్న కవచముఁ దీసివైచి లేచి నిలిచి తనచుట్టు దృష్టినిఁ బఱగించెను. అచటనున్న యోధులందఱును తమతొడుసులను దీర్చుకొనివచ్చి రాయనితోఁగూడ తుదిపయనమునకు సంసిద్ధులైరి. రాయఁడు ముందంజవేసి దేవగిరి దర్వాజావైపు నడువ నారంభించెను. తోడి యోధవర్గమాతని ననుగమించెను. దర్వాజాను సమీపించునప్పటికి తురకల కిలారింపు చెవులసోఁకెను ఆ కోలాహలముకు వినఁగనే రాయఁడును నతని వీరవర్గమును సిల్లుచూపిన గంధగజముల వలె విజృంభించి, దర్వాజాతలుపులఁ దెఱపించి 'హరహర మహాదేవ' యని యార్చుచు శత్రుసైన్యముపైఁ బడిరి. వారు ప్రాణత్యాగముకొఱకై వచ్చినవారగుటచే నాత్మసంరక్షణము జేసికొనఁ బ్రయత్నపడలేదు. ఎందఱు శత్రులను వధింపఁగలిగిన నందఱిని వధించి ప్రాణము విడువవలయు నను నిశ్చయము గల వారగుటచే వారి నెదిరించుట సులభసాధ్యముఁ గాకపోయెను. కావున వారు పోయినంతవఱకు శత్రువులు జాపకట్టుగ బడుచు వచ్చిరి. అసంఖ్యాకులగు తురకలతో వారెంతసేపు పోరగలరు.

ఒకరొకరుగ వారందరు శత్రులమధ్య కూలిరి. తుదకు ముగ్గురు మిగిలిరి; కంపిలిరాయఁడు మధ్యను, నతనికుడిప్రక్క ప్రధాని బైచప్పదండనాథుఁడును, నెడమప్రక్క భండారబుక్కఁడును వెనుదీయక తురకసైనికుల నఱకుచుండిరి. వారిదేహములు పూచిన మోదుగచెట్లవలె నెఱ్ఱనిగాయములతో వికసించి యుండినవి. వయసున పెద్దవాఁడగుటచే బైచప్పకు అలుపు గలిగినది. ఇంతటిలో శత్రుసైన్యమునుండివచ్చిన సింగాణికోల యొకటి యాతని గొంతునన్నాటినది. అంత నాతఁడుకూలఁబడెను. తరువాత కొంతతడవునకు కంపిలిరాయలవంతు వచ్చెను; కుడి భుజము గుదియపెట్టుపడి స్వాధీనము తప్పిపోయినను నెడమ చేత ఖడ్గముఁగొని పోటుచూపెను. కాని రెండుకాళ్లయందు బలిష్ఠమైన గాయములు గలుగ నిలువఁజాలక తూల నారంభించెను. దేహమందలి నూఱాఱుగాయములనుండియు రక్త మశేషముగ గాఱిపోవుటచే నతనికి ప్రజ్ఞతప్ప నారంభించెను. కన్నుల చీఁకట్లు గ్రమ్ముకొనుచుండెను. తన యావచ్ఛక్తిని విని యోగించి ప్రజ్ఞ నొకక్షణము బిగఁబట్టి భండారబుక్కని చెంతకురమ్మని సంజ్ఞచేసి, యతఁడు సమీపమునకురాగానే, 'ఇదిగో నా విజయఖడ్గము. తీసికొనుము. దీనిని తురకలచే నీయను,' అని పల్కుచు రణశయ్య నలంకరించెను. వెంటనే మహమ్మదీయు లయాను నాజ్ఞచొప్పున నతనిశిరస్సును ఖండించి కొనిపోయిరి. భండారబుక్కని బంధించిరి.

---

# ప్రతీకారము

## ౧

లేచికూర్చుండినది పడుకమీఁద; గాజుకుప్పెలో వెలుగుచుండినది నలుసంతటి దీపజ్వాల. డమస్కు పట్టు ఒరగుపై రెండు మోచేతు లూనుకొని, కాళ్లు ముందునకుఁ జాచి కూర్చుండినది; కొంతసేపుఁ గూర్చుండినది ఏమో చింతించుచు; తరువాత పరికించి జూచినది పడుకటింటిని. చీఁకటియందు ముప్పాతిక మునిఁగియుండినవి వస్తువులన్నియు. దేనిమీఁదను ఆగ లేదు ఆమె దృష్టి. గదినంతటిని దిలకించి మరలివచ్చినవి పడుకమీఁదికి ఆమె కన్నులు; ప్రక్కను బరుండిన పురుషరూపము నాపాదమస్తకమును నిదానించి జూచినవి. ఆమె ముఖమున మందహాస మంకురించినది. చక్కఁగ పద్మాసనము వేసి కూర్చుండి యతని రెండు చేతులనుఁ బట్టి యూఁచినది.

"ఊఁ" అని పెడమొగముగ దిరిగి మరల నిద్రింపఁ గడఁగినాఁడు అతఁడు. మరల నతనిఁగదలించినది. జవాబు లేదు. చేతితోఁతట్టి, "లేవరాదూ. వయసుమగవానికి దేమి నిద్ర?" అని గేలిచేసినది. "పో, అఫ్రీత్, తొలఁగిపో" యని యామెను త్రోసి మరల కన్నులు మోడ్చినాఁడు. అంతట నామె దిస్సవార నవ్విన దొక తీగెనవ్వును. నిశ్శబ్దమైన యా యర్ధరాత్రి కాలమున మారుమ్రోగినది యామె నవ్వు మహాలంతటను. కిలకిల

మను సుదీర్ఘమైన యామె నవ్వును కలకలమను ప్రతిధ్వనుల మ్రోఁతయు నతనికి ప్రబోధము గల్గించినవి. దద్దరిల్లి లేచి కూర్చుండినాఁడు. నల్ల గడ్డమున సగము బ్రుంగియుండిన విశాలమైన ముఖము తామ్రపు హరివాణమువలె జేవురించినది; కన్నులు చంద్రనిప్పులవలె ప్రజ్వరిల్లుచు క్రోధానలజ్వాలలఁ గ్రక్కుచుండినవి. కాని యామె జంక లేదు. అతని వైఖరినిఁజూచి చిరునగవు చిందులుద్రొక్క పెదవులను దెఱచి యన్నది: "అబ్బ! ఏమి మోహము తమ కీనిద్రాదేవిమీఁద" అని. ఆమెమాటల మెత్తదనమువలన మొక్కవోయినకోపముతో 'అయే జిన్, సైతాను కూతురా! నీకు తృప్తి యెప్పుడు? ఇసుక నీటినివలె నాసత్వము నంతటిని త్రాగివేయుచున్నావు. చేపయని మొసలి నోటియందు చేయి పెట్టిన ట్లయినది నాగతి' అని గద్దించి పలికినాఁడు.

"ఏలినవారు క్షమింపవలయును నా యఱగొండెతనమును. తమ జనానాలోని పడుచుపిల్లలనుఁ జూచినప్పుడెల్ల తమరు సెలవిచ్చినట్లె ఖొజ్జాలను 'జిన్, పిసాచీ, యాషరీతు' లని పలుకుచుందురు. సుల్తానువారెట్లో గులాములుఁగూడ నట్లేకదా!"

ఆమెమాటల యర్థమును గ్రహించినాఁడు. రగులుచుండిన నిప్పు గాలితాకుడుచే భగ్గుమనునట్లు మండిపడి మంచము మీఁదనుండి క్రిందికిఁదూఁకి యామెను చేయిపట్టి యీడ్చి నేలపైఁద్రోసి మంచపుకోటికి దగిలించియుండిన బాకును ఒరనుండి పెరికి పొడుచుటకు చేతి నెత్తెను; కాని యామె బెదర లేదు; ప్రాణ

భయ మించుకంతయును గనుపఱుపక ముందఱివలెనే నవ్వినది కలకలమని. అతని మనస్సొకింత మెత్తగిలినది; ఎత్తిన చేతిని దించి అబ్బురముతో నడిగినాఁడు. "చావన్న భయము లేదా? మృత్యుముఖమున నవ్వెట్లు వచ్చినది నీకు?" అని.

"ఏలినవారి శౌర్యమునుఁగాంచిన నెవ్వరికి నవ్వు రాదు? ఒక యబలను సంతుష్టి పెట్టఁజాలక—"

"మరల మొదలుపెట్టుచున్నావు; ఎత్తిన బాకును దింపి నది పొరపాటు."

"తమ చిత్తమువచ్చినట్లు చేయవచ్చును. కలిగిన మాట చెప్పిన కంటిలో పుల్ల బెట్టిన ట్లని యనెదరు పెద్దలు. ఎచ్చటనో కుగ్రామమున సుఖముగ నున్నదానిని నానాదుఃఖముల పాలు జేసి భర్తను తలిదండ్రులకు వధించి యీడ్చి తెచ్చితిరే? ఏమి సౌఖ్య మనుభవించుటకు? తుదకు దేనికొఱకు..."

"చాలు,చాలు, నోరుమూయుము. నీవంటి సిగ్గుమాలిన యాఁడుదాని నెచ్చటనుఁ జూడలేదు."

"కావచ్చును; కాని ఏలినవారేకదా నా సిగ్గును జెఱచినది. దానివిషయమైన చర్చ అనవసరము. ఒక ప్రశ్న నడిగెదను. కోపమును జెందక వాస్తవమును సెలవిత్తురా?"

"ఏమిటా ప్రశ్న?"

"నా మనవిని వింటిరికదా?"

"కానీ."

"తమ రెప్పుడును ఇట్లెయుంటిరా? లేక ఇటీవల గలిగి నదా ఈమార్పు?"

"..............."

"పలుక రేమి?"

"విను, చెప్పెదను. విని మరల నవ్వవుగదా."

"ఏలినవా రీ దాసురాలి దుండగమును మన్నింప వల యును."

"మన్నన కేమి గాని, చెప్పు నవ్వుదువా?"

నేలమీఁదినుండి యంతట లేచి యామె మంచముపైఁ గూర్చుండి యతనిని దగ్గరకు చేరదీసికొన్నది. రెండు చేతు లతో నాతనిముఖమునుఁ బట్టుకొని తనముఖమువైపు ద్రిప్పు కొని చెప్పినది, "నవ్వను, నవ్వను, నవ్వను" అని ముమ్మాఱు.

"విను. కన్ననూరు కుప్పమున కాఫరుల ఫౌజును నాశ ముచేసిన తరువాత చెంగమ ప్రాంతమునకు దండు వెడలిపో యినాఁడను; ఒకనాఁడు అడవిలో విడిసియుండఁగా మామూలు ప్రకారము సిపాయీలు తత్పూర్వదినమున కైదీసేయఁబడిన కాఫరులను నాముందునకుఁ దోడ్కొనివచ్చిరి. వారిని యథా ప్రకారముఁ జంప నుత్తరు విచ్చినాను. వారిలో నొక ముసలి బ్రాహ్మణుఁడు నతని భార్యయు చక్కని యీడువచ్చిన కుమా ర్తెయు నుండిరి. వారిని నాముందు నిలువఁబెట్టినప్పుడు ఒక ఫకీరు, ఎచ్చటనుండి వచ్చినాఁడో తెలియదు, సముఖమున నిల్చి, వారిని విడిచి పుచ్చవలయునని బతిమాల నారంభించెను. కాని యాతని

వేడికోలును చెవినిఁబెట్టక కుమా ర్తెను జనానా గుడారములో నికిఁ దోడ్కొని పోఁడని ఖొజ్జాల కాజ్ఞయిచ్చి యామె తలి దండ్రుల నిరువురి నచటనే యాఫకీరు కన్నుల ముందఱనే తలలు నఱికించితిని. ఆ ఫకీరు మహాకోపముతో నావంక చుఱ చుఱఁజూచి ఇట్లు శపించినాఁడు. "అయే మలఊన్, నీకు పోఁగా లము సమీపించినది; అల్లా కటాక్షము నీమీఁదనుండి దొలఁగి పోయినది. ఆ వృద్ధులర క్తమును చిందించినావు. వారిని సంరం క్షింపఁ జాలక పోయినాను; ఆ పడుచును నీవు స్పృశింపవలదు. నామాట నుల్లంఘించితివా, దాని ఫలము ననుభవింతువు." ఆ మాటలను నేను లక్ష్యఁ బెట్టక నవ్వితిని. ఆ ఫకీరంతట "అల్లహా కే నాంకర్, అల్ల హారసూల్ కే నాంకర్" అని యల్లా నామస్మరణ జేయుచు వెడలిపోయినాఁడు. ఆ రాత్రి యాతని యాజ్ఞ నుల్లఘించితిని. అప్పటినుండి ప్రారంభమైనది నా ప్రస్తుత దుస్థితి."

"ఏలినవా రా ఫకీరునే శాపమును గ్రమ్మఱింపు మని ప్రార్థింపలేదా?"

"అతఁడు మరల గానవచ్చినఁ గదా."

"వెదకింపలేదా?"

"రాజ్యమందలి మసీదు మసీదందును, గ్రామ గ్రామము నందును వెదకించితిని. అడ పొడగానరాక పోయినాఁడు. ఏమయినాఁడో?"

"ఆయన కానరాకపోయిన లోకము గొడ్డు పోయి నదా? మహాత్ము లెందఱు లేరు."

"ఉన్నారు, మతవిషయములలో. కాని, మంత్రవిషయములలో? పేర్కొనఁ దగిన వారినందఱిని వేఁడుకొన్నాను. నీకు తెలిసిన గొప్ప మహాత్ముని నొకనిఁ గూడ ప్రార్థించినాను."

"ఆయన ఎవరో పేరు చెప్పరాదా?"

"చెప్పరాకేమి? ఇటీవల సిరందీబు నుండి వచ్చినాఁడే యా యరబీ తత్వజ్ఞుఁడు ఇబ్నేబతూతా; ఆయన సులైమా నంతటి వాఁడని మా మహమ్మదీయ ప్రపంచములో నంతట ప్రఖ్యాతి. ఢిల్లీ పాదుశాహు మహమ్మద్ బిన్ తుఘ్లాకు వంటి మహనీయుఁ డతని ప్రజ్ఞకు మెచ్చుకొని ఢిల్లీలో పెద్ద కాజీ యుద్యోగము నిచ్చి తన సంస్థానముననె నిలుపుకొన్నాఁడు. పాదుశాహువారి యాజ్ఞమీఁద మహాచీనాకుఁ బోవుచు మార్గమున మా యాస్థానమునకు వచ్చినాఁడు."—

"ఆయన ఏమన్నారు?"

"నా కథను విని ఆయన చెప్పినాఁడు, ఆ ఫకీరు నాపై మంత్రప్రయోగమునుఁ జేసినాఁ డని."

"అంతయేనా?"

"ఇదిగో చూడు నా మెడయందలి తాయెత్తును. దానిని మంత్రించి స్వయముగ ఆయన నా కంఠమునఁ గట్టినాఁడు; కట్టి ఇప్పటికి నెలరోజులు కావచ్చినవి. రానురాను నాశక్తి తగ్గుచున్నదే కాని హెచ్చుట లేదు."

అని చెప్పి నిట్టూర్చినాఁడు; ఆమె కొంతసేపు యోచించుచు మౌనముగ కూర్చున్నది. తరువాత నతనిని గాఢముగా కౌఁగిలించుకొని చెప్పినది "ఏలినవారు భ్రమపడుచున్నారు" అని.

"భ్రమయా? నన్ను గేలిచేసెదవా?"

"లేదు ప్రభూ, మీ యస్వస్థతను భ్రమ యనుటలేదు."

"మఱి?"

"ఫకీరు శాపమువలన మీకు జబ్బుగలిగినదనుట."

"అప్పటినుంచియే నాకీయవస్థ సంప్రాప్తమైనది! అంతకుముందు లేదే?"

"చెట్టుపై కాకి వాలుటకును, తాటిపండు నేలపైఁబడుటకును నెంత సంబంధము గలదో యంత సంబంధమే కలదు మీ జబ్బునకును ఫకీరు శాపమునకును."

"మఱి నాకీ దురవస్థ సంప్రాప్తమగుటకుఁ గారణము?"

"నరముల పుష్టి తగ్గుటవలన. మంత్రములవలన లాభము లేదు. వైద్యమువలన మీరు యథాస్థితినిఁ బొందగలరు."

"ఎందఱు హకీములను పిలిపించినాఁడను, ఎన్ని యౌషధములను సేవించినాఁడను. లాభ మేమియు లేదు. ఆ పాడు ఫకీరు మాట తప్పదు."

"అట్లనవలదు ప్రభూ. మీ జబ్బు వన్యమూలికలవలన గాని కుదురదు; అవి దేశాటనము సేయు సాధువులకడఁ గాని లభ్యపడవు."

"సాధువులా! వారొక్కరే బాకి."

"నా మనవి నాలింపరా?"

"కానీ, వ్యాధివచ్చినవాఁడు వెఱ్ఱివా డందురు కదా!"

౨

మిట్టమధ్యాహ్నము; ఎండ నిప్పులు వెదజల్లుచుండినది. తామ్రపర్ణి ఒడ్డున తిరునెల్వేలి పరిసరముల తాఁటితోఁపు. తాఁటిచెట్లనడుమ నచటనచట తురకగుడారములు. వానిమధ్య ఖత్ ఖురులోపల తొగటిగుడారము; దాని కిరుపార్శ్వములందును పది పండ్రెండు చిన్న తెల్ల డేరాలు. తొగటి గుడారము వాకిట నేజా నూనుకొని నిలిచి యుండినాఁడు పహరా సిపాయి. గుడారములో మంచముపై సుల్తాన్ ఘుయాజుద్దీను దామ్ఘనుషాహా నిద్రించుచుండినాఁడు. క్షణక్షణమునకు మార్పుఁ జెందుచుండిన యాతని ముఖవిలాసమునుఁ గాంచిన యతఁ డేదో కల గను చుండెనని తెల్లమగుచుండెను. చిరునవ్వుతో వికసించియుండిన ముఖమం దున్నట్టులుండి భయచిహ్నములు పొడసూపినవి. దేహము జడత్వ మంది యుండినను అంతరంగము గలఁతనంది యుండెనని విస్పష్ట మగుచుండినది. గడ్డమందలి వెండ్రుకలు నిక్కవొడిచినవి; ఊపిరియాడక కష్టముతో నుచ్ఛ్వసించుటకు ప్రయత్నము సేయుచుండినట్లు గానవచ్చినది. రెండుమూఁడు మారులు గొంతునందు గురగురమను నస్పష్ట శబ్దములు విన వచ్చినవి. కావుకూఁత వేసి దద్దరిలి మంచముమీఁదనుండి క్రిందికి దొర్లినాఁడు సుల్తాను. ఆ కూతనువిని పహరా సిపాయి

సత్వరముగ శిబిరములోనికి ప్రవేశించెను. ఆ సమయముననె డేరా కుడిప్రక్కనుండి తెఱను దొలఁగఁద్రోసికొని వచ్చినది ప్రక్కగుడారమునుండి యొక యౌవనవతి. ఆమెను జూడఁగనె సిపాయి వేగిరపాటుతో వెనుదిరిగిపోయి యథాస్థానమును జేరెను. ఇంతటనె సుల్తానునకు ప్రబోధము గలిగెను. ఆమెయు దాపునకు వచ్చి యతని మూపులపై హస్తముల నిడి భయ పడిన బిడ్డ ననునయించు తల్లివలె బుజ్జగపు మాటలఁ దిన్నఁగ నడిగినది, 'మహాప్రభూ, ఏలినవారి విశ్రాంతికి భంగ మెట్లు కలిగినది? తాము కలఁతల మందినట్లు గానవచ్చుచున్నారే? దేనివలన తమకు తత్తరపాటు కలిగినది?'

ఆమె మాటలకు జవాబు సెప్పకయే గర్జించినాఁడు సుల్తాను "అయే దర్వాన్!" అని.

"జహాన్ పనా" అనుచు లోపలికి వచ్చి వంగి సలాము చేసినాఁడు పహరా జవాను. వానివైపు తీక్ష్ణదృష్టులఁ బఱపుచు గద్దించినాఁడు. "నిద్రపోవుచుంటివా ? డేరాలోనికి ఎవ్వరికి ప్రవేశము లేదని ఎఱుఁగవా?"

"మఖ్దూమా జహాఁ వాకిఫ్."

"అయే, బేఅకల్, మఖ్దూమాజహాఁ కాదు."

"మఱి యెవ్వరు రాలేద్ హుజూర్."

"రాలేదూ? రాలేదూ? బాహిర్ చలో."

పహరా జవాను భయవిహ్వలుఁడై యథాస్థానమునకుఁ బోయెను. మరల ఆ యౌవనవతి యడిగినది, 'ఎవరు వచ్చి

నారు మహాప్రభూ తమకు నిద్రాభంగమును గలిగించుటకు?' అని, మంచముమీఁద చదికిలఁబడి చెప్పినాఁడు. 'మహారాజవాను చెప్పినది నిజమే. ఎవ్వరును రాలేదు' అని.

"మఱి తమకింత క్షోభయేల కలిగినది?"

"ఆఫకీరు వచ్చి..."

"రాలేదంటిరే యెవ్వరును?"

"రాలేదు, ఫకీరు రాలేదు; అతని యాత్మ వచ్చినది; వచ్చి నాఱొమ్ముపైఁ గూర్చుండినది. ఆపడుచు నేమిచేసితివని గదమాయించినది; ఱొమ్ముమీఁద గుద్దినది; గొంతును నులిమినది. చూడు, మెడచుట్టును ఎట్లు కదుములు గట్టియున్నవో?"

"రాలేదు, మహాప్రభూ, రాలేదు. ఫకీరుగాని యతని యాత్మగాని."

"రాలేదా!"

"రాలేదు, రాలేదు, రాలేదు. కేవలము భ్రమ."

"భ్రమయా? నేను స్పష్టముగ చూచితినే? అతని కరస్పర్శ ఇంకను నాకంఠము చుట్టును దగులుచున్నట్లున్నదే".

"కలగంటిరి అంతే."

"కలయా! ఎంతటి పాడుకల! ఎంతనిజముగ దోఁచినది?"

"నరముల పుష్టితగ్గినప్పుడు ఇటువంటి మనోవికారములు కలుగుట సహజము. ఏలినవారు నావిన్నపము నాలకించి తగు చికిత్స యొనర్చియుండిన ఈబాధకలిగియుండదు."

“నరముల పుష్టికిని నాకువచ్చిన కలకును నేమి సంబంధము? మాటవరుసకు ఉన్నదనుకొన్నను అది కుదురుమార్గము గానరాకున్నది; దేశమునందలి హకీములను వైద్యులను అందరిని రప్పించి వారు చెప్పిన యౌషధముల నన్నిఁటిని సేవించితిని.”

“హకీములవలనను వైద్యులవలనను తమకు మేలుకలుగదని నేను ఇంతకుముందె మనవి చేసికొని యున్నాను.”

“అవును, జ్ఞప్తియందున్నది. నీవు చెప్పినట్లు సాధువుల మూలమున నా జబ్బు స్వస్థపడునని యనుకొన్నను దొరకని మందువలన లాభ మేమి?”

“సాధువులు లేరా?”

“ఉన్నారో లేరో. ఎంత వెదకించినను ఒక్కఁడైనను గానరాలేదు.”

“ఉన్నారు, ఉన్నారు. ఏలినవారివలని భయముచే దాఁగినారు.”

“భయమా? నే నేమిచేసితిని వారిని?”

“కనఁబడిన హిందువులనందరిని ప్రత్యక్ష మృత్యువువలె వధించు తమ సముఖమున కేసాధువు రానిచ్చగించును?”

“మఱి నాకు వారివలన మేలెట్లు కలుగఁగలదు?”

“ఏలినవారి యాజ్ఞయైన ఈ దాసురాలు తోడ్కొని రాగలదు.”

“ఎప్పుడు?”

“మధుర జేరిన వెంటనే.”

### 3

మోతీమహాలులో నొక చతుశ్శాల; పారశీ తివాసీపై బఱచిన జముఖాణముమీఁద యొరగు దిండ్లమధ్య సుల్తాను ఘయాజుద్దీను సుఖాసీనుఁడై బంగారుప్యాలానుండి రక్తవర్ణపు షిరాజు షరాబు త్రాఁగుచుండెను. ఎదుట షరాబుతో నింపిన పెద్ద షీషాను బట్టుకొని సాకీ యొకఁడు నిలిచియుండెను. నిశ్శబ్దముగ సుల్తాను వెనుక ప్రక్క తలుపును దెఱచుకొని లోనికి వచ్చినదామె. ఆమె యడుగులచప్పుడు విని వెనుదిరిగి చూచినాఁడు సుల్తాను: ప్యాలాలో మిగిలియుండిన యాసవము నొక్క గ్రుక్కలో ద్రాగివేసి, దానిని సాకీచేతికిచ్చి వానినిఁ బొమ్మని సంజ్ఞచేసి యామెకు దన ప్రక్కను తావుచేసి వచ్చికూర్చుండుమని కన్గొనెను. వచ్చి కూర్చుండి గడ్డముమీఁద చిందియుండిన యెఱ్ఱని షరాబు బిందువులను చిన్నపట్టురుమాలుతో దుడిచివేయుచు నడిగినది.

"ఏలినవారి షికారు జయప్రదముగ సాగినదా?" అని.

"సాగకేమి? ఒకపీలును బట్టుకొంటిమి. నాచేతితో జంపితిని రెండు పులులను, ఒక చిరుతను, నాల్గు జింకలను, రెండు దున్నలను. చాల శీఘ్రముగ గడచినవి ఆవారము రోజులను. జంతువుల జాఁకులను వెదకుటకును వానిని కాచియుండి చంపుటకును మాకాలము సరిపోయినది. వేఁటయందె మా మనసు సంపూర్ణముగ నిమగ్నమై పోయినది. అన్యచింత చొచ్చుట కవకాశము చిక్కలేదు."

"ఏలినవారి మాటలు చాల సంతోషముఁ గలిగించు చున్నవి. సాధువువైద్యమునకు ప్రథమఫల మిది."

"సాధువువైద్యమునకు ఫలమా? ఆతఁ డింకను ఔషధము నియ్యనేలేదే; మందు చేసితెచ్చెదనని చెప్పిగదా పోయినాఁడు."

"చిత్తము."

"మఱి యతని వైద్యమునకు ఫలము నేననుభవించుట యెట్లు సాధ్యమగును?"

"వేటకుఁబోయి యుంటిరికదా."

"అవును."

"అప్పుడు మీకు సంపూర్ణ మనశ్శాంతి గలిగినదా లేదా?"

"కలిగినది. కాని దానికి సాధువు వైద్యముతో నేమి సంబంధము?"

"వారి యాదేశముమీఁదనేకదా ఏలినవారు బయలు వెడలినది వేఁటకు."

"అతని యాదేశమా?"

"తమకు దెలియనీయక తమ మనసును సంపూర్ణముగ నాకర్షింపగల వ్యాపారమునఁ బ్రవేశపెట్టుట యుక్తమని ఆయన చెప్పినాఁడు."

"ఊఁహూఁ. ఇప్పుడు బోధపడుచున్నది, నన్ను షికారునకుఁ బొమ్మని నీవు పురిగొల్పినందులకుఁ గారణము."

"చిత్తము."

"అట్లయిన, అతని వైద్యము నీవు తలఁచునంతటిగుణముఁ గలిగింపలేదు."

"అన్యచింత లేక వేటయందు నిమగ్నులై యుంటినంటిరి కదా."

"అవును. నిజమే. షికారున మనస్సు నిమ్మళముగ నుండినది. కంటినిండ నిద్రపట్టుచుండినది; కాని యా పరిస్థితి పట్టణము కంటఁబడగనే మారినది."

"ఏమి జరిగినది?"

"వేఁటకాండ్రతోఁ గూడ షికారు సరంజామునంతటిని వెనుక విడిచిపెట్టి మేము ముందఱ సవారిచేసి వచ్చుచుంటిమి. అందఱికి ముందు నేను; నాకు పదియడుగులు వెనుక నాసిరుద్దీను, మలిక్ బదిరుద్దీను ప్రభృతులును వచ్చుచుండిరి. పశువులను దాఁటి కొంతదూరము వచ్చినారము. కాజీ సద్రుజ్జమాను గుఱ్ఱము మునిగాలు పెనగిలి ముందునకు పడినది. కాజీసాహేబువారు జీనుపైనుండి క్రిందఁబడిరి. వారిని లేవనెత్తుటకు తక్కినవా రందఱును గుఱ్ఱములనుఁ దిగిరి. నేనాగక ముందునకు సాగివచ్చుచుంటిని. పశువుల కొకపర్సంగు దూరమున నొక పాడుపడిన బుఖ్తానయు దానిసమీపమున నొక కోనేరును గలవు. కోనేటిగట్టున నొకవ్యక్తి గానవచ్చెను. నన్ను చూచి యతఁడు లేచి నిలిచి యాచేరువ నుండిన టెంకాయతోఁపువైపు బోనారంభించెను. అతనినడకఁ జూడ నాకతఁడు పరిచితుఁడైనట్లు తోఁచినది. గుఱ్ఱము నాతనివైపునకు దఱిమి

తిని; సమీపమునకు రాగనె యతని నానవాలు పట్టితిని. అతఁడె ఆఫకీరు. నేను దగ్గరకువచ్చితినే కాని యతని గలుసుకొనఁజాలక పోతిని అతనిఁ బిలిచితిని; వెనుదిరిగియైన చూడక తోఁపును బ్రవేశించినాఁడు; నేనును అతనివెంట తోఁపుఁజొచ్చితిని; మఱి యతని పొడ గానరాలేదు ; చెట్లమరుగున నెట్లు మాయమైనాఁడో తెలియదు.''

''ఎంతటి గాఢమైన భ్రమ ! సర్కారువారు నన్ను క్షమింపవలయును. అటువంటి వ్యక్తి లేడని నా దృఢనమ్మకము.''

''నాకన్నులతో నే నిన్నిపర్యాయములుచూచిన వ్యక్తి లేఁడనిన నే నెట్లొప్పగలను; ఉన్నాఁడు, ఉన్నాఁడు, ఉన్నాఁడు. లేడని చెప్పవలదు.''

''తాముచూడలేదని నేననను; తాముచూచినది వాస్తవమే; కాని తాము చూచినవ్యక్తి తమ ఇంద్రియవైకల్యము వలన నుత్పత్తియైనాఁడు;తమయూహా ప్రపంచమునదప్ప వానికి మఱి యెచ్చటను తావులేదు. పసిరికలచే పీడితుఁడైనవాని కంటికి ప్రపంచమంతయు బచ్చగ గానవచ్చినట్లు, భ్రమజెందిన తమకంటికి ఆఫకీరే యెల్లయెడల ప్రత్యక్షమగుచున్నాఁడు. వానిని మీరు మరచిపోఁ బ్రయత్నముసేయుఁడు. క్రమక్రమముగ నతఁడు నశింపఁగలఁడు. అతని జింతించుచు మీరు కలఁత నందవలదు.''

"నీ మాటలపొందిక చక్కఁగనే యున్నది. నీవుచెప్పి నట్లతఁడు నా యింద్రియ వైకల్యముచేతనే కలిగినవాఁడని యొప్పుకొనెదను. కాని యా టెంకాయతోఁపో? అదియు నా యింద్రియ వైకల్యముచేతనే కలిగినదా?"

"ఈ మధురాపట్టణము చుట్టును నెన్నియో టెంకాయ తోఁపులు గలవు? ఎండమావులలోని నీటిని వెదకు ప్రయాణి కునివలె తామా మాయఫకీరు వెంట నేదో యొక తోఁపును బ్రవేశించి యుందురు. అందేమి విశేషము గలదు?"

"నేను ప్రవేశించిన తోఁపు ఈ ప్రపంచమందలి సామా న్యమైన టెంకాయతోఁపు కాదు. అది నరకలోకములోని సైతాను క్రీడావనము."

"ఏలినవా రట్లనుటకు గారణము?"

"తోఁపులో బ్రవేశింపఁగనే ముఖముపై గొట్టినది దుర్గంధపుగాలి; కడుపులోని పేగులన్నియు పెకలి వచ్చినవి గొంతులోనికి. అడుగుబెట్టుటకు సందులేదు నేలమీఁద! ఎచ్చట చూచినను ఎముకలు, విరిగిన చేతులు, తునిసినకాళ్లు, భగ్న మైన వక్షఃస్థలములు, చూర్ణమైన బరియెమ్ములు; చెట్టుచెట్టు నుండి వ్రేలుచుండినవి అస్థిపంజరములును, శవములును; ఏ ప్రక్కఁజూచినను పండ్లిగిలించి యుపహసించుచుండినవి కపాల ములు; లొట్టకన్నులు, తొట్టిముక్కులు, గీటినపండ్లు చూడ ఘోరమైయుండినవి. అచటనచట వ్రేలుశవముల మాంసము కొఱుకుఁ బోరువలును కుక్కలును బోట్లాడుచుండినవి. ఆ

భయంకర దృశ్యమునకు బెదరి కాఁబోలు నా గుఱ్ఱము బయటికి దవుడుతీసినది. ఇదియు భ్రమ యనెదవా ?

"ఇది భ్రమకాదు మహాప్రభూ, వాస్తవము; ఇట్టి తోఁపొక్కటికాదు, మధురాపురము చుట్టును పెక్కు కలవు."

"పెక్కు కలవా? అవి యెట్లు శ్మశాన సదృశములైనవి?"

"ఏలినవారి ప్రజాపాలనా ప్రభావమువలన."

"నా ప్రజాపాలనా ప్రభావము వలననా?"

"చిత్తము. అనుదినమును దమయాజ్ఞచే వధింపఁబడు మందభాగ్యులగు హిందువుల యస్థిశకలములవి. హిందువులపై ద్వేషము ఏలినవారికి పుట్టుకతోవచ్చినది. అది జాడ్యముగాదు. ఏలినవారి స్వభావము మారినగాని అది పోదు. అంతవఱకు దానిని కుదుర్పగల మందు లేదు; కావున దానివిషయమై చింత నందవలసిన యవసరము లేదు. కాని మీకు ఆ టెంకాయతోఁపునకు మార్గముఁ జూపిన ఫకీరుమాత్రము మాయాపురుషుఁడు; మీచిత్తవిభ్రాంతియే అతని జన్మభూమి; నరములపుష్టి తగ్గుట వలన కలిగిన చిత్తవిభ్రాంతి తనంతట పోఁజాలదు; కారణము నిర్మూలమైనఁగాని దానివలనఁ గలిగిన కార్యము రూపుమాసిపోదు."

ఘియాజుద్దీ నించుకసేపు ఏమేమో చింతించుచు మౌనముగ కూర్చుండియుండెను. ఆమెయు నాతనిఁబలుకరింపలేదు. తుదకతఁడు నిట్టూర్చి అడిగినాఁడు.

"వచ్చినాఁడా ఆసాధువు మరల?" అని.

లు వెలుపట వేయించి లోనికి వచ్చెను. బానిసనాయకునితో బయటినుండి వారిని మోసికొనిపోయినవారిలో నొకఁడు బానిస నాయకునితోఁ గూడ మరలివచ్చుచు ద్వారమునఁ గూలెను; అతని పాటునుఁ జూచి మరచలందఱును భయవిహ్వలులై "మారియాత్తా, మారియాత్తా" యని యాక్రందింపఁగడఁగిరి. బానిసలనాయకునికి గుండెపున జేయి వెట్టి కలఁచినట్లాయెను; కండ్లు తిరుగ మొదలిడినవి; మఱియొక క్షణమునకు వమనమగునట్లు తోఁచినది. మహాభయముచే గంపించుచు నతఁడు దంపుడుకొట్టమును విడిచి బానిసల యునికిపట్టువైపు దిన్నగ నడచిపోయెను.

* * *

మొదట సుల్తానునకు మారెమ్మరాక నెవ్వరును జెప్ప లేదు; సాధువంపిన యౌషధమును సేవించుచు నతఁడు ఏకాంత మందిరమున నుండెను; ఇద్దఱు పరిచారకులు దప్ప మఱియెవ్వరును అతనియొద్ద లేరు. వేటనుండి మరలివచ్చి నాల్గురోజులైనవి. సాధు విచ్చిన నాల్గుమాత్రలలో రెండు ఐపోయినవి. నరముల కెన్నఁడునులేని చైతన్యమును గలిగెను; ఉద్రేకమును భరింప శక్యముగాకపోయెను తనకు పరిచర్య సేయు ఖోజాల నిద్దఱను పలుమారు రెగాదిగ చూచెను వారాతని భావమును గ్రహించిరి; ఒకఁడేదో యవసరకార్యముఁ జెప్పి వెడలిపోయెను. రెండవవాఁడు అనినాఁడు, 'హుజూర్, తమకు బీగము సాహెబా వారిమీఁద మనసు పాఱినట్లున్నది. వారిని ఇచ్చటికి

రమ్మని యాజ్ఞాపించితిరని పోయి మనవిచేయుదునా?'' అని. వానిమాటలు సుల్తాను చెవులకు అమృతధారాపాతమువలె సోఁకినవి; ముఖము చిఱునవ్వుతో వికసించినది. 'అచ్ఛా'యను మాట అప్రయత్నముగ వెలువడినది. వెంటనే యతని సముఖమునుండి బయలువెడలినాఁడు ఖోజ్జా సుల్తాను ఒంటరిగ కూర్చున్నాఁడు; అతని మనస్సంతయు బీగముసాహెబాపై లగ్నమైయుండినది అతని యాతురము హద్దుమీఱినది. ఖోజ్జా వాఁడు పోయి యింక నైదునిమిషములైనను కాలేదు; అతనికి గడియలు దాఁటిపోయినట్లు తోఁచినవి. కూర్చుండఁజాలకపోయినాఁడు ఒకచోట. లేచి వెనుకకు ముందునకు పచారుసేయఁ గడఁగినాడు. ఎచట యలుకుడైనను బేగముసాహెబా వచ్చుచున్నదని చెవియొగ్గి విన నారంభించెను. దాదాపు పదినిమిషములు గడచినవి. ఇఁక నతఁడె బేగముసాహెబా మహలునకు దరల నిశ్చయించుకొనెను. అప్పుడు వచ్చినాఁడు ఖోజ్జా పరుగుమీఁద. వాని ముఖము విన్నదనముచే వాడియుండినది ; కత్తివాటు వేసిన రక్తబిందు వెచ్చుటను గానవచ్చునట్లు లేదు. వాని విన్నబాటును వేగిరపాటునుఁ జూచి సుల్తాను వానిని హెచ్చరించినాఁడు, 'ఏమిరా' అని. వాఁడు ఏడ్చుచు 'జహాఁపనా, బేగం సాహెబా గారు—'అని యర్థోక్తిలో నాగి మాటలాడలేక కూలఁబడెను. సుల్తాను వానిని సమీపించి లేవనెత్తపోఁగా వాఁడు దూరముగ దొర్లిపోయి ప్రయత్నముతో ''జహాఁపనా, ఈ గులామును తాఁకవలదు. నేను బీమారీ అయినాను. అల్లాకడకు పోతున్నాను.

హుజూరు వారి మహలున మారియా త్తాపొడచూపినది. బేగ ముసాహెబా మూర్ఛయినారు; తమతల్లిగారును మూర్ఛయినారు; సుల్తానుజాదా మూర్ఛయినాఁడు; నేను మూర్ఛగుచున్నాను. ఇక్కడ నుండవలదు. పరారి, పరారి.'' యనుచు తల నిటునటు ద్రిప్ప నారంభించినాఁడు. మాట లాగిపోయినవి.

సుల్తానునకు దిక్కుదోఁచలేదు. పిడుగువంటి తనకుటుంబ వినాశనవార్త యతనిగుండెను నీరుగావించినది. స్తబ్ధుఁడై నిలిచినాఁడు కొంతసేపు. దాహమెత్తినది; కూజాలోని శీతజలమును ప్యాలాయందు నింపుకొని త్రాగినాఁడు; అంతరాత్మ యచటి నుండి పారిపొమ్మని పురికొల్ప నారంభించినది; వాకిటివైపు రెండుమూఁడంజలు వేసి యేకాంతమందిరము నొక్కపర్యాయము పాఱజూచినాఁడు. ఎదుట మంచముమీఁద యొరగుపైగానవచ్చినది దంతపు బరిణ. దాని నెత్తుకొని అంగీ జేబునం దిడుకొని పరధ్యానముగ నడచినాఁడు వాకిటితట్టు.

* * *

మధురకుఁ దూర్పున నొక పర్సంగు దూరమున వైగ యుత్తరపు టొడ్డున నొక పాడు పడిన శివాలయము. సూర్యోదయమై జాము ప్రొద్దెక్కినది. ఎచ్చటను మనుష్యుల పొడ గాన రాలేదు. ఏటి ఇసుకయందు నడచి యాదేవాలయమువైపు వచ్చుచుండినది ఒక స్త్రీ. గట్టునఁ జేరిన పిమ్మట నలవు దీర్చుకొనుట కేమో యొక క్షణకాలము నిలిచి పరికించిచూచినది. ముందు గానవచ్చినవి వలస వచ్చినవారి డేరాలును టెంకా

యాత్రికుల గుడిసెలును; కాని యవి యామె నాకర్షింపలేదు. దేవాలయము ప్రక్కనడచినది. ఎవ్వరును గానరాలేదు. ఇడిసి పడిన ప్రాకారమును దాఁటి లోపలికిఁజొచ్చి రంగమంటపమునుఁ బ్రవేశించినది. పాడుపడియుండినను జన నివాసము లందు గానవచ్చుచుండినవి. మంటపతలమున విలువగల తివాసులును రత్నకంబళములునుఁ బఱచియుండినవి. ఒకమూల మెత్తలు కుట్టిన సోఫా, దాని కిరుపార్శ్వములను కుర్చీలును నిలువఁబెట్టఁ బడియుండినవి; మధ్య నొక యెత్తయిన మేజా, దానికి నాలుగు ప్రక్కల కుర్చీలును నమర్చియుండినవి. అర్థ మంటపమునకుఁ బోవుదారియం దొక పట్టెమంచముపై సుల్తాను ఘయాజుద్దీను బరుండియుండెను. ఆమె చక్కఁగ సుల్తాను మంచముదగ్గరకుఁ బోయినది. ఘయాజుద్దీ నామెనుఁజూడలేదు. అతఁ డేదో మహా బాధచే పీడింపఁబడుచుండినట్లు గానవచ్చెను. పలుమారు అల్లా నామస్మరణముఁ జేయుచు గడుపును రెండుచేతులఁ బట్టి పిసికి కొనుచు మంచముపై నొక ప్రక్కనుండి మఱియొక ప్రక్కకుఁ బొరలుచు, తల నిటువైపునుండి యటువైపునకు విసరుచు మూల్గుచు నేడ్చుచు నుండెను. మంచము చెంత యతని దుర వస్థనుఁ జూచుచు కొంతసేపు నిలిచిన దామె. చిఱునగ వంకు రించిన దామె మోముపయి. హెచ్చరించుకొన్నది 'మహా ప్రభూ' యని. ఆమెమాటను విని యతఁడు కన్నులఁ దెఱచి చూచెను; కాని యామెను బోల్చుకొనఁడాయె. 'దాహము, దాహము' అని యడిగినాఁడు. ఆమాటలలోని దైన్యము ఆమె

మనసును మెత్తపఱచినది. సమీపమున నుండిన కూజాలోని జలమును ప్యాలాలోనికి వంచుకొని యాతని నోటఁ బోయుటకు మంచముపై వంగినది దుర్గంధము గుప్పున మోముపయిఁ గొట్టినది. పడుకమీఁద, అబ్బ! మల వమన పరిచ్యుతము నిండియుండినది. నరకమునందుఁ గూడ నంతటి రోఁతబటికముఁ గలుగదు. ఎట్లో ప్రాణములు బిగబట్టుకొని యతని నోట కొంచెము జలము బోసినది. జలము గొంతు దాటఁగనే యతనికిఁ గొంత తెలివి వచ్చినది. మాటలాడఁగడఁగినాఁడు. గాలిలో గొట్టుకొని వచ్చు నస్పష్ట మర్మర శబ్దముల వలె యతని మాటలు వినవచ్చుచుండెను. మాటల వినికిచే గాక చాలవఱకును పెదవుల కదలికచే నామె యతనిభావము గ్రహింపవలసివచ్చెను. 'ఆసాధువు, ఆసాధువు,' అను మాటలు వినవచ్చినవి.

'ఏమి ప్రభూ, ఆసాధువు వచ్చినాఁడా మరల?'

'లేదు, లేదు, మాత్ర, మాత్ర'

'ఏమి, మాత్రలవలన గుణముకలుగ లేదా?'

'గుణము, గుణము' అని పడకమీఁదికి దృష్టి త్రిప్పి తలను విసరినాఁడు యీ మంచపుకోటినుండి యా మంచపుకోడువఱకు ఆప్రయత్నము దుర్భరమైపోయినది. కన్నులు మూతలుఁబడినవి. దేహచలన మాగిపోయినది. ఆమె నిలుచుండిన తావునుండి కదలలేదు; కొంతసేపటికి అతఁడు మరల కన్నులు తెఱచి "దాహము, దాహము" అని గొంతులో నస్పష్టముగ గొణికినాఁడు. మరల నామె నీటిబిందువుల నాతనినోట బోయు

టకు దిగువనుండి ప్యాలా నెత్తుకొని నిలిచినది. అడుగు పెట్టుటకు ముందె తగిలినది శూలఘాతవలె నొక పెనుపోటు. ప్రాణము ఖేచరమార్గమున కెగసిపోయినట్లు తోఁచినది. కన్నుల చీకట్లు గ్రమ్ముకొనినవి. దేహము స్వాధీనము దప్పునట్లు సంశయముఁ గలిగినది. ఆత్మబలము నంతటిని విని యోగపఱచి సడలిపోవు చుండిన శక్తిని బిగఁబట్టి యింద్రియవ్యాపారములను స్వాధీనముఁ జేసికొని యతనినోట తీర్థముఁ బోసి సత్వరముగఁ జెప్ప నొడఁగినది:

'మహాప్రభూ, తమకు మరణము సమీపించుచున్నది. శీఘ్రము తమరు దేవునిసింహాసనము ముందునిలిచి తమచర్యల కన్నిఁటికి లెక్క చెప్పవలసియున్నది. తమ దుర్మరణమును కన్నులారఁజూచి సంతసింపవలయు ననుకొంటిని; కాని దేవుని యుద్దేశము వేఱువిధముగనున్నది. నా కిప్పుడె మారి సోఁకినది, తమకు ముందె దేవుని యాస్థానము ఁజేరి తమ కుచితరీతిని స్వాగతము చెప్పవలసి యున్నది; కాని నేనందులకు చింతింపను. నా కాత్మ సంతృప్తి కలిగినది. నా కార్యము నెఱవేరినది.'

'నీకార్యమా? ఏమి టాకార్యము?'

'ఏలినవారిని తుద ముట్టించుట.'

'నీకు నాపై నింత విరోధ మేలకలిగినది? నే నేమి చేసితిని?'

'ఏమి చేసితినని యడుగుటకు నో రెట్లు వచ్చినది! పాపాత్ముఁడా! జ్ఞప్తికిఁదెచ్చుకో, నా తలిదండ్రులను వృద్ధులను నా యెదుట తలలు నఱికించితివే. ప్రాణసమానుఁడగు నాభర్తను

గా అత వేయించితి వే? నాకు మానభంగ మొనరించితి వే? మర చితివా? నీవు మరచినను నేను మరువలేదు. శీలభంగమునకు దుఃఖించి మొదట నాత్మహత్య నొనర్చుకొని ప్రాణమును విస ర్జింపఁ దలపెట్టితిని; కాని యోచింపఁగా లోకమున కేదేని మేలు జేసి యావల ప్రాణము వదలుట యుక్తమని తోఁచినది. నాశీల మెట్లును చెడనే చెడినది. నా ప్రాణత్యాగమువలన నది పరి శుద్ధముఁ గాజాలదు. కావున నీవంటి రాక్షసుని నిర్మూలముఁ గావించి సర్వ హిందూమహిళా ప్రపంచమునకు మానభంగ భయము నాపవలయు నని నిశ్చయించితిని. అదిమొదలు నీ యందు కైతవ ప్రేమఁ జూపుచు నీతోడ నీడవలె చరించితిని; నాకార్యము నెఱవేరినది. ఇఁక స్త్రీలకు నీవలన మానహాని కలుగదు.'

"నీవేమిచేసితివి, నీకార్యము నెఱవేరుటకు? విధిమూల మున నే నిట్లయితిని."

"ఆవిధిని నేనే, తమ ఇప్పటి దుస్థితికి కారణము సాధు విచ్చిన మాత్రలు. ఆ సాధువు నా పినతండ్రి; నా ప్రార్థన మీఁదనే ఆయన తమ్ము తుదముట్టించుట కీమాత్రలు తయారు జేసినాడు. ఇఁక——"

సుల్తానా మె కడపటిమాటలను వినలేదు. కడుపులో నతనికి చెప్పరాని బాధ కలిగినది. వేయికత్తులు గ్రుచ్చినట్లును, పేగులను ఖండతుండెములుగ దఱిగినట్లును, నగ్నిజ్వాలలు ప్రజ్వ రిల్లి యుదరమునుండి వ్యాపించి దేహము నాద్యంతము దహిం

చుచుండినట్లును దోఁచినది. కడుపును రెండుచేతులను బిగఁబట్టి మూల్గుచు పెద్ద పెట్టున నలువగడగినాఁడు. తుదకు పేగులన్నియు లేచి పైకి వచ్చినట్లయినది. వమనమైనది. నెత్తురు, నెత్తురు, నెత్తురు! ఎచటఁజూచినను కన్నులు చెదఱున ట్లెట్టని రక్తము రక్తనాళము లన్నియు జారిసి ప్రవహించునట్లు కానవచ్చినది. వమనమైన పిమ్మట నతనిబాధ కొంత తగ్గిపోయినది. గల్లు గల్లు మను శబ్దము చెవిసోఁకినది. కన్నులను దెఱచి చూచినాఁడు. ఎదుట ప్రత్యక్షమైనాడు ఆ మాయలఫకీరు; ఎట్టని సోగమొగమున కణకణ మండు నగ్నిశకలములవలె మంటల నుమియుచుండినవి అతని కన్నులు. ఆకుపచ్చ పాగా చెంగులు గాలిలో నల్లలనాడుచుండినవి. చేతియందలి యినుప యుంగరముల గుదియ నాడించుచు, 'అల్లహా కేనాంకర్, అల్లహా కేనాంకర్, అల్లహా రసూల్ కేనాంకర్' అని పాడుచు నృత్యముసేయుచు క్షణక్షణమున సమీపించుచుండినాఁడు. అతనిఁ జూడఁగనే సుల్తాను గుండె నీరయినది. తప్పించుకొని పాఱిపోవుదమని నిశ్చయించుకొన్నాఁడు. ఎచ్చటికి పోగలఁడు? శరీరమున బందీకృతమై యున్నాఁడు; శరీర మతని ధిక్కరించి యున్నతావునుండి మెదల లేదు. అతఁడు పాఱిపోవ మార్గము నింకను వెదకుచుండఁగనే ఫకీరు వచ్చినాఁడు సమీపమునకు. చెంగున నెగిరి ఱొమ్ము మీఁద నిలిచినాఁడు. 'అయే, మలఊన్; అయే మలఊన్' అనుచు దానికిఁ దాళము వేయున ట్లడుగులిడుచు చేతిలోని గుదియనెత్తి సుల్తాను నెత్తిపై మోదుట కుంకించినాఁడు.

'అయ్యో! అయ్యో! ఫకీర్ ఫకీ' రని మహా భయంకరమైన కేక వేసినాఁడు సుల్తాను. నేల కుసలఁగూలి మరణావస్థయం దుండిన యాఁమె కాఁ కేక వినవచ్చినది. ఒకసారి తలయెత్తి చూఁచినది మంచమువంక. సుల్తాను కదలక మెదలక పడియుండెను. పిన్న నగ వాఁమె మోఁమునం దంకురించినది. నారాయణ నారాయణ యని గొణుగుచు తల నేలపై మోఁపినది.

---

# ఛత్రగ్రాహి

## ౧

దినమంతయు శ్రమపడుటచే ప్రాణము బేజారయిపోయినది ప్రోలయకు. రాయలదేవునికి పరిచర్యసేయుచు నుదయాస్తమయము తిరుగవలసివచ్చెను. పూర్వాహ్ణమున కొలువుకూటమున రాయలపరివారజనముతోపాటు శ్వేతచ్ఛత్రమును బట్టుకొని వజ్రసింహాసనము వెనుక నిలిచియుండెను; రాయదేవుఁడు దినసరి రాజకార్యములను నెఱవేర్చుకొని, బహామనీ సుల్తాను నోడించుటకు తోడ్పడిన నాయకులకును పాళెగాండ్లకును నొంటర్లకును వారివారి పరాక్రమమునకుఁ దగినట్లు బహుమాన సత్కారముల నొనర్చి కొలువు చాలించువఱకును విడుమర లేకపోయినది. సత్కారవిషయమునుఁ గూర్చి చింతింపఁగా యేవిధమైన గౌరవమును పొందనివాఁడు తా నొక్కఁడే. సరివారిలో దన కెంత చిన్నదనమైనది. రణక్షేత్రమున పరాక్రమ ప్రదర్శనమున దా నెవ్వరికిని తీసిపోలేదు. రాయదేవుని కొలువున తనకంటె నతిశయముగ నాత్మసమర్పణ మెవ్వరునుఁ గావించియుండలేదు. కాని తనకు సత్కారముఁ గలుగకపోవుట, స్వయంకృతాపరాధమునకు ఫలితము. తన సేవకు మెచ్చి స్వామివారు తన కేమికావలయునని సెలవియ్యఁగా నే ప్రభువును ప్రసాదింపరాని కోరికను గోరుట తన తెలివిమాలినతనము గాని, యేలినవారి తప్పేమికలదు? కాని ఏలినవారు తన కేదేని

యొక బిరుదు నిచ్చియుండకూడదా ? పోనీ, ఎంతటి యల్పమై నదియైనను నొక గండపెండేరమునో, పీరశృంఖలమునో ప్రసాదించియుండరాదా? అవును, రాజుల చిత్తవృత్తియట్టిది. ఆశ్రితుల హృదయములను తృప్తిపఱుపగల శక్తి దానికి లేదు. ఈ యవమానమువలనఁ గలిగినవ్యథకు దోడు పుంకుమీఁదియుప్పువలె రాయసత్కారమునకుఁ బాత్రులైన తోడిపరివారజనులఁ గూడి సాయాహ్నమంతయు మరల నగరిచాకిరి సేయవలసివచ్చెను పట్టణమునందలి దేవాలయముల కన్నిఁటికిని, తురకలపై విజయము గలిగించినందులకై తదధిష్ఠ దేవతలకుఁ దన కృతజ్ఞతనుఁ జూపుటకు రాయదేవుఁడు బయలుదేరగా నాయనను వెన్నంటి గొడుగునుఁ బట్టుచు దానును పోవలసివచ్చెను. హృదయవిదారకమైన యవమానమునకుఁ గ్రుంగిపోక తా నెట్లోర్చుకొని తన సేవాధర్మమును నెఱవేర్పఁగలిగెనో యతనికే తెలియదు; కాని యాబాధ యెట్లో నివర్తియైపోయినది. ముత్యాలజల్లుల గొడుగును కోణే వాకిటికడ నంతఃపుర ఛత్రగ్రాహిణి కొప్పఁజెప్పెను. ఇష్టమువచ్చినంతసేపు తన గొడవయందు పడియుండవచ్చును. మరుసటి యుదయమువఱకును దన్నడుగువా రుండరు.

బయలుదేరినాఁడు తలారిగట్టుప్రాంతముననుండు దన యింటికి. నిజసత్కారార్హతను రాయలవారి యౌదాసీన్యమునుఁ దలపోసికొనుచు పయనము సాగించుటచే బహిఃప్రపంచమున నేమి నడచుచుండునదియు నతని మనసు కెక్కలేదు. మామూలు ప్రకారము దన యింటికి మిక్కిలియు సమీపమైన

యడ్డదారినిఁ ద్రొక్కెను. శీఘ్రముగ బోవలయునని యనుకొనిన నతఁడు హజార రామస్వామి గుడినుండి బయలుదేరి పాన్సుపారి సూళై బజారులగుండ నడచి యటుపిమ్మట నచట నచట కూర గాయల తోటలుగల విజనప్రదేశమునుఁ దాటి, విఠ్ఠలస్వామి యాలయ ప్రాంగణమునుండి పూర్వాభిముఖముగఁ బోయి యానెగొంది రేవున కించుక దక్షిణమున తలారిగట్టును గలియు సంత వీధినిఁజొచ్చి పోవలసియుండెను. సూళై బజారున కతఁడు వచ్చునప్పటికి సందెప్రొద్దు గడచినది. ఇరులు గ్రమ్మినవి. అచట నచట ధనసంపన్నురాండ్రైన వేశ్యకాంతల ముంగిళ్లయందును, దమ ప్రియురాండ్ర కౌఁగిళ్ల కాశించి బిరబిర నడతెంచు దండ నాయక ప్రధాన సామంతాదులతో వచ్చు పంజు వెలుఁగులు బడు తావులయందును దప్ప వీధి యంతయు నంధకారమున బ్రుంగియుండెను. సూళై బజారుదాటి విజనప్రదేశమును జొచ్చు వఱకును నతనికి మార్గమున నేయాటంకమును దగులలేదు. విఠ్ఠలస్వామియాలయమునకు ఇంకను చాలదూరము లేదు. సందె కొలువు వాద్యముల మ్రోఁత స్పష్టముగ వినవచ్చు చుండినది. ఇఁక రెండుమూఁడు నిముసములలో విజనప్రదేశమును దాఁటి దేవాలయప్రాంగణమును జేరవచ్చును. దారిప్రక్కనుండు నొక కూరగాయలతోఁటను దాఁటి పదిబారలు నడచినాఁడో లేదో వెనుక నడుగుల చప్పుడైనట్లు తోఁచినది. తన వెనుక చీఁకటి యందు వచ్చువా రెవ్వరో కనుఁగొనుటకు వెనుదిరుగ నుద్దే శించెను; కాని వెనుకనుండి యెవ్వరో చుట్టును పాశము వేసినట్లు

అతనికంఠమును సందిట బిగియఁబట్టి, నోట గుడ్డను గ్రుక్కి, కండ్లపై గంతను బిగించి, కాలుసేతులు గట్టివైచిరి; తరువాత తల నొకఁడును నడుము నొకఁడును గాళ్ళ నొక్కఁడునుఁ బట్టి మోసికొనిపోయి యొక వాహనముపైఁ గూలవేసిరి. దాని చలనమునుఁ బట్టిచూడఁగా నది మనుష్యులు భుజములపై మోసికొనిపోయెడు పల్లకివంటి వాహన మను తలంపుకలిగినది.

దాదాపు రెండుగడియలకాలము ప్రోలయ యందుండెను. అదియే యతని కొక యుక్తిమతోఁచినది. కడపట నా వాహన మాగెను. వెంటనే ఎవరో ప్రోలయ నందుండి బయటికీడ్చి పక్కవైచి యతని బంధనములను దొలఁగించిరి; బంధవిముక్తము లైన చేతులతో నతఁడు నోట గ్రుక్కియుండిన గుడ్డలను లాగివేసి కంటిగంత నూడదీసి పాఱవైచెను; కాని యందువలన నతని కేమియు లాభముఁ గలుగదాయె. గాఢాంధకారము; కన్నులముం దుంచుకొనినను అఱచేతులు సైతము గనిపించవాయె. తడవి చూచినాఁడు. మెత్తలు కుట్టిన మంచముమీఁదనో లేక యట్టి వేఱొక శయ్యయందో పడియుండినట్లు స్పర్శ వల్లఁ దెలియవచ్చినది. సగము కూర్చుండిమాటలాడ ప్రయత్నపడినాఁడు. వెంటనే ముఖముపై నడిచినట్లు వచ్చినది భీకరస్వరమున దక్కనీలో జవాబు. 'ఉసురుపై నాశయుండిన వాగకుము. రేపటి యుదయమువఱకును నీ విచటనే పడియుండవలయును. తరువాతి స్థితి నీకె యెఱుక కాఁగలదు' అని. అటుపై నోరుదెఱచుటకు ధైర్యము లేకపోయినది. ప్రోలయకు.

కొంతకాలము తానెచ్చట నుండు నదియు నూహించి కనుఁగొనవలయునని ప్రోలయ వ్యర్థముగ జింతించుచుఁ గూర్చుండియుండెను. ఎంత యోచించిచూచినను సాధ్యపడలేదు. అంతట నచటినుండి తప్పించుకొనిపోవుట యుక్తమని యెంచెను. మంచముపైనుండి లేచి చీఁకటిలో దడవుకొనుచు రెండుమూఁడడుగులు ముందునకుసాగెను అంతట నతని యడుగు త్రాఁటినలెనిడుపై రోమమయమైన మెత్తనివస్తువు పైఁబడినది; వెంటనే గుబ్బుమను భీకరశబ్దము చెవిసోఁకగా భయముచే దద్దరిలి వెనుకంజవేసినాఁడు. మంచము అడ్డు దగులఁగా దానిపైఁ గూలఁబడినాఁడు. తప్పించుకొను ప్రయత్నమును మానుకొని తనస్థితినిఁ గూర్చి చింతించుచు పండుకొనినాఁడు. తన్నుఁబట్టి బంధించినవా రెవ్వరో? ఎవ్వరైననేమి, శత్రులగుదురుగాని మిత్రులు గాజాలరు; ఏకారణముచే వారు తన్ను చెఱపట్టినను వారివలనఁ దనకు కీడుగలుగుననుట నిశ్చయము. వారిలో గనీసమొక్కఁడైనను మహమ్మదీయుఁడై యుండవలయును. ఏలనఁగా, సందిట తనకంఠము నిఱికించుకొనినవానికి గడ్డముండినది; మహమ్మదీయులు గానివారికిఁ గూడ గడ్డముండవచ్చును; కాని తాను మాటలాడ బ్రయత్నముసేయఁగా దన్ను నోరెత్తవలదని యాజ్ఞాపించినవాఁడు తెనుగుననో కన్నడముననో భాషింపక దక్కనీ నవలంబించుటనుఁ జూడ కర్ణాటకసామ్రాజ్యమున వాడుకయందుండు భాషల నెఱుఁగని మహమ్మదీయుఁడను నూహకెడమిచ్చుచున్నది. తానూహించినట్లు తన శత్రువులు మహమ్మ

దీయులగుట నిశ్చయమగుపక్షమున, వారెవ్వరై యుందురో? రాయలవారి కొలువున నెందఱో మహమ్మదీయులు గలరు; వారందఱును దనకెఱిఁగినవారే; కాని వారెవ్వరికిని దనమీఁద క్రోధము గలదని యెంచుట కవకాశము లేదు. ఇటీవల బహమనీ సుల్తానుమీఁది దండయాత్రయం దొక ఘోరసంగ్రామమున, ప్రఖ్యాతుఁడగు నాస్థా నమీరొకఁడు దనచే మడిసినదిమాత్రము వాస్తవమే. కాని యతనివారికి విజయనగరమునకు రా నెట్లు సాధ్యపడినది? వచ్చిరిపో, స్వయము రాయలవారి యనుచరులలో నొక్కని చెఱబట్టుట కెట్లు వలనుపడినది? ఇట్టిదుండగము రాయరాజధాని నడివీధులలో జరుగుచుండఁగా, పట్టణ 'ప్రధాన తలారి' జంగమయ్య చక్రవర్తి శత్రువుల నడవడినిఁ గనిపట్టఁజాలక యేమిచేయుచున్నాఁడో? బహమనీసుల్తానుతోడి యుద్ధమును స్మరింపఁగనే ఆయుద్ధముననే శత్రువులను బొడిచి సూర్యమండలమును భేదించుకొని యా మార్గమున వీరస్వర్గమునకెక్కిన యతని యేకపుత్రుఁడు జ్ఞప్తికివచ్చెను. తన కిఁక పుత్రసంతతి లేదు; తన్ను జిక్కించుకొనిన శత్రువులు తన్ను వధింపక విడువరు; అంతట తన వంశ మంతరించిపోవును. తన భార్యలందఱు సహగమనముచేసి మహాసతు లగుదురు. తన కుటుంబము సర్వనాశమై పోఁగలదు. భార్యలను దలంచుకొన్నప్పుడు ముఖ్యముగ కడగొట్టుభార్య యతనికి గన్నులముందు పొడఁగట్టినట్లయినది. దానియెడ నతనికి మమత యెక్కుడు. చిన్నది; రూపమున మోహినియే. రాయల యంతఃపురమునఁ గూడ దానికుద్ది

సేయఁగల అందకత్తియ కానరాదు. మరులుగొలుపుటయందు దాని కీడైన యాఁడుదిలేదు. పూవువలె మృదులమైనది దాని శరీరము. ఆ చిన్నది, ఆ మోహనాంగి, ఆ నవకుసుమకోమల శరీర, చితియెక్కి భుగభుగమండు నగ్నిజ్వాలలోమాడి మసియై పోవలసినదేనా? ఆక్రూరవిధినితప్పించుటకు మార్గములేదా? అని యుస్సురని కన్నుల నీరు వెట్టుకొనుచు మహాహృదయ వేదనతో పడుకపై బొరలుచుండెను. బాధపడి బాధపడి తుదకు చిరకాలము మనశ్శరీరములు శోషిలుటవలన నెప్పుడో యతని కన్నులు మూతలుఁ బడిపోయినవి. ఆత్మ సొమ్మసిల్లినది.

౨

మెలఁకువ వచ్చినది; కాని నిద్రమత్తు సంపూర్ణముగ తొలఁగిపోలేదు. చలి. దేహముపైనుండి జారిపోయిన శాలువను చేతులతో దడవి మీఁదికీడ్చి కప్పుకొని నిద్రించుటకు బ్రయత్నమొనర్చినాఁడు ప్రోలయ. మ్రోగన్ను వడినది. ఊబిలో బ్రుంగు ఘనపదార్థమువలె సత్వరముగ గ్రుంక నారంభించినది అతని చైతన్యము అజ్ఞాత హృదయాంధకార సీమలోనికి. పంచమహాశబ్దము లెచటనో మ్రోగుచున్నట్లు తోఁచినది. ఏదో దేవాలయములోనని తనమనస్సునకు సమాధానము చెప్పుకొనినాఁడు. ఇంతలో వినవచ్చినది,—

'మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, అరిరాయవిభాళ, భాషగెతప్పువరాయరగండ, మూరురాయరగండ, అష్టదిగ్రాయ మనోభయంకర, హిందూరాయసురత్రాణ, యవనరాజ్య

స్థాపనాచార్య, సాహితీసమరాంగణసార్వభౌమ, జయ, విజయీభవ, దిగ్విజయీభవ.''

అను వందిజనుల కైవారము వెంటనే చెవి సోఁకినది,—

'నాఁడు నేఁడును యాదవాన్వయమునందు
జననమందెను వసుదేవమనుజవిభుని
కృష్ణుఁడనుపేర నరసేంద్రుకృష్ణదేవ
రాయఁ డనుపేర నాదినారాయణుండు'

అను మాగధుల స్తోత్రపాఠము. 'ఇంకను చక్కఁగ నిదురపట్టనే లేదు; అప్పుడే ప్రారంభమైనది కల' యని యబ్బురపడినాఁడు ప్రోలయ. ఎవరో అధ్యాత్మసంకీర్తనలు పాడుచుండుట వినవచ్చినది; అంతట నతనిచైతన్యము సంపూర్ణముగ నిద్రలో మునిఁగినది కాని చాలకాలము నిద్రపోలేదు. 'దేవ, అవధారు! తెల్లవారవచ్చినది. ఏలినవారు కాల్యకృత్యములను నెఱవేర్చుట కిది యవసరము' అనువాక్కు స్పష్టముగ వినవచ్చినది సమీపమున. ఉలికిపడి లేచికూర్చున్నాఁడు. చుట్టును వినవచ్చినవి పారావత కీరశారికాదుల కూఁతలు. అతనికి సందేహముఁ గలిగినది మాంజిష్ఠ తెరను తొలఁగఁద్రోసి చూచినాఁడు. ఎదుట నిలువఁబెట్టియుండిన బంగారుచట్టపు వెనీసు నిలువుటద్దమున గానవచ్చినది సకిసలమంచముపైఁ గూర్చుండి యుండు నతనిప్రతిబింబము. తికమకపాటు కలిగినది. అంతదనుక నతఁడు తన యింటనె నిద్రించుచుంటినని యెంచినాఁడు. తనయింట సకిసల మంచము

గాని, మాంజిష్ఠపు పట్టుతెరగాని, బంగరుచట్టపు వెనీసు నిలువు
టద్దముగాని లేవు; పరిశీలించిచూచు నుద్దేశముతో మంచము
దిగుటకొఱకు కాళ్ళను క్రిందికి జాఱవిడిచినాఁడు; గట్టిగ పల
కలవలె నేవో పాదముకు సోఁకినవి. వంగిచూచినాఁడు; కానవచ్చి
నవి క్రింద వరాహముద్రాంకితములైన బంగారుపావలు. వానిని
చూడఁగనే అతనికి ఆశ్చర్యమును భయమునుఁ గలిగినవి. అవి
తన పాదరక్షలుగావు, మఱి యెవ్వరివియుఁగావు, రాయ
సామ్రాజ్యమున నా పావలను మెట్ట నర్హుఁడు రాయదేవేంద్రుఁ
డొక్కఁడే. రాయలదేవుని పాదరక్షలు తన పడకటింటి కెట్లు
వచ్చినవి? అని చింతించుచు వానికి పాదములఁ దాఁకనీయక
ఓరగ మంచముఁ దిగి నలువైపుల బరిశీలించి చూచినాఁడు.
ఏమిచిత్రము? ఆ పడకటిల్లెచ్చటిది? అట్టి చక్కని మందిరమున
దనవంటి యల్పుఁడు నిద్రించుభాగ్య మెట్లుగలిగినది? స్నిగ్ధముగ
మెఱుఁగువెట్టి వెండి రేకులవలె తెల్లనైన గోడలును, వానిమధ్య
నచటనచట చిత్రింపఁబడియుండు రతిమన్మథ రంభానలకూబర
దాశకన్యాపరాశర ఊర్వశీ పురూరవాది యపరూప శృంగార
చిత్రపటములును, వాతావరణ మంతటను గుబులుకొను
నగరుచందనాది సుగంధ ద్రవ్యముల వాసనలను, దనవంటి
సామాన్యుల గృహములనుండునవి కావు. చూడఁగా రాయల
దేవుని యంతఃపురములోని పడుకటింటివలె గానవచ్చినది. తా
నచటి కెట్లురాగలిగెను? చక్రవర్తిపడుకపై నిద్రించుట యెట్లు
సంభవించినది? పూర్వదినము నడచిన వర్తమానమును స్మర

ణకు వచ్చినది. తన్ను బంధించి తెచ్చినవా రెవ్వరు? ఈపడక టిల్లెచ్చటిది? వా రే తన్నిచ్చటికి తెచ్చిరా? వారి వేషభాషలు మహమ్మదీయులను గదా పోలియుండినవి? అగునేని రాయ దేవుని యంతఃపురముతో వారి కేసంబంధము గలదు? అని యిట్లు తనలోదాను తర్కించుకొనుచుండగా, హేమ వేత్ర ధారిణి యొక యువతివచ్చి యెదుటనిలిచి పలికినది, 'దేవ, అవధారు! కన్యకా కపిలకామధేనుస్పర్శన విప్రదర్శనములకు అవసరము' అని. అప్పటికే కలఁతపడియుండిన మన స్వామాట లు వినఁగనే మఱియు జిక్కులపాలైనది. తన సందేహముల నెట్లయిన నివర్తి చేసికొనవలయునని నిశ్చయము చేసికొని యడిగినాఁడు,—

'నే నెవ్వఁడను' ? అని.

ఆమాట చెవిసోఁకఁగనే నిర్భ్రాంతపడినట్లు పలుకక నిలిచి నది వేత్రధారిణి అది తన ప్రశ్న నర్థము చేసికొనలేదని తలఁచి అడిగినాఁడు మరల 'నేనెవ్వఁడను' అని. అవసరిక ధైర్యము తెచ్చుకొని కరములు మొగిడ్చి చెప్పినది.

'చిత్తేను, దేవా! ఏలినవా రీయధమదాసి నేలనో హేళనసేయ దలపెట్టినారు. స్వామివారు తమ్మెఱుఁగరా? మనవి చేసికొనియెదను, చిత్తగింప కర్తలు. వినుఁడు. ఏలినవారు శ్రీ మహారాజాధిరాజపరమేశ్వర, యరిరాయవిభాళ, భాషగె తప్పువరాయరగండ అష్టదిగ్రాయభయంకర, మూరురా యరగండ, యవనరాజ్యస్థాపనాచార్య, సాహితీసమరాంగణ

సార్వభౌమ, విద్యానగర సామ్రాజ్యాధీశ్వర శ్రీ వీర ప్రతాప శ్రీకృష్ణదేవమహారాయలవారు.'

'నేను కృష్ణదేవమహారాయలనా?'

'సందేహమేల మహాప్రభూ?'

'మఱి నేనిచ్చట నున్నాఁడను.'

'అంతఃపురమున వైజయంతీ సదనమున.'

'ఇచ్చటికి నేనెట్లు వచ్చితిని?'

'ఎప్పటివలెనే.'

'అట్లనిన?'

'సందెకొలువు చాలించిన తరువాత అప్పాజీ వారితో ముచ్చటలాడుచు విజయము చేసితిరి.'

ప్రోలయకు సందేహములు తీఱుటకుమాఱు వృద్ధియైనవి. తానఁట! కృష్ణదేవ మహారాయలఁట! ఏమి చిత్రము. యోచించి చూడఁగా నది యేదో నాటకమువలె దోఁచుచున్నది. కాని యీనాటకమునాడించు సూత్రధారుఁ డెవ్వఁడు? ఎవ్వఁడైన నేమి? తా నతనిచేతి జంత్రపుబొమ్మ యైనాఁడు. అతఁ డెట్లాడించిన నట్లాడవలసియున్నది. ఎట్లు పర్యవసానము గాబోవుచున్నదో? ఎప్పటికేది ప్రస్తుతమో అప్పుడు దాని ననుసరించుట శ్రేయస్కరమని పెద్దలు చెప్పుదురు. కావున నవసరిక చెప్పినట్లు తానే రాయలని తలఁచి ప్రవర్తించుట యుక్తమని నిశ్చయించి రాయపావలుమెట్టి బయలువెడలెను.

రాచనగరునందలి కార్యకలాపమునుఁ గూర్చి ప్రోలయ వినియున్నను కనియెఱుఁగఁడు. కావున ఉదయమున నచట జరుగు ప్రతివిషయమును చిత్రముగనే కానవచ్చినది. అది యనుదినమును దనకు పరిచితమైన వాస్తవప్రపంచము గాదు; మాయాలోకమువలె నుండినది. సర్వము స్త్రీమయము; తాను దప్ప మగపురుఁగెచ్చటను గానరాలేదు; మఱియు నచటి కార్యక్రమమునకుఁ గూడ వాస్తవప్రపంచమున తావులేదు. తన యునికి నిమిత్తమాత్రమే. ఒకపనియు దనవలన జరుగలేదు. సర్వమును నచటి పరిజనుల మూలమున నడచుచుండినది. దంతధావన ముఖమజ్జనములు ముగిసినవి. నామతీర్థ కార్యమారంభమాయెను. నామతీర్థ మంటపమున కతఁడు జేరునప్పటికి బ్రాహ్మణు లనేకు లచట గూడియుండిరి. అతఁడు ప్రవేశింపఁగనే వారు లేచి యాశీర్వదించిరి వారికి నమస్కరించి యటు పిమ్మట నేమి సేయవలసినదియుఁ దెలియకపోవుటచే నచట సందేహపడుచు నొకక్షణమాగెను. ఇంతటనె పిలపిల బ్రవేశించి నారు ఓదువ పద్మాక్షమ్మ మొదలగు నూడిగపు యువతులు పెక్కండ్రు. ఒకతెవచ్చి యతనికై దండయిచ్చి కొనిపోయి మంటపమధ్యమున వేసియుండిన బంగారుపీటపైఁ గూర్చుండఁ బెట్టినది. పెద్ద నిలువుటద్దమునుఁ బట్టుకొని మఱియొకతె యతని యెదుట నిలిచినది. పచ్చకర్పూరమును గస్తూరిని సమభాగములుగ వామహస్తతలమునఁ జిన్నకుప్పగబోసి పన్నీటిబిందువులను జిలికి రంగరించి పుడుకవంటి బంగరుకడ్డీతో నతనిముఖమున

గీఱునామము దిద్దినది ఇంకొకతె. స్నామతీర్థ మగుచుండఁగా
నోదువపద్మాక్షమ్మ గాయత్రీరామాయణమునుఁ జదువుచుండి
నది; ముగియఁగనే పుస్తకమును కట్టినది. ఊడిగపుసతులు బ్రాహ్మ
ణులకు దక్షిణతాంబూలములనిచ్చి పంపివేసిరి. బ్రాహ్మణులు వెలి
హజారమును దాఁటగనే హెగ్గడికత్తె లిద్ద ఱతని కిరుపార్శ్వ
ముల నిలిచి చేతులఁబట్టి లేవనెత్తి, బోయతలు తెచ్చిన మోత
కుర్చీయందుఁ గూర్చుండఁబెట్టి మోసికొనిపోయి యలంకార
మందిరమధ్యమున వెండిగొలుసులనుండి వ్రేలుచుండిన దంతపు
తూగుటుయ్యాలలోని మెత్తని కుంకుమపువ్వు పఱుపుమీఁద పట్టు
తలగడబిళ్ళలనడుమ నాసీనునిఁ గావించిరి. కైసేత ప్రారంభ
మైనది; పరిచారికాజన మతనినిచుట్టుకొని వారివారి నిర్ణీతకార్య
ముల నెఱవేర్పఁగడఁగిరి. మొదట సిగకు నీలిపట్టుదారమున
గూర్చియుండిన సిగతాయెతులుఁ గట్టిరి; వానిమీఁద పూల
దండలనుఁ జుట్టి యవి కొంచెము వెలుపలికిఁ దెలియవచ్చునట్లు
బంగారు సరిగపూవుల పట్టురుమాలును చెంగులు జాఱవిడిచి
పాగజుట్టిరి; క్రొత్తముత్యముల మేలు కుట్టుతోఁడి బంగారు
బుటాదారి చీనా పట్టుదట్టిని మొలకుఁ గట్టి దంతపు పిడి వంకర
చంద్రహాసమును జెక్కిరి. కైసేత సంపూర్తియైనది. ఒక
పరిచారిక నిలువుటద్దమునుఁ దెచ్చి యెదుట నిలిపినది. తన్ను
తాను గుర్తింపఁజాలక పోయినాఁడు ప్రోలయ. అద్దమున గాన
వచ్చినది గొడుగు ప్రోలయ ప్రతిబింబముగాదు; ప్రోలమహా
రాజులవారిది.

పట్టరాని నవ్వునచ్చినది ప్రోలయకు. పక్కన నవ్వి నాఁడు. ప్రతిబింబముఁగూడ నవ్వినది. తనకన్నులకు గానవచ్చు వస్తువులును దా నప్పుడు పొందుచుండు ననుభవములును సుషుప్తియందుఁ గలిగిన భ్రాంతి విశేషములే కాని యన్యము గాదని నిశ్చయించుకొనెను. మానవుని యనుభవములందు కల బహుచిత్రమైనది. తాత్కాలికముగనైనను దానికి అసత్యమును సత్యముగ బ్రదర్శించి నమ్మింపఁగల శక్తికలదు. ఎన్నిపర్యాయములు తాను కలగని యుండలేదు. ఇట్టి మహాద్భుతమైన కలను దానంతకు ముం దెప్పుడైన గనియుండెనా? మఱి యెవ్వరైన గనియుండిరా? ఆ స్వప్న కృష్ణరాయ మహా నాటక మెట్లుముగియఁగలదో! అని యతఁడు చింతావికలిత మనస్కుఁడై యుండఁగా వేత్రహస్త హెగ్గడికత్తెయొక్కతె కీవితో నలంకారమందిరమును బ్రవేశించి, 'మహారాజాధిరాజ, రాజ పరమేశ్వరా! పరాకు. కొలువున కిది యవసరము. ఏలిన వారి దర్శనార్థము మహాప్రధాన మాండలిక సామంత దండ నాయ కామరనాయకాది సర్వజనులు వచ్చి హజారమునఁ గాచియున్నారు' అని యుద్ఘోషించినది. మఱియొక యూడిగపు స్త్రీ 'రాయపాదుక'లను దెచ్చి పాదములకడ నిలిపినది. ఈ సన్నాహములఁ జూచి ప్రోలయ లేచి పావలు దొడిగికొనెను; ఒక్కత కైదండయొసఁగెను; అడపకత్తె తెల్లని పండుటాకులను చీల్చి మడిచి యందీయనారంభించెను; వెనుక నిరువురు యువతు లు వింజామరలుగొని నిలిచిరి; ఇరుపార్శ్వములందు మఱి

యిద్దఱుస్త్రీలు నిలిచి తెలిపావడలు వీవసాగిరి. గిండి, కాళంజి, కత్తి, అద్దము మొదలైన రాజచిహ్నములను ధరించిన స్త్రీలు చుట్టును నిలిచిరి. బంగారు బెత్తమును చేబట్టి విచిత్రవేష ధారిణి యొకతె యెదుటనిలిచి 'చాఁగు, బళా' యని యరచినది. మఱియొకతె 'జతనా' యని పలికినది. అంతట ప్రోలయ యంతఃపురమునుండి బయలువెడలెను. అంతఃపుర పరివార మంతయు చుట్టుమూఁగి 'సాహో' యని హెచ్చరికలు సేయుచుండఁగా రెండువైపుల నిరువురు యౌవనవతుల మూపులపై భుజములనువేసి తిన్నఁగనడచి వాకిటి హజారమును జేరినాఁడు.

కొలువు ప్రారంభమాయెను. ప్రోలయ కొలువుకూటమును బ్రవేశింపగనే సామంత దండనాయక ప్రభృతులైన దొరలందరును చేతులు జోడించి శిరము పైకెత్తి దండమిడి, దూరముగ సభాభవనము గోడల కానుకొని చేతులు గట్టుకొని నిలిచిరి. ప్రోలయ వజ్రసింహాసనముపై నాసీనుఁడాయెను. సభయందు ప్రతిదినము నడచు కార్యక్రమ మతనికి చిరపరిచితమే. కాని నోటినుండి యతనికి మాటరాలేదు. ప్రక్కనాసీనుఁడై యుండిన యప్పాజీతిమ్మరసయ్యగారి ముఖమువైపు జూచి గుటకలుమ్రింగ నారంభించినాఁడు. తిమ్మరసయ్య యతని యవస్థను గ్రహించినాఁడు. రాయలవారి వైపు తిరిగి వారి యాదేశము నాలకించుచున్న ట్లభినయించి, పిమ్మట సభవైపు తిరిగి, అడిగినాఁడు.

'అష్టస్వయం వ్యక్త్య శ్రీరంగం శ్రీముష్ణం వెంకటా చలం సాలగ్రామం తోతాద్రి నైమిశారణ్యాం పుష్కరక్షేత్రం ఇది మొదలయిన స్థలాలకు సురక్షితములుగలవా?' అని. తాతాచార్యులవారు, 'దేవరవారి ప్రతాపాతిశయమువల్ల ఆయాస్థలాంతరములనున్న ముద్రకర్తలు ఒకటికొకటి కొదువ లేకుండ నడుపుచున్నారు. నూటయెనిమిది తిరుపతులున్ను నిత్యోత్సవముగా నడచుచున్నవి' అని పలికిరి. వెంటనే ఆరాధ్యులవారు, 'పృథివ్యాపస్తేజోవాయురాకాశాత్మకమైన యేకామ్రనాథ జంబునాథ అరుణాచలేశ్వర కాళహస్తీశ్వర చిదంబరేశ్వరాది డెబ్బదిరెండు దేవస్థలాలకున్ను పదునెనిమిది శక్తులకున్ను నిండుపడితరములు గలిగి నిత్యోత్సవము గలిగి యున్నవి' అని తెలిపిరి.

ప్రోలయకు అప్పటికి కొంతధైర్యము కలిగినది. తన సంకల్పమును నెఱవేర్చుకొనుటకు అంతకంటె సరియైన సమయము లభింపదు. కాని కలలో నడచుచుండు ఆ కపటనాటకమునందు తన సంకల్పములను నెఱవేర్చుకొనిన నేమి? లేక పోయిననేమి ? కాని కలలోనైనను దనకోరికె నీడేర్చుకొనిన అందుమూలమున గొంత తృప్తికలుగును. ఆటలయందు బాలికలు ఆకులతో భూషణములను జేసి ధరించి తృప్తినందలేదా, అని చింతించి తిమ్మరసయ్యగారితో దనకు దానముసేయ నిచ్చగలదని చెప్పెను. తిమ్మరసయ్య సభవైపు తిరిగి 'కర్ణాట సామ్రాజ్యానగల యగ్రహారములన్నియు నిరవధికముగ సాగుచున్నవా' యని విచారించినాఁడు.

ధర్మాసనం ధర్మయ్యనిలిచి, 'దేవరవారు ఆనతిచ్చిన ప్రకారం ద్రావిడరాజ్యములో గల అగ్రహారములకున్ను ఆంధ్రదేశం హాయిసనదేశం మొరసునాడు మేల్నాడు కర్ణాటకం ఘట్టంసీమ చేర చోళపాండ్య మగధమళయాళాదిగాగల అగ్రహారములకున్ను అవధి ఆటంకములు లేక నిత్యకర్మానుష్ఠానపరులై ఋగ్యజుస్సామాథర్వణపారీణులయి అతిథిసంతర్పణ జేసికొని నిర్విచారులై సుఖవసతిగా నున్నారు' అని విన్నపము జేసెను.

అంతట తిమ్మరసు, 'ఏలినవారు భూదానాది షోడశ మహాదానములు సేయ నవధరించుచున్నారు. బయలు మెఱసి విరూపాక్షస్వామివారి సన్నిధికి వేంచేయుచున్నారు' అని సెలవిచ్చిరి.

రాయలవారు సింహాసనమునుండి దిగి యంతఃపురమునకు తరలిరి. వేత్రహస్తుల 'సాహో' నినాదములు సభామంటపమున మారుమ్రోగ నారంభించినవి. కవులు విద్వాంసులు మొదలగు విద్వజ్జనులందఱును సత్వరముగ విరూపాక్షాలయమునకు బయలువెడలిరి. మంత్రి ప్రధాన సామంత దండనాయకాదులు రాయలవారి వదాన్యతను జూడ నుత్సుకులై వారివారి వాహనముల నెక్కి యొండొరులతో నాటి సభావిశేషములను ముచ్చటించుకొనుచు విరూపాక్షసన్నిధికి జేరిరి.

## 3

విరూపాక్షస్వామి యాలయ ప్రాంగణమంతయు బ్రాహ్మణజనముతో నిండిపోయినది. రాయలవారు షోడశ మహాదానములను చేయబోవుచున్నారనువార్త యూరంతయు బ్రాకినది. పట్టణమున నన్నిమూలల నుండియు బ్రోగయినారు స్మార్తశైవవైష్ణవమాధ్వమహాజనులు. పూర్వోత్తరగోపురములవాకిట వాకిటి తిమ్మయ్యయు, జెన్నప్పయు నెవ్వరిని చొరనీయక గాపుండిరి. సర్వశిరః ప్రధాని సాళువ తిమ్మరసయ్యగారి ముద్రతోడి చీటిని చూపనివారికి ప్రవేశము లేదు. దానమంటపమధ్యమున బంగారు గద్దియపై బూర్వముఖుఁడై ప్రోలయ యాసీనుఁడై యుండెను; వెనుక నిరువురు స్త్రీలు వీచోపు లిడుచుండిరి. రాజచిహ్నములను చేబట్టి యడఁప చిననాగినాయఁడు, కాళాంజి తిప్పయ, ఛత్రధారి ఎల్లప్ప, ఖడ్గధారి వంకర కుమార బసివినాయఁడు మొదలగు నగరియూడిగమువారు రాయల గద్దియ కిరువంకల నర్ధమండలాకృతిగ నిలిచియుండిరి. ప్రోలయ కుడివైపున నుత్తరముఖుఁడై వెండిపీటమీఁద రాయ పౌరోహితుఁడు రంగనాథశాస్త్రులవారు కూర్చుండియుండిరి. సంకల్పముతో దానములు ప్రారంభమైనవి. గో హిరణ్య రత్న విద్యా కన్యాది దానములు ముగిసినవి. అన్నిఁటికంటె ముఖ్యమైనది అగ్రహారదానము. ప్రతిగ్రహీతలను నిశ్చయింపవలసివచ్చినది. ప్రోలయ ఎవ్వరిని ఉద్దేశింపలేదని తలఁచినాఁడేమొ రంగనాథశాస్త్రులు;

మోక్షగుండం విశ్వంభరశాస్త్రులవారు వేదవేదాంగపారగుఁ డనియు షడ్దర్శన విచక్షణుఁడనియు కావ్యకళానిధియనియు దానపాత్రుఁడనియు నగ్రహారదానము నాశాస్త్రులవారికి ఇచ్చుట యుక్తమనియుఁ జెప్పినాఁడు. కాని ప్రోలయ పలుకలేదు. మఱి యిద్దఱు ముగ్గురు పండితులనుఁ బేర్కొన్నాఁడు రంగనాథశాస్త్రులు; కాని జవాబు లేదు, 'ఇఁక ఏలినవారి చిత్త' మని 'యూరకఁగూర్చున్నాఁడు. ప్రోలయదృష్టి, దానమంటపమునం దొకమూల నొదిగియుండిన బీద బ్రాహ్మణునిపై నాగినది. అతనిదృష్టి ననుసరించినది రంగనాథశాస్త్రుల చూపు. అ బ్రాహ్మణుఁ డెవ్వఁడో తాను యెఱుఁగఁడు. అతని యాకారమును జూడఁగా నతనియందు విశేష శక్తి సామర్థ్యము లుండి నట్లు కానరాలేదు. కాని రాయపదమునకు ప్రోలయవంటి శుద్ధమూఢుఁడు వచ్చిన నతని చిత్తానుసారము ప్రవర్తింపకుండిన దనకుఁ బ్రదుకు దెరువు లేదు. కావున ఆయన నుద్దేశించి 'ఏమండోయి ఇక్కడ దయచేయండి' అని పిలిచినాఁడు. రంగనాథశాస్త్రులవంటి గొప్పవాఁడు తన్నేల బిలుచునని సందేహించి మెదలక తన స్థానముననె కూర్చుండియే యుండినాఁ డా బ్రాహ్మణుఁడు. మరల 'ఏమండోయి' యని యారంభించి నాఁడు శాస్త్రులు. 'తిమ్మాభట్టుగారు' అని యతనిపే రందిచ్చి నాఁడు ప్రోలయ. 'తమరి నేనండోయి తిమ్మాభట్టుగారూ, దయచేయండి. ఏలినవారు వేచియున్నారు' అని మరల పిలిచినాఁడు శాస్త్రులు. తిమ్మాభట్టు తన యదృష్టము పండిన దనుకొనుచు

లేచినాఁడు. దాన మండపములోని విద్వన్మహాజనుల కాశ్చర్య మును నసూయయు గలిగినవి. ఎవ్వఁ డాతఁడు? ఏమి చదివి నాఁడు? ఏ విద్వత్సభలయందు దన పాండిత్యమునుఁ బ్రక టించినాఁడు? మూఢుని రాజును జేసిన తనవంటి ప్రతిభాశా లిని గాక మఱి యెవ్వరిని సత్కరింపఁగలఁడు? 'కనకపు సింహా సనమున' అని తెలియక చెప్పినాఁడా! అని బ్రాహ్మణసంఘము గుబ్బటిలిపోయినది. 'సద్దు, సద్దు' అని వెండి బెత్తాలవారు బ్రాహ్మణుల నదల్పఁ దొడఁగిరి. తిమ్మాభట్టునకు ప్రోలయ దానము నొసగ నిశ్చయించుటకు గారణము లేకపోలేదు. తన పెద్ద భార్య పుట్టినిల్లయిన యూరుగల్లాతనికి జన్మస్థానము. మఱి యు, యశఃకాయుడైన తన యేకపుత్రుఁడు వెంకన్నకు విద్యా గురువు. అతనికి దానమొసఁగి తృప్తుని గావించిన వెంకన్నకు శాశ్వత స్వర్గసుఖము చేకూరగలదని యాతని దృఢనమ్మకము. తిమ్మాభట్టు వచ్చి రంగనాథశాస్త్రుల యెదుట వేసియుండిన పీటపై గూర్చుండి శాస్త్రులవారి యాదేశప్రకార మందుం డిన బంగరుపళ్లెరమున దన రెండు పాదముల నుంచినాఁడు. గిండివాఁడు బంగారు కలశమునుండి తుంగభద్రా నిర్మలోదక ములను దెచ్చి పోసినాఁడు. ప్రోలయ యతని పాదమునుగడిగి తడియొత్తి పళ్లెరములోని జలమును శిరముపై బ్రోక్షించు కొనెను. రంగనాథశాస్త్రు లంతట మంత్రము జెప్ప గడఁగి నాఁడు; అతని ననుసరించి ప్రోలయ పలుక నారంభించినాఁడు. 'అస్మత్పుత్రాయ వెంక నాఖ్యాయ శాశ్వత స్వర్గలోక ప్రాప్త్యర్థం'—

తుంగభద్రానదీ తీరే విరూపాక్షస్య సన్నిధౌ
అగ్రహార చికీర్షాయాం పరమప్రీతిమానం తదా
శౌనకాన్వయ సంభూత వరాపస్తంబ సూత్రిణే
ఓరుగంటాభిదాపూర్వ కాకపెద్దాన్వయే తథా
లింగాభట్టాయ విదుషః పుత్రాయామిత తేజసే
వినుతాయ విశిష్టాయ తిమ్మాభట్టాయ ధీమతే
బేబూరుగ్రామవిఖ్యాతం ప్రతినామ ప్రకల్పితం
వెంకటాఖ్య పురం రమ్యం సర్వలక్షణ లక్షితం
సహిరణ్యపయోధారపూర్వకం దత్తవాన్ముదా.

ధారాపూర్వకముగ నొకగద్యాణమును తిమ్మాభట్టు చేతవిడిచినాఁడు ప్రోలయ. తిమ్మాభట్టు మహాసంతోషముతో తన స్థానమునఁబోయి కూర్చుండినాఁడు. తరువాత నగర విద్వాంసులు చతుర్వేది రామాదీక్షితులు అష్టభాషాకవిత కృష్ణావధానులు శాబ్దికపాండిత్యం వెంకటరామశాస్త్రులు సహస్రావధాని ప్రభాకరశాస్త్రులు మొదలగు పండితులకు మఱియే డగ్రహారములను దానము జేసినాఁడు. అంతట షోడశ మహాదానములు ముగిసినవి. బ్రాహ్మణులను భూరిదక్షిణాల నిచ్చి సంతృప్తులఁజేసి నగరికి మరలినాఁడు ప్రోలయ.

౪

జాముప్రొద్దెక్కినది. ఎంతసేపటికిని మేల్కొనలేదు ప్రోలయ. అతని భార్యలకు దిగులుపుట్టినది. మంచముచుట్టును

ముగ్గురును నిలిచి రెప్పవాల్పక యతనివైపు జూచుచుండిరి. విడిచిపెట్టి పోవుటకు గాళ్ళాడలేదు వారికి. ఏమి వింత నిద్రయో! సామాన్య నిద్రాపరవశునివలె నతని యూపిరి చక్కఁగ నాడుచున్నను, గుండె యథాప్రకారము క్రమము దప్పక కొట్టుకొనుచున్నను నది సాధారణ నిద్రయనుటకు వీలులేదు. కదలఁడు; కాలుసేతులనైన మెదల్పఁడు. ఇంటికిజేరి యప్పటికొక్క యహోరాత్రము గడచిపోయెను. అంతకుముం దెంతకాలమునుండి నిద్రించుచున్నాఁడో! చిత్రము! చింతించి చూడఁగా దత్పూర్వదినములయం దతని ప్రవర్తనయంతయు గూఢముగనే కానవచ్చినది. నగరుకొలువు తీరినంతటనే ప్రతి దినమును ఇంటికి వచ్చువాఁడు రాక మాయమైపోయినాఁడు. ఎచటికిఁ బోయినాఁడో. రాయసింహాసన మెక్కినాఁడనియు దానధర్మములు జేసినాఁడనియు బట్టణమంతటను గుప్పుటిల్లు చుండు కింవదంతి మఱియు నాశ్చర్యము గలిగించినది. గొడుగు మోపరియేమి, రాయసింహాసనము నధిష్ఠించి దానధర్మములు సేయుటయేమి! అన్నిఁటికంటె నధికవిభ్రాంతిఁ గొలుపుచున్నది తలారి జంగమయ్య తెలిపిన వృత్తాంతము. మతంగవీరన్న గుడి పరిసరములనుండు చీఁకటిగుహ వాకిటఁ బడియుండఁగా దన యనుచరులచే మోయించుకొని వచ్చినాఁడట! ఎక్కడి మతంగపర్వతము! రాయపీఠము నెక్కి సామ్రాజ్యాధికారము నెఱపిన వైభవశాలి మఱికొన్ని గడియలకె యొంటరిగ దిక్కు

లేనివానివలె మతంగపర్వతశిఖరముమీఁది చీఁకటిగుహ వాకిటఁ బడియుండు టెట్లుసంభవించెనో! ఆ చీఁకటిగుహ చౌరంగి సిద్ధుని నివాసస్థానమని పెద్దలుచెప్పుదురు. తన నివాసస్థానముఁ జొచ్చి నందులకు గోపించి చౌరంగి మంత్రప్రయోగముఁ జేసియుండు నా! ఇట్లు వారు ముప్వురును దలపోసికొనుచు జాలకాల ముం డిరి. మధ్యాహ్న శంఖధ్వనులు వినవచ్చినవి. భోజనసమయ మైనది. దాసివచ్చి మెల్లఁగ నడిగినది, 'వడ్డింపవచ్చునా ?' యని. అప్పుడు పెద్దభార్య సవతులనుఁ జూచి చెప్పినది, 'వీరిని ఒంటరిగ విడిచి మనమందర మొక్కసారి పోవుట యుక్తముఁ గాదు. నే నిచ్చటనే యుండెదను; మీ రిరువురుపోయి భోజన మును ముగించుకొనిరండు. నేను తరువాత పోయెదను' అని. కడపటిభార్య యన్నది: 'అక్కయ్యా, మీరు నిన్నమధ్యాహ్న మునుండియు నొకమెతుకైన దినలేదు. చిన్నక్కయ్యగారు రాత్రియంతయు గంటిమీఁద రెప్ప వేయలేదు. పెద్దవారు మీరుండఁగా నేను మీకుముందు భుజింపజాలను. మీరును చిన్నక్కయ్యగారును భుజించి రండు. తరువాత నేను పోయెదను.' అని.

వీరిట్లు మాటలాడుచుండఁగనే ప్రోలయ గట్టిగ నావులిం చెను. మాట లుడిగి సంభ్రమముతో ముప్వురును చేరఁబోయి యతనిముఖముపైపు వంగి నిరీక్షించి చూచుచు నిలిచిరి. కొన్ని క్షణములైన పిమ్మట నతఁడు కన్నులను దెఱచిచూచెను. కాని వారిని గుర్తుపట్టలేదు. మత్తెక్కినవాని కన్నులవలె నవి కాంతి

హీనములై బయలుజూచు చుండినవి. మనసింకను మాంద్య మును వీడినట్లు గానరాలేదు. కడపటిభార్య పెద్ద భార్యతో నన్నది, 'అక్కయ్యా, వీరికి మనస్సింకను కలఁకఁబాఱినట్లే యున్నది. పన్నీట ముఖముఁ గడిగిన గొంత తేఱుకొనగలరని తోఁచుచున్నది.'

'చెల్లీ, అట్లేచేయుదము; అందువలన కీడేమియుఁ గలుగదు.'

అనిచెప్పి పెద్ద భార్య దాసివైపు తిరిగి పరిమళద్రవ్య ములపెట్టెనుఁ దెఱచి పన్నీటితిత్తిని దే నాజ్ఞాపించెను. దాసి పన్నీటితిత్తి నెత్తికొని శీఘ్రముగ మరలివచ్చి పెద్ద భార్య చేతనిచ్చెను; ఆమె దానిని రెండవభార్యకిచ్చి 'చెల్లీ, పన్నీ టిని యజమానులవారి ముఖముపై జిలకరింపుము' అని కడ గొట్టుభార్యవంక ముఖమై 'చిన్న చెలీ, నీపట్టురుమాలుతో వారిమోమున తడియొత్తుము' అని యాదేశించెను. వారిరు వురును ఆమెచెప్పినట్లు చేసిరి. చల్లని హిమాంబు బిందువులు మొగముపై జిందగనే పోలయకు మాంద్యము దొలఁగిపోయి నది. కడపటిభార్య మృదుహస్తస్పర్శచే విద్యుచ్ఛక్తి ప్రవ హించినట్లు దేహమున బ్రతిరక్తనాళముగుండను వర్ణనాతీత మైన యానందఝరి యొకటి పాఱుతెంచినది. ముఖము సంతోషముతో విరిసినది. లేచికూర్చుండి యవ్యాజప్రేమతో భార్యలను ముగ్గురిని రెండుచేతులను చేరఁదీసి యందఱినొక్క పర్యాయము కౌఁగిటఁజేర్చి గాఢాలింగనము జేసికొని వికసించిన

తామరపుష్పముల తావి నాఘ్రాణించునట్లు వారి ఫాలతలము లను ముద్దుగొని యడిగినాఁడు 'మీ రేల నన్నిట్లు చుట్టుకొని యున్నారు?' అని.

'మా దేహప్రాణములకు దామే యధిపతు లగుటవలన' నని జవాబుచెప్పినది పెద్దభార్య.

'నేడే క్రొత్తగ నధిపతినైతినా? ఏకారణముచే నైన నేమి ? శ్రీగిరిజాసరస్వతులను బోలిన మీ ముగ్వురిముఖముల నుదయమున నొక్కచోట నేకకాలమునఁ జూడఁగలుగుట నా యదృష్టవిశేషము. ఈదిన మెంతటి సుదినము !'

'బ్రహ్మవిష్ణుపరమేశ్వర స్వరూపులైన తమకు శ్రీగిరిజా సరస్వతులవంటి మేము భార్యలమగుట మా పూర్వజన్మ సుకృతఫలమే; కాని ఇది మధ్యాహ్నము, సూర్యోదయమై రెండుజాములైనదని మనవిసేయ సాహసించెదను' అని యుత్తర మిచ్చినది రెండవభార్య.

'మధ్యాహ్నమా? రెండుజాములుగడచినవా?'

'అవును దేవా. అవధారు, మహారాజాధిరాజ రాజపర మేశ్వర పోలయదేవ మహారాజులవారి కిది మజ్జనభోజనా దుల కవసరము' అని నవ్వినది కడగొట్టు భార్య.

'చక్కగ జ్ఞాపకముఁ జేసితివి, చెల్లీ. పాపము, భర్త గారు క్షుద్బాధాపీడితులై యుండవలయును. వారు భుజించి యిప్పటి కెన్నిరోజు లాయెనో' యని వగచినది పెద్దభార్య.

'లెండు, దేవా, లెండు' అని దోమతెఱ కట్టును చేఁబూని యెదుటనిలిచి 'జతనా' యని యుద్ఘోషించినది కడగొట్టుభార్య.

భార్యలందఱు దన్ను పరియాచకము సేయుచుండుటఁ జూచి సందేహము గలిగినది పోలియకు. తనతో వారెప్పుడును నిట్లు భాషించి యెఱుఁగరు. ఇంతకుపూర్వము దా నాడుచుండిన రాయనాటకమున నిదియు నొక క్రొత్తరంగమా? తానుండు తావెద్ది? స్వగృహముననా, వైజయంతీ భవనముననా? తనయొద్ద నిలిచి తన్ను గేలిచేయుచుండువారెవ్వరు? తన ప్రియ భార్యలా? లేక వారి రూపమును వహించిన కైతవవ్యక్తులా? తాను కనుచున్నది కలయా, వాస్తవమా? అని ఇట్లు కొంత కాలము చింతించినాఁడు; కాని పోలియమనస్సునకు సమాధానము కుదురలేదు. నిజము నెట్లయిన దెలిసికొనవలయునని నిశ్చయించుకొని భార్యల నడిగినాఁడు.

'నే నెచ్చట నున్నాను?' అని.

'జియ్యా,' అని ముగ్గురును నైక్యకంఠముగ బల్కిరి.

కొంచెము కోపమువచ్చినది పోలియకు. గద్దించిపల్కినాఁడు. 'కొంటెతనమును, వెటకారపు మాటలను మానరా?'

'చిత్తము, దేవా?'

'ఈ నాటకమును గట్టిపెట్టరా?'

'హసాదు. మన వెంకన్న శాశ్వత స్వర్గప్రాప్తికి మీరు చేసిన దానధర్మములను నాకు దెలియనిచ్చిన నేనడ్డపడియెదనని తలచితిరా దేవా?' అని యెత్తి పొడిచినది పెద్దభార్య.

'తాము వజ్రసింహాసనము నెక్కుటను మే మెటిఁగిన మీ ప్రక్కను గూర్చుండఁ గోరెద మని యెంచితిరా, ప్రభూ' అని దూఱనాడినది ద్వితీయ.

'చౌరంగి సిద్ధుఁడు తమ కుపదేశ మొనర్చిన పరకాయ ప్రవేశవిద్య మాకు నేర్పియుండిన మేము రాణులమై తమతో వైజయంతీ సదనమునకు గాపురము వత్తుమని సందియమంది తిరా నాథా?' యని యుపహసించినది తృతీయ.

వారి వాచాలతవలన మఱింత క్రోధమువచ్చినది పోలిలయకు. 'మీ ప్రేలడములఁ గట్టిపెట్టరా? ఏమిటి మీ గోడవ' అని గదమాయించి పలికినాఁడు.

'క్షమింపవలయును మా యపరాధమును. నిజమాడిన నిష్ఠురముగాదా? సామెత తప్పునా?' అని ప్రత్యుత్తరమిచ్చినది యగ్రమహిషి.

'నిజమా ?'

'కాదా ? సంశయముఁ గలిగిన రాయ పౌరోహితులు రంగనాథశాస్త్రులవారి నడుగవచ్చును.'

'రాయరాజ్యములోని మండలేశ్వరులను సామంతులను దొరలను అమరనాయకులను అడుగవచ్చును' అని తోడు పల్కినది రెండవభార్య.

'తలారి జంగమయ్యగారిని విచారించి తెలిసికొనవచ్చును' అని జంకించినది మూఁడవసతి. వీరిట్లు సల్లాపించుచుండఁ గనే వినవచ్చినది వీధిమొగాశమునుండి పరుగెత్తి వచ్చుచుండు

గుఱ్ఱపు గొరిజల చప్పుడు. మఱి క్షణమునకు దాసి యొకతె లోనికివచ్చి 'దొరా, వాకిటి కావలి తిమ్మయ్యగారు వచ్చియున్నారు' అని విన్నవించినది.

'తిమ్మయ్యగారా? తిమ్మయ్యగా రేలవచ్చిరి? కానీ, వేగముగ దోడ్కొనిరా.'

దాసి బయటికింబోయి మరలివచ్చినది తిమ్మయ్యగారితో. వారు ప్రవేశింపఁగనే లేచి నిలిచినాఁడు పోలయ. భార్యలతని కిరుపార్శ్వములను నిల్చిరి. తిమ్మయ్య మందహాసముతో 'పోలయా ధన్యులయా మీరు' అనుచు ముందునకు వచ్చెను. 'ఏల నట్లనియెదరు?' అనుచు నతనివంక నొకటి రెండడుగులు పెట్టినాఁడు పోలయ.

'రాయ దేవుని మనసుకెక్కినవారు మీరుగాకపోయిన మఱి ధన్యులు కాగలవా రెవ్వరు? బయలు వెడలుఁడు ఏలినవారి యాజ్ఞయైనది'

'ఎచటికి? నగరికా?'

'ఆఁ. మొదట నగరికే.'

'ఆవల?'

'ఆవల తిరుమలకు.'

'తిరుమలకా?'

'అవును. వేంకటేశ్వర పెరుమాళ్ళను సేవించుటకు ఏలినవారు పయనము చాటింపించినారు. మిమ్ము వెంటనే కొలువునకు రమ్మని యాజ్ఞయైనది.'

తిరుమల ప్రయాణవార్త వినఁగనే ప్రోలయ భార్యలకు ముగ్వురకు వేంకటేశ్వరులను దర్శింప నభిలాషకల్గినది. ఒండొరులతో నొకక్షణము గుసగుసలాడిరి. అంతట ప్రోలయ వైపు ముఖమై యతని పెద్దభార్య యడిగినది 'మాకు తిరుమలకు యాత్ర వెడలవలయునని యిచ్ఛ చిరకాలమునుండి కలదు; తమతోఁగూడ రా మాకనుజ్ఞ నిరా?' అని.

'మీరు లేక నేను పోఁగలనా? ప్రాణములనువిడిచి బొందికి చలనమెక్కడిది?' అని యన్నాఁడు ప్రోలయ.

'సరసుడవయ్యా, ప్రోలయ్యా' యని నవ్వినాఁడు తిమ్మయ్య.

X

ప్రాతఃకాలము గడచిపోయినది. పగటివేళ గావచ్చుచుండెను. కళసాపురమునందొక యారామగృహాంతరాళ మంటపమున నుయ్యాల మంచముపై నుపవిష్టుఁడై తాళపత్ర గ్రంథమును జదువుచుండినాఁడు సర్వశిరఃప్రధాని సాళువ తిమ్మరసు. తనకాలమంతయు రాజ్యకార్య నిర్వహణమునందు సరిపోవుచున్నను సారస్వతాభిమానము దఱుచుగ నతని గ్రంథ రచనకుఁ బురికొల్పెడిని. అగస్త్యుని బాలభారత మనతని కభిమానకావ్యము పలువురు పండితులఁ గోష్ఠి నాతఁడా గ్రంథమును బఠించి యందలి విశేషాంశములను వారితో జర్చించువాఁడు. దానియందలి గూఢార్థమును వివరించుటకొఱకు

వ్యాఖ్యానొకటిరచింప నారంభించెను. ఆ యుదయ మొక క్రొత్త సర్గను మొదలుపెట్టినాఁడు. చుట్టుపట్ల ద్రాక్షతోటలలోఁ నేతము ద్రొక్కు వారి దేశిగీతములును నా పాటలకు మృదంగములను వాయించునట్లు నీటమునుఁగు బానకడవల శబ్దములును తిమ్మరసునకు భావోద్రేకముఁ గలిగించెను. ఒక్కొక శ్లోకమును జదివి యందలి యర్థమును మననము జేయుచు గ్రొత్త తాటియాకుల సంపుటమున గంటముతో బిరబిర వ్రాయుచుండెను. అన్వయక్లిష్టమైన యొక శ్లోకమును పలుమారు వల్లించుచుఁ కవిహృదయమును గ్రహింప బ్రయత్నము సేయుచుండఁగా గట్టికవాఁడు ప్రవేశించి, 'జయము, జయము సర్వశిరః ప్రధానులవారికి, ఎవ్వరో కవీశ్వరుడఁట, పెద్దన్నగారలట. దర్శనార్థమువచ్చి హాజారమునఁ గాచియున్నారు' అని యుచ్చస్వరమునఁ బలికెను.

'పెద్దనగారా ?' అని దిగ్గనలేచి తిమ్మరుసు హాజారము వైపు నడువనారంభించెను. ఆశ్చర్యచకితుఁడై వెండిబెత్తము వాఁడు ముందర గునగున బరుగులిడుచు 'చాగు బళా' యనుచుఁ బోయి హాజారమున నిలిచియుండిన మహాతేజశ్శాలియైన పురుషునితో 'స్వామీ, వీరె సర్వశిరఃప్రధానులవారు తమ్మెదుర్కొన వచ్చుచున్నారు' అని వినయముతోఁ జెప్పెను. వాని మాటలు ముగిసియు ముగియకమునుపే తిమ్మరసుగారు హాజారమును బ్రవేశించి 'నమస్కారము మహాకవీ, నా మందిరము తమ రాకచే పావనమైనది. నేను తమరాకచే కృతార్థుఁడనై

తిని. దయసేయుఁడు' అని కైదండయొసఁగి తోడ్కొనిపోయి ఉయ్యాల మంచముపై కూర్చుండఁబెట్టి తాను నాతని యెదుట కూర్చుండెను.

'సర్వశిరఃప్రధానులవారికి కృతజ్ఞుఁడను. నేను మీ స్మరణయందుండుట చిత్రము. నాకొక పెద్దతన మిచ్చి నన్నాదరించుటకు తమవంటి మహాపురుషులు వచ్చుట కవిజనుల యందు తమకుఁగల వాత్సల్యము వలనఁగాక మాగొప్పతనము వలననా ?'

'నా వాత్సల్యమును నేజేయు గౌరవ సత్కారములును నశ్వరములు. తమ సంసర్గమువలన నా కమరత్వము గలుగఁ గలదు. తమ్ము మఱువఁగలనా ? మరణాంతము నా చెవుల యందు మ్రోఁగ గలదు తమ యద్వితీయమైన కవిత్వధార. ఎవ్వరు విస్మరింపఁగలరు గండపెండేరమునుఁ గెల్చిన యుత్పలమాలికను ?'

'తమరు విద్వత్పక్షపాతమున నట్లనుచున్నారు.'

'కావచ్చును; కాని మహాకవీ, కవిత్వరచనకు సిరి సంపద లవసరమా ? 'హాలికులైననేమి గహనాంతర సీమల గందమూలకౌద్దాలికులైననేమి ?' యను పోతనామాత్యుల వాక్యములు దా మెఱుఁగనివా?'

'ఆవిషయ ప్రస్తావన కిపుడవసర మేమి ?'

ఈప్రశ్నకు జవాబుచెప్పుటకు బదులు యెదుటి తాళపత్రగ్రంథమునుండి యొక ఆకును విడదీసి చదువ నారంభించి నాఁడు తిమ్మరసు.

'నిరుపహతిస్థలంబు, రమ
ణీప్రియదూతిక తెచ్చియిచ్చుక
ప్పురవిడె, మాత్త్వి కింపయిన
భోజన, మయ్యేలమంచ, మొప్పుత
ప్పరయు రసజ్ఞు, లూహ తెలి
యంగల లేఖకపాఠకోత్తముల్,
దొరకినగాక యూరక కృ
తుల్ రచియింపుమనంగ శక్యమే'

పెద్దనగారేమొ జవాబుచెప్పఁ బోవుచుండిరి. ఇంతటనె ప్రవేశించినాఁడు మరల కట్టికవాఁడు. వానిం జూడఁగనే వానివంకఁ బఱపినాఁడు మంత్రి ప్రశ్నాత్మకమైన తీక్ష్ణదృష్టిని. వాఁడు గమనించినాఁడో లేదో. కాని, యథావిధి 'జయము జయము సర్వశిరఃప్రధానులవారికి. వాకిటఁ పెనుగొండదుర్గాధిపతి కొండమరసయ్యగారును ధర్మాసనం ధర్మయ్యగారును వచ్చియున్నారు. నేను అవసరముకాదని చెప్పినాను; కాని అత్యంతాగత్యమైన కార్యమని మనవిసేయుమన్నారు' అని యుద్ఘోషించినాఁడు.

'ఊఁహూఁ. రమ్మను, ఇంక నెవ్వరికిని ప్రవేశము లేదు. తెలిసినదా?'

'చిత్తము.'

మఱియొకక్షణమునకు కొండమరసయ్య ధర్మయ్యగార్లతో కట్టికవాఁడు మరల ప్రవేశించి వారల గూర్చుండఁబెట్టి

వెడలిపోయినాఁడు. వాఁడు పోయినవెనుక తాము నివేదింప వచ్చిన విషయమునకు బీఠిక వేయుటకొఱకు కొండమరసు—

'సర్వశిరఃప్రధానులవారి యేకాంతమును భంగపఱచి నందులకు క్షమింప బ్రార్థించుచున్నాము' అని వేఁడెను.

'కారణములేక తమవంటివారు విచ్చేయుదురా? ఊరక రారు మహాత్ములు'

'చిత్తము—' అని యేమో చెప్పవచ్చి పెద్దనవైపు సంశయదృష్టినిఁ బఱపినాఁడు.

అతని భావము గ్రహించి, 'మహాకవి పెద్దనగారిని మీ రెఱుఁగరా?' అని యడిగినాఁడు తిమ్మరసు.

ధర్మయ్య అందుకొని యన్నాఁడు, "తెలియకేమి? 'పూత మెఱుంగుల' నాశువుగా జెప్పి రాయలవారిచే కవిగండ పెండేరమును దొడిగించుకొన్న మహనీయుఁడు."

'కొండమరసుగారూ, సంశయింపఁబనిలేదు. తాము సెలవీయదలఁచిన యంశ మెద్ది?'

'రాయలవారు నిరూప మంపినారు, పెనుగొండదళము లతో గదలి యుదయగిరిపై గూచి సేయుమని.'

'సరి, తమకిందు సంశయమున కవకాశ మెద్ది?'

'ఆదవాని రాయచూరు కందనవోలు గుత్తి దుర్గాధ్యక్షులకుఁగూడ నిట్టి నిరూపమే చేరినది.'

'చేరి యుండవచ్చును.'

'గజపతివారి సైన్యస్తోమ మంతయు నుదయగిరియం దున్నదఁట. మఱి మనము గడిదుర్గములలోని ధాన్యములను దరల్చుకొని దండువెళ్ళిన నేదులఖానుఁడు రాయరాజ్యముపై నెత్తి వచ్చుట నిశ్చయము.'

'క్షమింపుడు కొండమరసయ్యగారూ, రాయదేవేంద్రుఁడు కేవలము దళనాయకుఁడు మాత్రము గాఁడు; రాజ్యతంత్రమర్మజ్ఞుఁడు, సహస్రాక్షుఁడే. విద్యానగరమునసుండినను ఈ విశాల కర్ణాట సామ్రాజ్యమునను దత్పరిసర దేశమునను రాయలదేవుని దృక్పథమునం బడని యంశము లేదు.'

'చిత్తము. కాని—'

'తమరు కమాలుఖానుని పేరు వినియున్నారా?'

'చిత్తము. బిజాపుర ప్రధాన వజీరుఁడు.'

'యూసపు ఏదులఖానుని మరణానంతరము బిజాపుర రాజ్యమునకు సర్వాధికారి. బిజాపురము నాక్రమించుకొనవలయు ననుదురాశ యతనికిఁ గలిగినది. మనసాయ మపేక్షించి యున్నాఁడు. అతఁడు మనపై నెత్తివచ్చునా?'

'చిత్తము. నాసంశయముతీరినది. ఇఁక దండు తరలించుకొని పోయెదను.'

'తత్క్షణము బయలువెడలుఁడు. ఏలినవారు రేపు తిరుమలకు పయనము. అచటినుండి ఉదయగిరికి పో నుద్దేశించియున్నారు. వారటకు చేరకముందే మీరచటికిపోయి కోట

లగ్గలు బట్టకున్న స్వామివారి యాగ్రహమునకు, పాత్రులు కాఁగలరు.'

'చిత్తము, చిత్తము'

ఈసంభాషణను వినఁగనే ధర్మయ్యకు కొంచెము జంకు గలిగినది. తాను మహాప్రధానులవారికి విన్నవింపనెంచిన విషయమును జెప్పవచ్చునా యని. కాని రాయ దేవేంద్రుఁడు సర్వశిరఃప్రధానులవారు చెప్పినంతటి యసాధారణ ప్రతిభాశాలి కావచ్చును; కాని బ్రహ్మకుఁగూడ నొక్కరిమ్మ యుండునట్లు వారిచర్యలలో గొంత వెఱ్ఱితనము గానవచ్చు చున్నది. వారియాజ్ఞను నెఱవేర్చిన నవ్వుబాట్ల పాలగుట నిశ్చయము. ధర్మయ్య ఇంకను మనస్సు నిశ్చయించుకొనలేదు; ఇంతలోనే తిమ్మరసయ్య యతని నడిగినాఁడు. ధర్మయ్య గారూ, ఏదో గాఢముగ జింతించుచున్నట్లున్న దే?'

'చిత్తము, చిత్తము. ఏమియు లేదు. గొడుగు ప్రోలయ్య విషయము.'

'గొడుగు ప్రోలయ్య విషయమా? అతని విషయమేమి?'

'మొన్న నడచిన రాయనాటకమునందు.'

'ఏమి నడచినది?'

'అతఁ డెనిమిదిగ్రామములను సర్వమాన్యముగ దానము చేసినాఁడు.'

'అవును.'

'ఆ దానగ్రామములకుఁ దామ్రశాసనములనుఁ బుట్టించి యమలులోనికిఁ దేవలయునా యనుసంశయము గల్గినది.'

'కారణము?'

'దాపరికము లేక నామనస్సులో నున్నది యున్నట్లు మనవిచేసికొనెదను. క్షమింపఁ బ్రార్థించుచున్నాను. ప్రోలయ్య రాజపరివారములో నల్పుఁడు. ఊడిగము వారిలో నొక్కఁడు. వానిని రాయసింహాసనము నెక్కించి యొడ్డోలగమున నందఱిచే మ్రొక్కించుట హాస్యాస్పదము రాయలవారు వినోదమునే చూచిరి కాని రాయపద గౌరవ మెంత కొఱవడినదో విచారింపకపోయిరి. ఈవేళ గొడుగు మోపరి రాయసింహాసనము నెక్కిన రేపు పాదూవాహుని వంతు వచ్చును. గావున రాయలవారు గొడుగుమోపరిచే వేడుకకై చేయించిన దానములనుఁ బ్రకటించి రాయపదమునే కాక మత్రాంగమునుఁ గూడ నవ్వులపాలు సేయుట యుక్తమా? మహాప్రధానులవారెట్లాజ్ఞాపించిన నట్లు చేయుదును.'

ధర్మయ్యగారి యభిప్రాయమును విని నిట్టూర్చి యిట్లన్నాఁడు తిమ్మరసు 'రాయ సంస్థానమునకుఁ మూలస్తంభప్రాయులము ముగ్గురు ప్రధానులము సంశయగ్రస్తులమై స్వామివారి యాజ్ఞ నాచరణమునకు దేవలయునా వలదా యని వితర్కించుటకు మన మిచట గూడినట్లున్నది. కొండమరసయ్యగారికి రాయలదేవుని రాజ్యపరిపాలనసామర్థ్యమునను లష్కరీతనమునను నమ్మకములేదు; తమకు వారి యుక్తాయుక్త వివే

చనయందు నమ్మకము లేదు ; నాకు వారి వైదుష్యమందును
కవితారసగ్రహణపారీణతయందును నమ్మకము లేదు. మనవంటి
విశ్వాసరహితులగు మంత్రుల సాహాయ్యమునఁ సామ్రాజ్య
పాలన సేయఁగడఁగిన యామహారాయ లెంతయుఁ గృతార్థుఁడు.'

తిమ్మరసయ్యగారు తమ్ము దెగనాడుచున్నారని గ్రహించినారు కొండమరస ధర్మయ్యలు. ఆయనను సమాధానపఱచుట మేలని యెంచి ధర్మయ్య వినయముతో నడిగినాఁడు 'మహాశిరః ప్రధానులకు రాయల దేవునియందు నమ్మకము లేదని యెవ్వరు చెప్పఁగలరు?' అని. 'ఒకరు చెప్పవలయునా, ధర్మయ్యగారూ. వినుఁడు, చెప్పెదను. పెద్దనమహాకవిగారిని రాయలవారు ఒక కావ్యమును వ్రాయుఁడని యాదేశించిరి. కావ్యరచనకుఁ బూనుటకుఁ బదులు వారు తమకు మిద్దెలు మేడలు ప్రియదూతికలు నుయ్యాలమంచములు మొదలగు సౌఖ్యము లెన్నియో కలిగినఁగాని యూరక కృతులు రచియింపఁజాలమని చెప్పినారు. స్వామివారందుమీఁద మహాకవిగారు కోరిన వసతు లన్నిఁటిని గల్పించి యిమ్మని యుత్తరు వంపినారు. 'కూ' యన్న కోటానుకోట్లుగ బఱగిడుకవు లెందరో యుండఁగ పెద్దనగారియందు స్వామివారి నాకర్షింపఁగల విశేషగుణ మెద్ది కలదు? కావున రాయలవారి యాజ్ఞ నాచరణకుఁ దెచ్చుట యుక్తమా కాదా యను సందిగ్ధావస్థయందున్నాను.'

'మహాకవి పెద్దనగారి విషయమునఁ దమకు సందేహమున కవకాశము లేదు.'

'సరే. గొడుగు ప్రోలయ్యగారి యెడ తమకుఁగూడ నట్టి సంశయమున కవకాశము లేదు.'

ధర్మయ్యగారికిని కొండమరసయ్యగారికిని మనస్సున కొంత ఆయాసముఁ గల్గినది. 'శివశివా! ప్రతిభాశాలియగు మహాకవి యెక్కడ, రాచయోగపు గొడుగుమోపరి యెక్కడ' అని కక్కసముతో నొచ్చుకొన్నాఁడు కొండమరసు.

'ఊళియమే - కొండ మరసయ్యగారూ ఊళియమే - కాదని యెవ రనిరి? కాని ప్రోలయ శూరుఁడనియు స్వామిసేవయందు ఆత్మత్యాగమునకు సైతము వెనుదీయని స్వామిభక్తిపరాయణుఁడనియు విస్మరింపవలదు.'

'అతని ప్రతాపము నెవ్వ రెఱుఁగుదురు. శౌర్యము నెచ్చట బ్రకటించినాఁడు? రాయరాణువ యం దతని పేరు గూడ తెలియరాదు. నాఁట వరుసకు ప్రోలయ శూరుఁడే యని యొప్పుకొన్నను శూరుల నందఱిని స్వామివారు వజ్రసింహాసనము నెక్కించుచున్నారా? అంతస్తు ననుసరించిగదా సత్కారమును ప్రసాదింపవలయును?'

'రాయదేవుల వారికి ఉచితానుచిత వివేచన శక్తి లేదను ధర్మయ్యగారి యభిప్రాయముతో మీరును ఏకీభవించుచున్నారు. కాని అపూర్వమైన మనుష్యుల నసాధారణ రీతిగ సత్క-

రింపవలయునన్న నీతివాక్యమును మనవంటి మంత్రులు పరిగ
ణింపకపోయినను సింహాసనాధిపతులు మఱువరు.'

'గొడుగు ప్రోలయ అంతటి యపూర్వ పురుషుఁడా?'

'కాకేమి? అతని వృత్తాంతము మీకుఁ దెలియనట్లు
న్నది. తెలిసియుండిన నింతదూరము రాయలదేవుని యుక్తా
యుక్త వివేచన సామర్థ్యమును విమర్శించియుండరు.'

'చిత్రము. ప్రోలయ వృత్తాంతము మేము వినఁదగినదేని
సర్వశిరఃప్రధానులవారు సెల వీయవలయును.'

౬

రాత్రి నిశీథముఁ గడచిపోయినది. చుక్కబొడుపు సమ
యమైనది. కటికచీఁకటి. విస్సున వీచు కొండగాలి రొద తప్ప
సద్దేమియు లేదు. సర్వము మాటు మణగియుండినది. ఆ య
వేళప్రొద్దున చీఁకటికి గప్పువేయుచు నొకవ్యక్తి నిశ్శబ్దముగ
గద్వాల రాయచూరుల మధ్య ఘటిగ్రామమున కుత్తరమున
దిగియుండు రాయరాణువు సాళె వైపు నక్కుచు తారుచు
వచ్చుచుండెను. శిబిరపు టుత్తరద్వార సమీపమును జేరునరికి,
'జబినా, ఎవ్వరా వచ్చునది?' అను పహరాసిపాయి హెచ్చ
రిక వినవచ్చినది. వెంటనె సోదనదివియల వెలుతురు చీఁకటి
గర్భమునుఁ జీల్చినది; ఆ దీపజ్వాలల వెలుఁగున గానవచ్చినా
డొక జంగము దేవర. వానిని జూడఁగనే పహరా సిపాయీలకు
సందేహముఁ గలిగినది. ఆ యువేళ వా డెచటికేఁబోవుచున్నాఁడు?

వేషమును గాంచిన భిక్షాటనకుఁ బోవున ట్లున్నది. అప్పుడు వానికి భిక్షము వేయు వా రెవ్వరు? వాఁడు శత్రువులపక్షము సంచారము సేయుచున్న వేగులవాడు గావలయునని నిశ్చయించి మరల 'జతనా' యని హెచ్చరించిరి. దానికిఁబదులు వాఁడు ' మహాదేవ, మహాదేవ శివ గురు ధర్మభిక్ష' యని పలికెను. అప్రయత్నముగ కుడిచేయి గంటను వాయింప మొదలిడినది. పహరాజవానులు వాఁడు వేగుల వాఁడని నిశ్చయించి వాని పైఁబడి పెడరెక్కలు విఱిచికట్టి ద్వారములోపల మొగాళ ముననుండు చిన్నగుడారములోనికి నీడ్చుకొనిపోయిరి. మంచ ముపై తివాసిమీఁద గూర్చుండియుండినాఁడు వారినాయకుఁడు రామలింగ నాయఁడు. జంగముదేవరను చూడఁగనే గర్జించి నాడు రామలింగనాయఁడు, 'ఎవరు నీవు' అని.

'ఆప్తుఁడను' అని జవాబుచెప్పినాఁడు జంగముదేవర.

' ఆప్తుఁడవా ? '

' ఆఁ '

' సంకేతము ? '

' కలుబరిగ '

' ప్రతి సంకేతము ? '

' గోదావరి '

' ఆప్తుఁడా, నీ పేరేమి ? '

' నాపేరు సర్వశిరఃప్రధాని తిమ్మరసయ్యగా రెఱుఁగుదురు. '

'నీ పేరడిగినాను గాని నీపే రెవరెఱుఁగుదురనికాదు '

' నాపేరా ?'

'ఆఁ, నీపేరే, '

'శివయ్య. '

'ఏ శివయ్య ?'

'దోని శివయ్య.'

'మంచిది. శివయ్యా. సమాచార మేమి ?'

'ఉన్నది, అత్యంతాగత్యమైన సమాచారము.'

'మఱి చెప్పరాదూ ?

'సర్వశిరః ప్రధానులు వారికడకుఁ దోడ్కొనిపొండు.'

'నాతోఁ జెప్పకూడదా ? సర్వశిరః ప్రధానులవారిచట లేరు రాయచూరు దుర్గమునకుఁ బోయిరి.'

'రాయల దేవుఁడు లేరా ?'

'ఉన్నారు'

'వారిసన్నిధికిఁ బిలుచుకొని పొండు.'

'నాతో చెప్పవా ?'

'ఉత్తరువు లేదు. ఆలస్యము సేయవలదు.'

'రాయల దేవుఁడు నిద్రించుచున్నారు. ఇచ్చట విశ్రమింపుము. ఉదయమున ఏలికదర్శనము సేయవచ్చును. '

జాగుసేయవలదు. విషయ మగత్యమైనది. నాకు వెంటనే రాయలదర్శన మిప్పింపకుండిన ఆపద కలుగఁగలదు.'

' ఎవ్వరికి ఆపద ?'

'నీకు నాకు మన కందఱకు.'

'అబ్బ !'

'మఱి నన్ను రాయల దేవుని కడకు దోడ్కొనిపోవా ?'

'కానీ, స్వామివారు నిద్రపోవుచున్నారు.'

'నిద్రపోవుచున్న మేలు కొలుపుము.'

'.........'

'నీవిట్లు జాగుచేసిన స్వామివారు ఇంక గడియ సేపటిలో——'

అతఁడింకను మాటను ముగింపలేదు ; డేరావాకిటి తెరను తొలఁగద్రోసికొని లోనికివచ్చినాఁడు రాయలవారి యంగరక్షకుఁడు; వానిఁ జూడఁగనే రామలింగనాయఁడు లేచి నిలిచి యడిగినాఁడు. 'ఏలినవారి యాజ్ఞ యేమి ?' అని.

'సర్వశిరఃప్రధానులవారి కొఱ కెవ్వరును రాలేదా ?'

'ఎవ్వరును రాలేదు, ఈజంగము దేవరదప్ప'

అంతట నతఁడు జంగము దేవర వంక దిరిగి, 'రావయ్యా, నా వెంట. రాయల దేవుఁడు నీకొఱకు గడియ రెండుగడియలుగ గనుపెట్టుకొనియున్నారు' అని పిలిచెను. జంగము దేవరయు నతని వెంటనడచుచు రామలింగనాయుని నుద్దేశించి చెప్పినాఁడు, 'నా యాలస్యమువలన కీడుగలిగిన దానికి నాయునివారు కారణము. వారిచర్యకు రాయల దేవునికి వారు సమాధానము చెప్పు కొనవలసియున్నది' అని.

౭

ఆ నిశాసమయమున ఉన్నటులుండి మ్రోఁగినది ప్రయా
ణభేరి. నిశ్శబ్దముగనుండిన రాయస్కంధావారమున రేఁగినది
కలకలము. ఆదమఱచి నిదురించుచుండిన సైనికులు భేరీనినాద
ముచే మేల్కొల్పఁబడి యబ్బురపాటుతో నా ప్రయాణభేరికి
గారణము నొండొరులతో వితర్కింపఁ గడఁగిరి. ముఖ్య దండ
నాయకు లిద్దఱుముగ్గురుదప్ప ఆరాత్రి కూచి సేయవలసియుం
డునని యెవ్వరు నెఱుఁగరు. సైనికు లిట్లు నులకలాడుచుం
డఁగా పడవాండ్రు వచ్చినారు రాయలదేవుని యాజ్ఞను ప్రక
టించుటకు. ఆయుధములను చేబట్టి రణాంగమున యుద్ధము
సేయుభటులును, యుద్ధపరికరములను రణభూమియందు వలసి
నప్పుడు దళవాయులకు సరఫరాసేయు సైన్యపరివారమును, రణ
వైద్యులును శస్త్రనిపుణులు మొదలగువారు దక్క యన్యు
లెవ్వరును సైన్యము వెంటఁ బోరాదని రాయలవారి యాజ్ఞ
యఁట! ఏమిచోద్యము! ఎన్నఁడైన నేదళనాయకుఁడైన నిట్టి
యాజ్ఞనిచ్చి యుండెనా! గాసిపడిన సైనికుల కుపచారము
సేయుటకును, గాయపడినవారికిఁ గట్లుకట్టి ప్రోదిసేయుటకును,
డిల్లవడినవారికి ధైర్యముఁ జెప్పి యాసచూపి యుద్ధమునకుఁ
బురికొలుపుటకును విలాసినీజనముఁ గూడ రాకపోయిన యుద్ధ
ము జయప్రదముగ నెట్లు సాగగలదు? రాయలవారి కింత
మాత్రముఁ దెలియకపోయెనా? దండనాయకు లేమి చేయు
చున్నారు? రాయలవారికిఁ దెలియకపోయిన అనుభవజ్ఞులైన

దండనాయకులు తెలుపరాదా ? కాని పరివారజనము నంతటిని గదల్చుకొని పోవుటకు వ్యవధి లేదనియు, తురకదండు కోవెల కొండనుండి కృష్ణవైపు తరలివచ్చుచున్నదనియు, గమ్యస్థానమును వారు చేరియుండెరకముందే అకస్మాత్తుగ వారిపైఁబడి నిర్మూలముగావించుట రాయలవారి యుద్దేశమగుటచే వాయువేగ మనోవేగమునఁ గూచిసేయుటకొఱకే వారట్టి యాజ్ఞ నిచ్చిరనియు గొండలు మర్త్యజ్ఞులు జెప్పఁదొడఁగిరి.

సైన్యము కదలినది. సేనాముఖమున గుఱ్ఱపుఫౌజు మూఁడుతురుపులుగ నడచినది. తరువాత పాయదళము పడలిరువది. పుచ్ఛమున నేనుఁగుఘటలేబది. గజఘటలమధ్య పుష్పదంతమను సింహళద్వీపజమగు పెద్దపోతుటేనుఁగుపై కృష్ణదేవరాయలవారు కూర్చుండి దళముల వేగిరపెట్టుచు నడపించుచుండిరి. దారియందేయాటంకమును లేక పయనము సాగుచుండినది. చుక్క పొడిచినది. అప్పటికి మూఁడు నాలుగు పరుగుల దూరము కూచి నడచినది. కృష్ణను చేరుట కింకను రెండు మూఁడు పరుగులు పోవలసియుండెను. ఛటఛటఛటమని ప్రేలు తుపాకుల మ్రోతయు బాణసంచు పగులు శబ్దములును వినరానారంభించినవి. తా మింకను తురకదండును దారిసిల్లకమునుపే పోట్లాట ప్రారంభమగుటకు సైనికు లచ్చెరువందిరి; కాని రాయలవారు ప్రతిదళనాయకుని యొద్దకుఁ వేగ నడువుఁడని మాటిమాటికిని పడవాళ్ళను దఱుముచు త్వరపెట్ట గడఁగెను; కృష్ణాతట మింక నరకోసు దూరమున నుండెను. తూర్పున

మైల విడిచినది. సూర్యోదయకాల మాసన్న మగుచుండెను. హఠాత్తుగ ప్రజ్వరిల్లినది మిన్ను ముట్టెడి యగ్నిజ్వాల యొక్కటి. కృష్ణాతీరమున తురక లేదో గ్రామమును పరశు రామప్రీతిగావించిరని యందఱును నిశ్చయించుకొనిరి.

నగారా మ్రోగినది. మంత్రబద్ధమైనట్లు సైన్యమాగినది. రాయలవారు వ్యూహరచనావిధానమును దండనాయకులకు దెలియఁజేయుటకు పడవాళ్ళను దఱుముచుండిరి. అర్ధచంద్ర వ్యూహము. చంద్రవంక మధ్య రాయలవారి యాధిపత్యము క్రింద గజఘటలు. గజముల కిరుపార్శ్వముల రెండు పాయలుగ విభజింపఁబడిన పాయదళము. కుడివంక పాయకు నాయకుఁడు గని తిమ్మానాయఁడు; ఎడమపాయ కధిపతి పెమ్మసాని రామ లింగనాయకుఁడు. పాయదళమున కిరుపక్షముల గుఱ్ఱపుఫౌజు చంద్రవంక రెండుకొమ్ములుగ నేర్పడవలయునని తెలియ పఱచిరి. రాయలవారి యా దేశము చొప్పున సేనాధిపతులు వ్యూహమును బన్నుచుండిరి. ఇంతటనె రగులుకొనుచుండు ప్రదేశమునుండి జోడన సేయుచు రాయసైన్యమునువచ్చి చేరినాడొకసవారు. రాయలవారి ఏనుఁగు చెంత నిలిచి ఉచ్చైః స్వరముతో విన్నవించినాఁడు: ' దేవ అవధారు. ఏలినవారి యాజ్ఞప్రకారము మన మాయాస్కంధావారమును తురక దండును జేరనీయక సంరక్షించుచున్నారము. వారిబలమంతయు నుత్తరపు వాకిలి పైఁబడినది. తురక గుఱ్ఱపుఫౌజు నాపుటకు సాధ్యము గాకున్నది. ఏలినవారి యాజ్ఞప్రకారము స్కంధా

వారము తూరుపువాకిలి తూరుపుమైల విడువఁగనే నిప్పంటించి తిమి. పదుగురి కొక్కఁడే యడ్డునిలిచి పోరుచున్నాడు గొడుగు వెంకన్నగారు. ఇంక నెంతసేపు తురకలను నిలుపవలయునని ఏలినవారి యాజ్ఞయో తెలిసికొని రమ్మని నన్ను పంపినారు.'

కృష్ణరాయల ముఖము మందహాసముతో వికసించినది. 'మజ్జారె, వెంకన్న, శూరుడవోయి!' అను ప్రశంసావాక్యము లప్రయత్నముగ వెలువడినవి రాయదేవుని దివ్యవాక్కునుండి.

'హసాదు, దేవా ధన్యుఁడను' అను మాటలు విన వచ్చినవి చౌడోలు వెనుకప్రక్కనుండి. కాని కృష్ణరాయ లా మాటలను చెవిని బెట్టలేదు. అశ్వికుని కాజ్ఞాపించినాడు, "సత్వ రము దవుడుతీయుము. చెప్పుము వెంకన్నతో మా మాటలను. 'ఇంక నచట నిలువరింప నవసరములేదు. నీ కార్యమును శక్తిసామర్థ్యములతో నెఱవేర్చినాఁడవు. తురకలను స్కంధా వారములోనికి విడువుము. ఇదె మేము నిన్ను జేరవచ్చుచున్నా రము' అని."

ఆమాట చెప్పఁబడగనే యా సవారు గుఱ్ఱమును మరల్చుకొని దౌడాయించినాఁడు.

౨

మాయా స్కంధావారమును బ్రవేశించినది తురకదండు. యూసుఫ్ ఆదిల్ ఖానుని సేనాధ్యక్షుఁడు గజ్నఫరీ అలీఖాను బిజాపుర గుఱ్ఱముతో నుత్తరద్వారముగుండ స్కంధావార

మును ప్రవేశించెను; కాని యడుగడుగునకును విజయనగరపు గడలఫౌజు వారిని ముందుకు సాగనీయక అడ్డపెట్టుచుండినది. ఏదుపంది ముండ్లవలె నిక్కబొడుచుకొని ఈటెమొనలు గుఱ్ఱములను గారించుచుఁ విజయనగరభటుల దాపు సేరనీయక ప్రతిబంధకములైనవి. గడలబారునకు నాయకుఁడు గొడుగు వెంకన్న మొండి ధైర్యముతో మెండొడ్డి పైపై వచ్చు తురక రౌతులను గుఱ్ఱములపైనుండి త్రెళ్ళద్రోయుచు క్రిందఁబడిన వారిఁ నఱికి పొడుచుచుండెను. అతని శౌర్యమునుఁజూచి యుబ్బి యతనియనుచరు లతని ననుసరించుటచేత, తురకదళముల నడక పెండ్లినడయైనది. గజ్నఫరీ అలీఖానునకు కోపము వచ్చినది. అంతదనుక తురకపోటు రుచి యెఱుఁగని యాక్రొత్త రాయలను అసీరుచేసి తెచ్చెదనని సుల్తానుగారి నిండు దర్బారులో దా నాడిన ప్రగల్భ వాక్యములు వ్యర్థములై పోవునని భయముగలిగెను. ఒక్కపైద ఱవాను తనవంటి గడిదేఱిన శూరుని అడుగు ముందు పెట్టనీయక యడ్డగించిన తన పేరు ప్రతిష్ఠలేమి కాగలవు ? అని చింతించి సింగాణిరౌతులకు సెల విచ్చెను. విజయనగర భటులపై శరవర్షము గురియ నారంభించినది. క్రమక్రమముగ వారు వెనుకకుఁ జరుగ మొదలిడిరి. దానినిఁ జూచి తురకరౌతు లుత్సాహముతో ముందున కుఱుక ప్రయత్నించుచున్నను గజ్నఫర్ అలీకి తాను శత్రు లొడ్డిన వలయందు దగుల్కొంటి ననుసందేహము బొడమినది, శత్రు పరిజన భరితముగ నుండవలసిన స్కంధావారము నిశ్శబ్ద

ముగను నిర్మానుష్యముగఁ గానవచ్చుటయు, దన కొరకు చోట నిలిచి జగడము జూపక తిన్నగ నను క్షణమును లోనికిఁ దన్నెల యించుకొని పోవుచుండు నా శత్రువీరుని ప్రవర్తనయు నతని యనుమానమునకు ముఖ్యకారణములు.

శత్రుమర్మమును సత్వరము గనుఁగొనుట యుక్తమని నిశ్చయించి, సింగాణి రాతులకుఁ జేయి వీచి, తుపానునందు దగుల్కొనిన పడవపైఁబడు మగయలవలె గజ్నఫర్ అలీ యొక్క హుర్మత్తున వెంకన్నపై నుఱికెను. ఆ క్షణముననె వినవచ్చినది, యతనిఁ పింగలినుండి 'హరహర మహాదేవ' యను విజయనగర సింహనాదము. ఆ సింహనాదము శత్రుగర్భ నిర్భేదకమైనను వెంకన్నకు మృత్యుప్రాయమైనది. తన కార్యము జయప్రదముగ నెఱవేరె గదా యని జాగరూకత నొక క్షణము మఱచి వెనుదిఁగినాఁడు. వచ్చి గాడినది సింగాణి కోలహృదయమున. గ్రుక్కుమిక్కనక నేలఁగూలి రణశయ్య నలంకరించెను.

వెంకన్న స్వర్గారోహణమును కృష్ణరాయలు కన్నులఁ గాంచెను. రాయలవెనుక శ్వేతచ్ఛత్రమును చేఁబట్టి నిలిచి యుండిన వెంకన్నతండ్రి గొడుగు ప్రోలయ్యయు గనుఁగొనెను. ఏకపుత్రుఁడు, విద్యానిధి, శూరుఁడు, ప్రాణప్రియుఁడు వెంకన్న. అతని మరణము ప్రోలయ గుండెను చీల్చినది; వెంకన్నతో గూడ ప్రోలయప్రాణము స్వర్గసీమ కెగసినది ప్రోలయ చౌడోలునందు రాయలవెనుక మలచిపెట్టిన ఱాతివిగ్రహమువలె నిశ్చలుఁడై

నిలిచియుండెను; కదలలేదు; కంటఁ దడి వెట్టలేదు; ఊర్పలేదు; చైతన్యచిహ్నములే కానరాలేదు. దుఃఖముచే స్తబ్ధుఁడై శిలా సదృశుఁడై పోయినాఁడు; కాని యశనిపాతమునుఁబోలి పైకొని వచ్చుచుండిన విపత్తొక్కటి యాతని స్తంభనమును క్షణ మాత్రము దొలఁగించి చైతన్యస్ఫూర్తి గలిగించినది. నిర్జీవ ప్రతిమవలె నున్నవాఁడు గ్రమూర్తియై వెలుగొందినాఁడు. ఈ మార్పునకు గారకుఁడు గజ్నఫర్ అలీఖానుఁడు. రాయలు సైన్యముతో బ్రత్యక్షమైనంతటనె యతఁడు శత్రువుల మోసమును గ్రహించినాఁడు. తమ్ము భ్రమపెట్టి వంచించుటకొఱకు దాము వచ్చు మార్గమున నొక కైతవస్కంధావారము శత్రువులు నిర్మించినారు. అది రాయలవాస్తవశిబిరముగాదు; తమ్మెల యించుటకై తయారుచేసిన దీము. వంచన నెఱుఁగక తాము మాయశిబిరమును లూటిచేయఁ బోవుచుంటిమని యుప్పొంగు చుండఁగా మాటున దాగియుండు వేఁటకానివలె సమయము వేచియుండి రాయలు మార్కొన్నాఁడు. బళీ! రాయలలక్ష్మ రీతనము మెచ్చఁదగినదే. తాము అడకొత్తులోని పోకవలె శత్రువుమధ్య జిక్కుకొనిరి. తమకు రణమరణమో శత్రువులచే బందీకరణమో ధ్రువమని తెలిసికొన్నాఁడు; కాని గజ్నఫర్ అలీ ధైర్యమును గోలుపోలేదు. శత్రువులకుఁ దన ప్రాణమును నయముగ నప్పగించలేదు; సాహసమున కతఁడు పెట్టినది పేరు; తనకు రణమరణము దప్పనియెడల దనపేరును మహమ్మదీయ ప్రపంచము నందంతటను మారుమ్రోగింపఁజాలిన యసా

ధారణ సాహసకృత్యమును నెఱవేర్చి యసువుల నల్లా కొప్ప
జెప్పవలయునని నిశ్చయించుకొనెను. వెంకన్న చావువలన
ధైర్యముచెడి విజయనగరపుగడిలఫౌజు విఱిఁగి నలుగడల చెదరి
నది. రాయదళములందు కొంతకళవళముఁ గలిగినది. అది
సందుచేసికొని గజ్నఫర్ అలీ తనగుఱ్ఱమును ముందునకు నూకి
నాఁడు. అతనియుద్దేశ మిట్టిదని ఇతరు లూహించుటకు ముందె
గుఱ్ఱముపైనుండి లంఘించినాఁడు. రాయ లెక్కియుండు పుష్ప
దంతిగజము తొండమును బట్టుకొని బిరబిర పైకెగబ్రాకిపోయి
రెండుదంతములపై గాళ్లూని నిలిచి యొఱలోని ఖడ్గమునుదూసి
యొక్కవ్రేటున మావటిని దగనటికి క్రిందఁద్రోసి కుంభస్థలము
పై నెక్కి నిలిచినాఁడు. ఎడమచేత చౌకోలుచట్టమునుఁ బట్టు
కొని రాయల శిరమును వ్రేయ కుడిచేత ఖడ్గమును పైకెత్తి
నాఁడు. క్షణములోపల కత్తి రాయలపై వాలునట్లుండెను.
రాయలవారుగాక మఱిమూర్గురుశూరు లాచౌకోలునందుండి
రి. హఠాత్తుగ ప్రత్యక్షమృత్యుదేవతవలె బొడసూపిన గజ్న
ఫర్ అలీని జూడఁగనే వారు దిగ్భ్రమజెందిరి. బీరమునకు
వీడికోలిచ్చి యాత్మసంరక్షణమె పరమావధిగనెంచి వా
రార్గురును క్రిందికి దూకిరి. రాయలదేవుఁ డప్పుడేమి తలఁచెనో
చెప్పుటకు సాధ్యముగాదు; అతని శిరముపై విద్యుల్లతవలె
గజ్నఫర్ అలీఖడ్గము వ్రాలుచుండినది. ఇఁక తెప్పపాటు
కాలమున నతని చరిత్ర సమాప్తి యగునట్లు తోఁచినది. ఈ
ఘోరదృశ్యము దుఃఖముచే సొమ్మసిల్లియుండిన ప్రోలయ

యాత్మకుఁడై తన్నము కలిగించినది రాయలవిపత్తును గ్రహించి నాఁడు. కుడిచేతనుండినది నేజా. చేయి వెనుక కెత్తి సగ్గువ కొలఁదియు గుమ్మినాఁడు గజ్నఫర్ అలీ బొమ్మమీఁద. నిశ్చలుఁడై యుండిన గొడుగు మోపరివలన నెట్టి యపాయము కలుగునని శంకింపకుండుటచే గజ్నఫర్ అలీ తప్పించుకొనుటకే ప్రయత్నము సేయలేదు. అశనిఘాతవలె దాఁకిన నేజాయురవడికి నిలువరింపఁజాలక కుంభస్థలముననుండి క్రిందికి దొర్లెను. ప్రోలయ మొదలుపెట్టిన కార్యమును ముగింప దలకొన్నట్లు పుష్పదంతము క్రిందఁబడిన గజ్నఫర్ అలీ శరీరమును తొండముచే గబళించి మీఁదికెత్తి నేలఁ జఱచి యతనిబొమ్ముపై గాలిడి చిదుగఁ ద్రొక్కెను. తక్షణమే మ్రోగినది జయభేరి. మావటివాఁడులేని యేనుఁగునుండి రాయలవారు క్రిందికిఁ దూకిరి. ప్రోలయయు చక్రవర్తి ననుసరించి దిగెను.

గజ్నఫర్ అలీ మరణమందినను యుద్ధమాగలేదు. అతనిక్రింది సర్దారుడు నాయకత్వమువహించి తురకరౌతులను గయ్యమునకు బురికొల్పెను. కాని వారు మునుపటివలె గుండె దిటవుగలిగి పోరలేదు. అప్పటికి రాయసైన్యమా కైతవస్కంధావారమును జుట్టుకొనెను. క్రమక్రమముగ నర్ధచంద్రుని శృంగములు రెండును నిడుదలై యొండొంటిని సమీపింపఁగడగినవి. తురకరౌతు లటమీఁద పోరుట వ్యర్థమని యెఱిఁగి యాయుధములను దిగవిడిచి తలపాగల నూడ్చి మెడలచుట్టు దండలుగ వేసికొని శరణు వేడిరి. రాయలవారి యాజ్ఞ చొప్పున రణవాద్యాధ్యక్షుఁడు ధర్మదారనుఁ బట్టెను.

యుద్ధకార్యము ముగిసినది. నిజసైనికుల స్థితిగతుల స్వయముగ బరిశీలించి కనుఁగొనుటకు కృష్ణదేవమహారాయల వారొక్క పర్యాయము పాలికలను కలయఁ జూచిరి. విశేషము నష్టముగాలేదు. దాదాపు రెండువేలమంది మడిసిరి. వారియందు జాలభాగము గడలవారే. వెంకన్న యొక్కఁడుదక్క పేరుగల నాయకుఁ డెవ్వఁడును ప్రాణముల గోల్పోలేదు. రక్తసిక్తమైన యతనిదేహమును జూడఁగనే రాయలవారికి జాలి గలిగినది. పసివాఁడు. ఇంకను జక్కగా నిఱువదియేండ్లు దాటలేదు కాని ఎట్టి పరాక్రమశాలి! పెద్దవాఁడగునంతవఱకు దేవుఁడు కన్నులు మూసికొనియుండిన సమకాలిక దళనాయకులలో నగ్రస్థానమును వహింపఁదగినవాఁడు. అంతటి చిన్నతనముననె స్వర్గకాంతలతని నాచికొనిపోవుట శోచనీయము. అని చింతించి యతని యంత్యసంస్కారము సేయుటకును నతనికీర్తిని ప్రకటించు వీరశిలను నిలుపుటకు దగుశీర్పాటులనుఁ గావించెను; గాయపడిన వారినిఁ గని వారి శౌర్యమును బ్రశంసించి, వారిని కట్లుకట్టి చికిత్ససేయుటకు వ్రణవైద్యుల కడ కంపెను. వారి నందఱిని రణభూమినుండి స్కంధావారపు టారోగ్యశాలకుఁ గొనిపోవు వఱకును నచటనేయుండి యటుపిమ్మట తన విడిదలకుఁ జేరెను.

* * * *

మధ్యాహ్నమైనది. మజ్జన భోజనాదుల కవసరమని వేత్రహస్తులు విన్నవించిరి. మజ్జన భోజనాదులైనపిమ్మట రాయలవారభ్యంతర గుడారమున నించుక విశ్రమించిరి.

సాయంసమయమున వెలిగుడారమునఁ గొలువు దీరిరి. యథా ప్రకారము రాజచిహ్నధారులైన యూడిగమువారు రాయ పీఠమును బొదివి నిలిచియుండిరి. ప్రోలయ వారియందు కాన రాలేదు. అతనిస్థానమున యువకుఁడొక్కఁడు శ్వేతచ్ఛత్రమును బట్టుకొనియుండెను. రాయలవా రామార్పును గమనించినట్లు లేదు. పీఠముపై నాసీనుఁడైనవెంటనే రాయసకుఁవారు తెచ్చి సముఖమున నుంచిన జయలేఖల ముదల (డ్రాఫ్ట్) లందు నూతనాంశములను జేర్చి యొప్పములులిఖించి యేయేరాజులకు, సామంతులకు, నాయకులకు, దుర్గాధిపతులకు వానినిఁ బంపవల యునో తెలియఁజేసెను. రాయలవారి విజయమును విని తమ యభినందనమును తెలుపుటకు సమీపస్థులగు మన్నె దొరల మంత్రులతో నుచితరీతిని సంభాషించి వారి యంతస్తులకుఁ దగిన రీతిని సత్కరించెను. అవసరముల వారదుగదుగునకుఁ బ్రవేశించి రాయదర్శనార్థము వచ్చిన వారి కవసరము కలదేమో విచారిం చుచుండిరి. నింపోలగమున కొలువుదీరి కార్యనిమగ్నుఁడై యుం డినను మాటిమాటికిని రాయదేవుని దృష్టి ద్వారము వైపు పాఱుచుండినది. రెండుగడియల కాలముఁ గడచిపోయినది. కొలువు లేచు సమయమైనది. ప్రవేశించినాఁడు కట్టియము వాఁడు. ' అవధారు మహారాయా, ఆదెప్పదండనాయకునిఁ శిబి రమునుండి హరకారవచ్చి హజారమున నిలిచియున్నాఁడు. ఏలినవారి యాజ్ఞయైనఁ దోడ్కొనివచ్చెదను' అని నివేదించెను. 'తక్షణము బ్రవేశపెట్టుము' అని రాయలదేవుఁ డాజ్ఞాపించెను.

'చిత్తైను, దేవా' యని కట్టికమువాఁడు ద్వారమునకుఁబోయి హరకారతో మరలివచ్చెను. హరకారా రాయలవారి పీఠము ముందు సాష్టాంగపడి లేచి చెప్పఁదొడఁగినాడు, "రాజాధిరాజ రాజపరమేశ్వరా, పరాకు. రాయలదేవుని యానతి చొప్పున సర్వశిరః ప్రధాన తిమ్మరసయ్యగారి మొదలను ఆదెప్పదండ నాయకులవారు త్రియంబకరావు, రాచిరాజు తిమ్మయ, మట్లి వరదరాజు, నంద్యాల నారపరాజు, అవుకు తిమ్మరాజు మొదలగు దొరలతోఁగూడ రాత్రికిరాతిరే కూచిచేసివచ్చి కృష్ణ కవ్వలి యొడ్డునఁ గడిసియుండిన బెడదకోట దండుపైఁబడి నఱికి నిర్మూలముఁగావించినారు. హతశేషులు యథాయథలై పాఱిపోయి నారు. తురకల శిబిరమును వస్తుసామగ్రి సర్వమును స్వాధీనమైనవి. ఏలినవారి యాజ్ఞకొఱకు వేచియున్నారు" అని.

కృష్ణరాయల కీసందేశ మపరిమితానందముఁ గలిగించినది ఇది తురకలపై రాయలవారి తొలివిజయము. వారినంత టితో వదలిపెట్టి వెనుదిరుగుట కాయన కిష్టములేదు. కావున హరకారానుఁజూచి యాజ్ఞాపించినాఁడు: 'తడవుసేయక సైన్యముతోఁగూడ పాఱిపోవుచుండు తురకలను వెంబడింపుమని మాయాజ్ఞ. రేపు సర్వదళములతో మేమువచ్చి కలసికొని యెదము' అని. హరకారా వెంటనే బయలువెడలి పోయి నాఁడు.

రాయలవారు ఆనతిచ్చినారు. 'మనజైత్రయాత్ర శుభముహూర్తమున ప్రారంభమైనది. రెండుజయములేక కాలమున

జేకూడినవి. ప్రాణాపాయము దైవికముగఁ దొలఁగిపోయినది. శూరరత్నము నొక్కనిఁ గోలుపోతిమి. ఒరగల్లు ఇత్తడి బంగారముల భేదమును దెలియఁబఱచినట్లు శూరమానులకును శూరులకునుఁ గల వ్యత్యాస మందువలన విశదపడినది. ఆయుధోపజీవుల కివి సామాన్యమైన యనుభవములు. రేపటి యుషఃకాలమున బెడదకోటపై కూచి సేయవలసియున్నది. నాయకులు దొరలు మున్నగువారు తమతమ మందితోఁ బయనమునకుఁ సిద్ధపడవలయును. మనకిది జయకాలము. శుభశకునము లెన్నియేనియు గానవచ్చుచున్నవి.'

రాయలవా రంతట గొలువుచాలించి శిబిరాభ్యంతర మంటపమునకు పోయిరి. దండనాథ సామంతమాండలికాది సేనాప్రముఖు లెవ్వరెవ్వరి విడిదలకు వారు తరలిరి.

శిబిరాంతర్భాగమున తివాసిపై నొరుగుబిళ్ళలమీఁదఁ జేరగిలి యోచనాపరుఁడై యొంటరిగఁ గూర్చుండి యుండినాఁడు కృష్ణదేవరాయలు. అంగరక్షకు డొక్కఁడు ప్రవేశించి రాయలవారు పరధ్యానముగ నుండుటనుఁజూచి యొక క్షణ మాగెను. రాయ లంతట మొగమెత్తి చూచెను. వెంటనే వాఁడు 'దేవా! అవధారు. ప్రోలయ్యగారు ఆరోగ్యశాలయం దున్నారు. ఏలినవారి యాజ్ఞప్రకారము వచ్చి తమ దర్శనముఁ జేసికొనగల స్థితియందు లేరని చెప్పినారు వైద్యులు.'

'ఆరోగ్యశాలయందున్నాఁడా? జాడ్యమేమి?'

'చిత్తము. యుద్ధమునుండి జ్వరపీడితులై మరలివచ్చి నారఁట. ప్రజ్ఞ స్వాధీనమున లేదఁట. నోటికి వచ్చినట్లు వదరుచున్నారఁట.'

౯

అస్తమయమయి కొంతసేపయినది. స్కంధావారమున సద్దణఁగినది. అచ్చటచ్చట వెలుఁగుచుండిన వెలుతురు కట్టెల జ్వాలలు చుట్టుపట్ల చీఁకటిని సాంద్రతరము సేయుచుండినవి. గస్తీ తిరుగుపహరా సిపాయీలు దప్ప తక్కిన వారందఱును చలిగాలి తాకునకు తాళఁజాలక డేరాలలోపలను గుడిసెలయందును నెగిడుల చుట్టును ముడుగుకొని కూర్చుండి యుద్ధవృత్తాంతమును, శూరుల సాహసకృత్యములను, దమ ప్రియురాండ్ర ప్రేమాతిశయములను దలపోసికొనుచుండిరి. ఆ చీఁకటియందు కృష్ణరాయలు శిబిరమును వదలి యొంటరిగ స్కంధావారమును పరిశోధించి చూచుటకు వెలువడిరి. అలికిడి గలుగనీయక మెల్లఁగ నడచుచు పహరావారు సమీపమునకు వచ్చునప్పుడు గుడిసెల నీడలను డేరాలచాటునను డాగుచు స్కంధావారమునం దాయపట్లను బరిశీలించిచూచి తుద కారోగ్యశాల కడకువచ్చిరి. వాకిట మండుచుండిన వెలుతురుకట్టె తెగగాలి మలిగిపోయియుండినది. వాకిటఁ గావలియుండిన కావలివాఁడు నేజా మొనను నేలనాటి గడను గడ్డము క్రింద నూనుకొని నిలిచి యట్లే నిదురించుచుండెను. రాయలవారు చప్పుడు

నేయక ఆరోగ్యశాలయందు ప్రవేశించిరి. అది విశాలమైన బందారాకుల పర్ణశాల. దాని మధ్య వెలుఁగుచుండిన పంజు ముంట గాలియం దల్లలనాడుచు నీడలచే నాశాలయందు బొమ్మలాట నాడించుచుండినది. రోగులు కొందఱు నిద్రించుచుండిరి. వ్రణితులు గాయముల బాధను సహింపఁజాలక అడుగడుగునకు తలిదండ్రులను స్మరించుచు మూల్గుచుండిరి. ఒకమూలనుండి యెవ్వఁడో తనలో దాను మాటలాడుకొనుశబ్దము వినవచ్చుచుండినది. రాయలవారు తిన్నగ మాటలసడి ననుసరించి మాటలాడుచుండిన వ్యక్తిని వెదకుకొనిపోయిరి. ఒకమూల క్రింద పఱచిన కంబళిపైఁబడి పొరలుచు పనవుచుండినాఁడొకరోగి. 'నాయనా, వెంకన్నా, పోయినావటయ్యా స్వర్గమునకు మమ్మందఱిని వదలి. మీయమ్మ వెంకన్న యేడి యని యడిగిన నేమి జవాబుచెప్పగలనయ్యా. నా వెంకన్నా, పోయినావటయ్యా స్వర్గమునకు. ఎల్లపుడును చిరునగవుతో వికసించియుండు నీ చిన్నిమోము పుడిసెడు బూడిదయైపోయినదా' యని వెక్కివెక్కి యేడ్వదొడఁగెను. రాయలవారు గుర్తించినారు అతఁడు ప్రోలయ్యయని. ఓదార్పవలయునని నోరు దెరచినారు. మాట నోటనుండి ఇంకను వెలువడలేదు. ఇంతటనె, వికటమైననవ్వు నవ్వినాఁడు ప్రోలయ: 'ఏమేయ్, రా, రా' నాప్రక్కగూర్చుండుము. నేను పొరపడినాఁడను. మన వెంకన్న. మన వెంకన్నే. విన్నావా ? మృతినందలేదు. బ్రతికియేయున్నాఁడే. వాఁడుగోనే వచ్చుచున్నాఁడు చూడు'అని సగము

లేచి చేతులను జోఁచి చూచి, మరల పడకపైఁబడి, 'రావోయి, నాయనా, రా. నీవు చచ్చితివని చాలవ్యథపడితినయ్యా. ఆ తురకవాని నెంతచక్కఁగ నాట్యమాడించితి వయ్యా. రాయ దేవుఁడు మెచ్చుకొన్నాఁడయ్యా. అయ్యో, దాహము, దాహము. బొడ్డుదగ్గరికి యీడ్చుకొని పోవుచున్నదినాలుక. దాహామే దాహము ఎవ్వరును లేరా?' యని యాక్రందనము సేయఁ గడగినాఁడు. రాయలవారికి జాలిపుట్టినది; నీళ్లెచటనేనికలవా యని పాఱజూచినారు. ఎక్కడను కానరాలేదు. కోపము వచ్చినది రాయలవారికి. ఒకయడుగు పెట్టినారు ద్వారమునకుఁ బోయి పహరావానిని నీరు దే బంపుటకు. అడుగుల సడి విన వచ్చినది. రాయలవారు పడుకవైపు దృష్టిని మరల్చినారు, రోగియే లేచిపోవుచున్నాఁడేమో చూచుటకు. రోగికాదు, పది హేను పదహారేండ్ల కుఱ్ఱవాఁడు చేతి మ్రానిముంతలోని తీర్థము గొంచెంగొంచెముగ ప్రోలయనోటఁ బోయుచుండినాఁడు. వాని దృష్టియంతయు రోగియందు లగ్నమై యుండినందువలన సగము చీఁకటియందు నిలిచియుండిన రాయలవారిని వాఁడు చూడలేదు. రాయలవారును వానిని హెచ్చరించుకొన లేదు. ప్రోలయకు దాహము తీరినది. చేతితో మ్రానిముంతను దొలఁగ ద్రోసినాఁడు. అంతట నాకుఱ్ఱవాఁడు ప్రోలయ ఱొమ్ముమీఁద జేయివెట్టి చూచినాఁడు; తరువాత కుడిచేతినిబట్టుకొని ధాతువు పరీక్షించి తల యూచినాఁడు. పిమ్మట మ్రానిముంత నెత్తుకొని మరలిపోవుటకు బ్రయత్నపడుచుండఁగా రాయలవారడిగినారు.

'అబ్బాయీ, ఇతఁ డేస్థితియందున్నాఁడు.' అని. చీఁకటిలో నుండి తటాలున వినవచ్చిన వాక్కు చెవిసోకఁగనే వాఁడు తెల్ల వోయి బిత్తరపుఁజూపుల నలుగడల జూచినాఁడు. మసకచీఁకటి యందు నిలిచియుండిన రాయలవారిపై వానిదృష్టి పాఱఁగనే, 'రాయదేవుఁడు, రాయదేవుఁడు' అని యఱచుచు బరువిడఁ బూనెను. కాని, జ్వరతాపముచే నవ్యవస్థచిత్తుఁడై యుండిన ప్రోలయ 'వెంకన్నా, వెంకన్నయ్యా, నన్ను విడిచిపెట్టిపోవల దు, పోవలదు. నాయనా, పోవలదు. నాప్రక్క కూర్చుండు మయ్యా' అని బతిమాలుచు చేయిపట్టుకొని కదలనీయక నిలువఁబెట్టెను. కాని రోగుల మన స్తత్వము నెఱుఁగజాలని యా బాలుఁడు. 'నేను నీ వెంకన్నను గానయ్యా, నన్ను వదలిపెట్టు. నేను ప్రాణాచార్య లక్ష్మణ పండితుల శిష్యుఁడను. నీకు మంచి తీర్థమును ద్రాగఁబెట్టి నీస్థితిని కనుగొని రమ్మని పంపినారు. నేనుపోయి నీస్థితిని వారికిఁ దెలియజేయవలయును' అని పట్టు వదల్చుకొన బ్రయత్నము జేసినాఁడు; కాని ప్రోలయ వాని మఱింత దృఢముగ బట్టుకొని యడిగినాఁడు.

'నీవు నావెంకన్నవుగావూ! ఎందుకూ ఈకల్ల బొల్లు మాటలు? నీవుగాకపోయిన నావెంకన్న ఏమయిపోయినాఁడు?'

'నీ వెంకన్న ఈ యుద్ధయములో జనిపోయి యుండ లేదటయ్యా?'

యుద్ధపుమాట చెవిసోఁకగనె ప్రోలయ బుద్ధి వేఱు మార్గమునఁ బడినది. రణదృశ్యము కన్నులముందు పొడకట్టి

నది. తాను కన్నులఁగాంచిన దానిని మాటలచే విశదీకరించు నట్లు పలవనారంభించినాఁడు మరల. 'అవునవును, నిజమే. అదుగో, గడలఫౌఁజు మొన నిలిచి తురకరౌతులను దకపిక లాడించుచున్నాఁడు. ఓయ్, వెంకన్నా, వెంకన్నా, సింగాణి కోల, సింగాణికోల జాగ్రత్త. అయ్యయ్యో నాటినది సింగాణి కోల గుండెపై. కూలినాఁడు నా వెంకన్న కూలినాఁడు. అయ్యో, అయ్యో......' అని బిగ్గరగ నేడువఁగడఁగినాఁడు. ఏడ్చియేడ్చి సొమ్మసిలి పడకమీఁద నిశ్చేష్టితుఁడై వ్రాలినాఁడు. ఈసంరంభములో పట్టును వదలినాఁడు ప్రోలయ. అదియె సమ యమని ప్రాణాచార్యుల శిష్యుఁడు తొలఁగి దూరముగ నిలిచి, 'రాయదేవా, పరాకు. ఇతనికి జన్ని యతిశయమగు చున్న ట్లున్నది. మాగురుదేవులతో విన్నవించి వారినిఁ దోడ్కొని వచ్చెదను' అని విన్నవించెను.

'వేగిరమే తోడ్కొని రమ్ము' అని రాయలవారు సెల విచ్చిరి.

ఆ బాలుఁడు ఆరోగ్యశాలనుండి వెడలిపోయినాఁడు. కొన్ని క్షణములైనవి. ప్రాణాచార్యుఁడుగాని యతని శిష్యుఁడు గాని ఇంకను మరలిరాలేదు. మరల నారంభించినాఁడు ప్రోలయ. పలవరించుటకు: 'ఛీ. తురకభండాలుఁడా! రాయదేవునిమీఁద నట్రా కత్తిని దూసెదవు? ఇదుగోరా, ఇదుగో, నానేజాపోటు హాఁ'యని యావచ్ఛక్తిని వినియోగించి హుంకరించినాఁడు. ఆ హుంకారము ప్రోలయ సత్వమునంతటిని హరించినది.

మూర్ఛిల్లినాఁడు; కాని క్షణమాత్రమున దెప్పిరిలి, నాయనా, అబ్బాయీ' అని పిలిచినాఁడు. జవాబు లేదు. 'పంకవ్రా, ఓయ్ ప్రాణాచార్యుల శిష్యుఁడా, నిన్నే నోయి' అని కేక వసినాఁడు. రాయలవారు అతని సమీపించి అడిగినారు 'ఏమి ప్రోలా, ఏమి కావలయును ?' అని.

'ఏమియు లేదు. నేను చనిపోవుచున్నాను.'

'మాట్లాడవలదు. నీవు చావవు నీకు భయము లేదు.'

'నన్నెందుకబ్బాయీ మాయజేస్తావు? విను. నాకొక కోరికపుట్టినది. అది తీరని కోరిక.'

'చెప్పుము.'

'ఎవ్వరె నను వినిన తలపోవు కోరిక.'

'అంతటి చెడుకోరికయా?'

'అవును. కాని చావఁబోవు వానికి నాకేమి భయము?'

'అవును. నిశ్చయముగఁ జావఁబోవుచున్న భయపడవలసిన యవసరము లేదు.

'కాని నేను చెప్పిననేమి లాభము ?'

'చెప్పినందువలన లాభమును లేదు ; చెప్పకపోయిన నష్టమును లేదు'

'అట్లనవలదు. చెప్పినందువలన మనసులోని బరువు తగ్గగలదు. ఆత్మసంతృప్తియు గలుగును.'

'అయిన చెప్పుము.'

'దగ్గరకు రా. నాకు ఒకపూట రాయసింహాసనము నెక్కవలయునని యున్నది.'

రాయలవారికిని ప్రోలయకును ఈ సంభాషణ జరుగుచుండఁగా ప్రాణాచార్యులవారు శిష్యునితోఁగూడ నచటికి

వచ్చిరి. అత్యంతశ్రద్ధతో ప్రోలయ మాటల నాలకించుచుండి నందువలన రాయలవారు వారిరాకను గమనింపరామెను. ఏలిన వారి యేకాంతమునకు భంగము గలిగింపరాదని వారును నిశ్శబ్దముగ రెండుమూఁడుబారల దూరమున నాగి యుండిరి. కాని ప్రోలయ కోరికను విన్నంతనే, ప్రాణాచార్యుల నోటినుండి వెలువడినవి, 'దేవా, అతనిమాటలు వినవలదు. జ్వరతాపము వలన నతనిచిత్తము స్వాధీనముఁ దప్పి పరుగులిడుచున్నది. వ్యాధిపీడితుఁడు వెఱ్ఱివాఁడు' అను మాటలు. హఠాత్తుగ విన వచ్చిన ప్రాణాచార్యులమాటలు రాయలవారికిఁ గొంచెము గగురుపాటును ఆయాసమును గలిగించినవి. ప్రోలయ సంభాషణను చాలించినాఁడు. పలుకలేదు. అతని హృదయము నెఱుఁగ గోరి మరల నడిగినారు, 'ఏల నీకీ విపరీతపు కోరికఁ గలిగినది.' అని. జవాబులేదు.

'చెప్పవూ ?'

'జవాబులేదు.'

'ఏమి ప్రోలా, చెప్పరాదూ ?'

'అబ్బాయీ, నాకు దాహమెత్తుచున్నది.'

ఇఁక నతనినిఁ గుచ్చి యడిగిన లాభములేదని గ్రహించినారు రాయలవారు. కాని యప్పుడె వారి మనస్సున బొటమరించినది, అతఁడేల వజ్రసింహాసనము నెక్కఁగోరినాఁడో కనుఁగొనవలయునను ఇచ్ఛ. సాధారణముగ మనస్సున నిక్షిప్తములై దాగియుండు విషయములు జ్వరవలనగలుగు చిత్తవైపరీత్య స్థితియందు విశృంఖలముగ వెలువడుచుండునని వారెఱుఁగుదురు కావున నే మార్గమునకైనను వాని రహస్యమును గనుఁగొన వలయునని నిశ్చయించి ప్రాణాచార్యుల వంకదిరిగి,

'ఇతఁడు మాకు నమ్మినబంటు; ఆచార్యులవారు యావచ్ఛక్తిని వినియోగించి యితని ప్రాణమును సంరక్షింపవలయును' అని యాదేశించి యారోగ్యశాలనుండి వెడలిపోయెను.

* * *

ప్రోలయకు నాలుగైదురోజులపర్యంతము జాడ్యము తిరుగలేదు. జ్వరవిముక్తుఁడై పథ్యము సేవించుటకు పక్షము దినములు పట్టినవి. ఆ నెలలోపల పెక్కు ఘనకార్యములు నడచినవి. కృష్ణదేవరాయలు స్వయముగ దండు నడపించు కొని తురకలను వెన్నంటి తఱుముచు కోవెలకొండ పర్యంతము బోయిరి. కోవెలకొండ కనతిదూరమున దొమ్మియుద్ధము జరిగెను; రాయలవారికి మరల జయము చేకూరెను; తురక దునేదారులలో మేటి, బిజాపురాధిపతి, యూసుఫ్ ఆదిల్ఖానుఁడు మడిసెను; రాయలవారటుపిమ్మట తన యమీరులచే బందీ కృతుఁడైన బహమనీ సుల్తానుని యతని పదమున పునఃప్రతిష్ఠితుని సేయుటకు కలుబరిగెపైఁ దాడివెడలెను. ఒకనాఁడు కోవెలకొండ రణక్షేత్రమున వ్రణితులఁ దోడ్కొని లక్ష్మణ పండితులవారు స్కంధావారమునకు వచ్చిరి. వారికి తావు సేయుటకై స్వస్థతనొందిన రోగుల స్థితిగతుల నరసి యారోగ్యశాలనుండి వీడుకోలిచ్చి యంపవలసివచ్చెను. కొందఱికి కొంతకాలము విశ్రాంతి యవసరమనియు, వారు తమ నెలవులకుఁబోయి యచట కొన్నాళ్ళుండి యావల దండును గలిసికొనుట యుక్తమనియు జెప్పిరి. మఱికొందఱను వారు వెంటనే సైన్యమును పోయి చేరవచ్చునని చెప్పి పంపిరి. అందఱును ఆరోగ్యశాల నుండి వెలువడినపిమ్మట ప్రాణాచార్యులు ప్రోలయస్థితిని విచారింపఁ గడఁగెను, 'ఏమి ప్రోలయా, ఆరోగ్యమెట్లున్నది?' అని.

'ఆచార్యస్వాములవారి ఋణమును నేనెట్లు తీర్చుకొనఁగలనో? నాపాలిటి బ్రహ్మలై స్వామివారు నాకు ప్రాణదానముఁ జేసి పునర్జన్మముఁ గలిగించినారు'

'నాదేమున్నది, నాయనా? దేవుఁడిచ్చిన గోటెడంత ఆయువు గట్టిగనుండిన వైద్యుఁడనదయైనను నేర్పరి కాఁగలఁడు. ఆ యాయువు లేకపోయిన నెట్టిఘనవైద్యుఁడైనను నుపయోగహీనుఁడగును. కాని నీ విషయమున నాపని 'యందని పూక యెత్తును నగస్త్యుఁ డాకయెత్తు' ననిన ట్లయినది.

'స్వామివారు సెలవిచ్చినట్లు నాస్థితి బహుదుస్తరమై యుండెనని తోడి రోగుల మాటలవలన దెలిసికొంటిని; కాని నేనట్లే మృతినందఁ బోవుట శోచనీయము.'

'నీ వ్యాధి దుస్తరమైనదే; కాని నేనన్నది వ్యాధిని గూర్చి కాదు. ఏలినవారి యాజ్ఞయైనది నీ ప్రాణము నెట్లయిన సంరక్షింపవలయునని. నా వైద్యము వ్యర్థమైన ఏలినవారేమనుకొనెదరో యను భయ మెప్పుడును నన్ను తహతహపెట్టుచుండెడిది. భగవత్కృపవలన నీకు స్వస్థతగలిగినది. ఏలినవారి యాజ్ఞ నెఱవేర్పఁగలిగినందులకు సంతసిలుచున్నాఁడను.

'అల్పుఁడగు నీయూళియముపై నేలినవారి కంతటి యనుగ్రహముఁ గలిగినదా? ధన్యాత్ముఁడను.'

'ధన్యాత్ముఁడవే పోలయా నీవు; కాకున్న స్వామివారు స్వయముగ నెవ్వర యారోగ్యస్థితి నరయుటకైన నారోగ్యశాలకు విచ్చేసియున్నారా? వచ్చి యసంబద్ధప్రలాపములను విసయు సైఁచియున్నారా?'

'అసంబద్ధప్రలాపములా స్వామీ? నా నోటినుండి వెలువడినవా?'

'అవును. లేనిది చెప్పుదునా?'

'మన్నింపవలయును స్వామీ. నే నేమంటిని? ఏలినవా రెప్పుడు విచ్చేసిరి? నా కేవిషయ మేమియు తెలియదు. నా కెవ్వరును దెలుపలేదే?'

'ఎవ్వరు నెఱుఁగరు. రాత్రి నిశీథము గావచ్చుచుండినది. నీకు ఆరాత్రి జ్వర ప్రారంభమైనది. నోటికివచ్చినట్లు వదరుచుంటివి. విపరీత వాక్యముల నాడుచుంటివి.'

'ఏమంటిని స్వామీ?'

'రాయసింహాసనము నెక్కఁగోరితివి.'

'నిజమా స్వామీ?'

'రాయలదేవుఁడు సాక్షి.'

'అయ్యో. యెంతటి యపరాధము, ఎంతటి యపరాధము! ఏలినవారి యాగ్రహమునకు పాత్రుఁడనైతిని. ఒడలెఱుఁగకపోయినది.'

'మఱి నీ కా కోరిక ఏల కలిగినది?

'ఎట్లుచెప్పఁగలను స్వామీ? రాయదేవుని సముఖమున కెట్లు పోఁగలను? అయ్యో ఎంతటియపరాధమొనర్చితిని?'

'భయమువలదు. రాయలదేవుఁడు వెఱ్ఱిమాటలని నవ్వుకొనిరి.'

'వాస్తవమా స్వామీ, వాస్తవమా? ఏలినవారి పాదములఁబడి క్షమింప వేఁడుకొనియెదను. నాకనుజ్ఞ దయచేయుఁడు.'

'వేగిరపడవలదు. విజయనగరమునకుఁ బోవలయు నని స్వామివారి యాజ్ఞ.'

'సముఖమునకు రాకూడదని ఏలినవారి యభిప్రాయముఁగాఁబోలు.'

'కాదు ప్రోలయా. ఇంటిపట్టున గొన్నాళ్లు విశ్రాంతిని పొందవలయునని.'

౧౦

'విశదమైనదా కొండమరసయ్యగారూ, గొడుగు మోపరిశూరుఁడని' అని అడిగినారు సర్వశిరః ప్రధాని తిమ్మరసయ్యగారు.

'చిత్తము.'

'రాయదేవులవారి ఉచితజ్ఞతనుఁ గూర్చి మీకింకను సంశయము గలదా?'

'విషయ మెఱుఁగక సంశయమందితిని. గొడుగుమోపరి ఇట్టి దిట్టయని తెలియక అతఁడు కొంచెగాఁడనుకొంటిని. రాయదేవులు అర్హత నెఱిఁగియే సత్కరించినారు.' ధర్మయ్యగారందుకొని చెప్పినాఁడు: 'సర్వశిరః ప్రధానులవారు విశదపఱచిన ప్రోలని పరాక్రమ గాథవలన నతఁడు శూరుఁడనుట తెల్లమగుచున్నది. కాని——'

'కాని?'

'అల్పభృత్యుని రాయపీఠ మెక్కించుట నాకు నీతియని తోఁచదు.'

అంతవఱకు మాటలాడక వినుచుండిన పెద్దనగారు "రాయలదేవుని కృత్యము నీతిబాహ్యమని చెప్పరాదు. 'అనఘా నీ ప్రస్తవమున నసు నీల్గిన పింఛభటుల యను పోష్యుల బ్రోతె?' యను నారదులవారి వాక్యమును వినలేదా? ప్రోలయ కుమారుఁడు వెంకన్న రాయలవారి ప్రస్తవమున మృతినందెనుకదా. ప్రోలయ రాయలవారి ప్రాణమును సంరక్షించి

నాఁడు. ప్రాణదాత కీరాని యర్థ మేదికలదు? కావున రాయల వారి సత్కారము నీతి సమ్మత మగునుగాని విరుద్ధముగాదు' అని వచించెను.

'బాగు, బాగు; మహాకవీ. చక్కఁగఁబల్కితిరి' అని తిమ్మరసయ్యగారు ప్రశంసించి ధర్మయ్యగారి నడిగినారు, 'భృత్యు లొనర్చిన సేవకు మెచ్చుకొని సత్కరించు వేళ వారి కులగోత్రములను ఏలినవారు పరిగణింపవలయునని తమ యభిప్రాయమా ధర్మయ్యగారూ? రాయపీఠము నెక్కినవారికి గొంచెపు బుద్ధి పుట్టదు. అది విక్రమార్కుని పీఠ మను విషయము మరచితిరా? ఎట్టి యల్పులెక్కినను మహోదారగుణము వారి హృదయమునం దంకురించును.'

'నాయభిప్రాయ మది కాదు. అంతస్తునకుఁ దగినట్లు భృత్యులను సత్కరించుట యుక్తమని యెంచితిని; కాని మహాకవి పెద్దనగారి వాక్యములవలన నాసంశయము బాసినది. సర్వశిరఃప్రధానులవారి యనుజ్ఞయైన ధర్మశాసనములను వ్రాయించెదను.'

'ఒకక్షణ మాగుము, మఱియొక కార్యము గలదు.'

'చిత్తము.'

'మహాకవీ, తమ యిచ్ఛయేమి?'

'చిత్తము. సర్వశిరః ప్రధానులవారి యభిప్రాయము దురూహ్యముగ నున్నది.'

'రాయలవారి యాజ్ఞయైనది, నిరుపమ ప్రతిష్ఠలాదులను తమరు కోరినరీతి నేర్పాటు సేయవలయునని.'

'కూ - యనిన కోటికవులు వత్తురని యంటిరే? ఆ కోటిలోని సామాన్యునికీ గౌరవమేల?'

'తమరు సామాన్యులని యెవ్వరనిరి? రాయలవారి గుణగ్రహణపారీణత యసాధారణ మైనదని విశదపఱుచుట కట్లంటిని. గాజుపూసయు జాతిరత్నమును సామాన్యుల దృష్టి కొక్క రీతిని గానవచ్చినను రత్నపరీక్షకుఁడు వానిభేదమును గుర్తింప గలిగినట్లు రాయలవారు మముబోంట్లవలెగాక తమయతిశయము గ్రహింపఁగలిగిరి.'

'చిత్తము.'

'మఱి తమ ఇచ్ఛ?'

'గ్రాసవాసంబులకుఁ వసతి గలిగించినఁ జాలును.'

'తమ యభీష్టమును డెల్లముసేయుఁడు.'

'చిత్తము. పినాకితీరమున మహారమణీయమైన కోకట మను...'

'ధర్మయ్యగారూ, కోకటగ్రామమును రాయలదేవుఁడు మహాకవి పెద్దనగారికి సర్వమాన్యముగా నగ్రహారీకరించి ప్రసాదించి నట్లొక తామ్రశాసనము తయారుసేయింపుఁడు.'

'మఱి?'

'హాలికులైన నేమి యని యడిగితి రే?'

'అవునవును. తమ కిష్టముగల దేని కోకటమున దామును హాలికులగుటకు ఆటంక ము డదు.'

అందటు నవ్విరి. ధర్మయ్యకొండమరసయ్యలు వెడలి పోయిరి. తిమ్మరసయ్య పెద్దనగారిని కొంతదూరము సాగనంపి వెనుదిరిగిరి.

# టిప్పణము

ఆకల్ = తెలివి

అఖ్తర్ = నక్షత్రము.

అఖ్తర్ షుమార్ = నక్షత్రములను లెక్కించువాఁడు, జోస్యుఁడు.

అగాడీపీఛాడీ = గుఱ్ఱము ముందటికాళ్లకును వెనుకకాళ్లకును కట్టు త్రాళ్లు.

అజీమత్ = వశపడు.

అనుఁగు = మిత్త్రుఁడు. రాజపరివారములో నొక తరగతి సేవకుఁడు.

ఆయే! పరీ, నాం మెషుమారా చీస్త్? = ఓ, పరీ (fairy) నీ పేరేమి?

ఆఱగొండెతనము = దుండగము.

ఆసీరుచేయు = చెఱపట్టుకొను, బందీచేయు.

ఆషర్ (ఇస్రా) = భోగము.

ఆఫ్రిత్ = పిశాచము.

ఆయియే, జానేజాన్ = రా, నా ప్రాణప్రియా.

ఆస్మానీచహ్ర్ = ఆకాశముపై ఖరి అనఁగా నక్షత్రములతీరు.

ఉడుపనిచ్చెన = ఉడుములకు గట్టిన త్రాటినిచ్చెనలు.

ఉర్దూ = సైన్యము.

ఎక్ = ఒకటి,

ఎక్ కాఫిర్ ఔరత్కో చార్ పాంచ్ కాఫిర్ షైతాన్లకీ పకడ్లేవుచేసి తెచ్చిన్యాక్ = ఒక హిందూస్త్రీని, నాలుగైదుగురు హిందూపిశాచములను పట్టితెచ్చినాను.

ఒరగు = ఒరగుదిండు.

ఓగువ = చదువునట్టి; చదివి వినిపించుటకు నియుక్తమైనట్టి.

కణజము = ధాన్యపుకొట్టు.

కన్నాకు = అగ్రేసరుఁడు.

కమ్మర్ బంద్ = మొలకుగట్టు పటకా.

కాఫిరాణ్ = నాస్తికులు (హిందువులు).

కార్ఖానా = కర్మాగారము.

కిల్లా = కోట.

కుసాదగీ = పట్టుకొనుట.

కూచిసేయు = దండుతో ప్రయాణముసేయు.

కోణేవాకిలి = అంతఃపురములోనికి ప్రవేశించువాకిలి.

ఖత్ = జాబు.

ఖతల్ (కత్తల్) = చంపుట.

ఖత్కార్ = స్కంధావారసంరక్షణకు చుట్టు కొయ్యలతో కట్టిన కంచె.

ఖబర్ = సమాచారము.

ఖయాల్బాసు = నిర్దిష్టస్థితి నిలకడలేనివాఁడు.

ఖజీనిషాదు = ఖజీనాసంభావకుఁడు.

ఖురాసాని = ఖురాసాణ్ దేశజుఁడు.

ఖూబ్తరస్తు = బహు బాగుగ నున్నది.

ఖోజా (కోజా) = షండుఁడు; అంతఃపురము కావలివాఁడు.

గండపెండేరము = శూరులు కవులు మొదలగువారు కాలనుధరించు బిరుదండె.

గడిప్రదేశము = సరిహద్దు.

గస్తీ = కావలితిరుగుట.

గిరిఫ్తు కాలేదు = పట్టుబడలేదు.

గులాం = దాసుఁడు, బానిస.

ఘట = పదియేనుగుల తండము.

ఘుస్సా=కోపము.

చార్పాయి=నాలుగుకాళ్లుగలది, మంచము.

చార్పాయి జానవర్=చతుష్పాదజంతువు.

చే మిాగూయీ?=ఏమిచెప్పుచున్నావు?

చౌరంగి=నవనాథులలో నొకఁడు.

జన=స్త్రీ.

జంగ్=యుద్ధము.

జతనము=జాగ్రత్త.

జబాని పార్సీ నదానీ?=పార్సీభాష తెలియదా?

జమేదార్ (జమాదారు)=దండులో నొక చిన్న నాయకుఁడు.

జకనిక=చర్మవాద్యవిశేషము.

జహాఁపనా=జగత్పోషకుఁడా.

జాసూగులు=వేగువాండ్రు.

జిన్=దయ్యము.

డంగురా=తప్పెటవంటి చర్మవాద్యవిశేషము.

డాక్ చౌకీ=టపాలుచావడి.

తఖ్త=గద్దె.

తర్జుమాను=భాషాంతరీకరణము సేయువాఁడు.

తలారిగట్టు=విజయనగరపట్టణములో మాల్యవంతమునుండి ఆనెగొందికిపోవుమార్గమం దొక స్థలము పేరు.

తీఁగనవ్వు=తీఁగవలె దీర్ఘముగ సాగునవ్వు.

దంచనము=కోటలయందు శత్రువులపై బండలను విసరుటకై నిర్మింపఁబడిన యంత్రము.

దక్కనీ=పూర్వకాలమున దక్కను మహమ్మదీయులు మాటాడుచుండిన ఉర్దువంటిభాష.

దమస్కసు=సిరియాదేశ ముఖ్యపట్టణము. అచటినుండి పూర్వము దిగుమతియగుచుండిన ఒకవిధపు నాణ్యమైన వస్త్రము.

దర్జబాని తిలింగ్ గూయి=తెలుఁగుభాషలో చెప్పుము.

దర్వాన్=వాకిటి కావలివాఁడు.

దివానా=పిచ్చివాఁడు.

దిస్సువారు=దిస్సుమనుశబ్దముతో గూడిన.

దుండగము=దౌష్ట్యము,

దుష్మన్=శత్రువు, పగవాఁడు.

దోస్తు=మిత్రుఁడు.

ధర్మదార=యుద్ధము నాపుటకు ఊఁపెడు తుతార.

ధర్మాసనము=న్యాయముమ తీర్చుస్థానము.

నమ్మక్=ఉప్పు.

నాయకులు = విజయనగరరాయులకడ భూమిగొని కప్పముకట్టుచు వలసినపుడు తమ దళములతో యుద్ధమునకు నడచుదొరలు.

నిక్షా (నికాహా) పెండ్లి.

నిక్షాకట్టు=పెండ్లాడు.

నుక్సాన్ (లుక్సాన్)=నష్టము.

పంజా వెలుగులు=దివిటీవెలుగులు.

పఠానీ=పఠానుజాతివాఁడు.

పన్నాగము=వాహనములపై సుఖముగ గూర్చుండుట కమర్చు నుప కరణము.

పర్సంగు=మైలులో నొక భాగము. ఇంచుమించుగ ఫర్లాంగుకు సరి పోవచ్చును.

పశుమల=మధురకు దక్షిణమున తిరునెల్వేలికి పోవుమార్గమున నుండు కొండ.

పాన్ సుపారీబజారు = ఆకువక్కలమ్ము అంగడివీథి. విజయనగరపట్టణములో నొక పెద్ద అంగడివీథి పేరు.

పాదుశాహీ = డిల్లీ మహమ్మదీయచక్రవర్తి. మహమ్మదీయసామ్రాట్టు.

పాదూవాహుఁడు = చెప్పులను మోయువాఁడు.

పాపోసు = పాదరక్ష.

పాబూసు = పాదమును ముద్దిడుకొనుట.

పాయదళము = కాల్బలము.

పాళెగాండ్లు = దేశకావలికి రాయలయుగమున నచటనచట నియోగింపఁబడిన కావలివారు.

పిల్లి కూటము = (పిల్ల కూటము) చిన్న హోలు.

పీలనుఁడు = ఏనుఁగువంటి శరీరముగలవాఁడు, బలవంతుఁడు.

పుట్టకోట = మట్టితోఁ కట్టిన కోట.

పెతికె = ఎద్దు లోనగువానిమీద వేసి మోయించెడి గోనెమూట.

పైదజవాను = కాలిబంటు.

పోతుటల = మగయల.

ప్యాలా = చిన్న పానపాత్ర, టంబ్లరు.

ప్రోడ = సమర్థుఁడు.

ఫౌజు = దండు.

బంజారులు = సైన్యములతోఁగూడ నెడ్లమీదను గాడిదలమీదను ఆహారపదార్థములను గొనిపోయి సరఫరాసేయు నొకజాతివారు.

బద్ గుమాన్ = సంశయము.

బద్ బఖ్తు = అదృష్టహీనుఁడు.

బర్ ఖాస్తు = లేచుట, ముగించుట.

బాజ్ గష్తు = మరలుట.

బాహిర్ చలో = వెలుపలికిపో.

బీబీ = స్త్రీ, భార్య.

బీమారీ=జబ్బు.

బుజుర్గ్ వార్=పెద్ద.

బుత్ఖాన=దేవాలయము

బెడదకోట=బీదరు.

బేఅకల్=తెలివిమాలినవాఁడు.

భోత్ ఘుజబ్=బహుకోపము.

మంజనీక్=బండలను శత్రువులపై రువ్వు దంచనమువంటి యంత్ర విశేషము.

మండిగ=అంగడి.

ముఖ్దుమాజహాన్=సుల్తానువారిభార్య.

మతంగవీరన్న=విజయనగరమున మతంగపర్వతముపై నెలకొనియుండు వీరభద్రస్వామి.

మరవ=దక్షిణ తమిళనాటిలో నివసించు ఒకజాతి జనుల పేరు.

మలఊన్ = శాపగ్రస్తుఁడు, పాపి, సంఘబహిష్కృతుఁడు, దైవోపహతుఁడు.

మాంజిష్ఠతెర=ఎఱుపుమించిన పసుపువర్ణపు దోమతెర.

మాడువు=ప్రాసాదము.

మారియాత్తా=మారమ్మ.

ముదల=ఆజ్ఞ.

ముర్ద=చావు.

ముష్కిల్=కష్టము.

ముహాస్సిర్=ముట్టడి.

యవనాగ్నిజ్వాల=మందు రగులుకొనుటవలన కలిగెడు మంట. మొదట యవనులు వాఁడుకలోనికి తెచ్చుటవలన దీనికీపేరువచ్చినది.

రాస్తీజవాబ్=సరియైన ప్రత్యుత్తరము.

లగ్గు=కోటగోడల పైకెగఁబ్రాకుట.

లడాయి=యుద్ధము.

లష్కర్=దండు.

వకీల్ ఎదర్=నగరి పారుపత్యగాఁడు.

వరాహముద్ర=విజయనగర రాయలాంఛనమగు వరాహముయొక్క ముద్ర.

వాపస్=మరలుట.

వీరశృంఖలము=వీరులు తమ పరాక్రమచిహ్నముగ ధరించుగొలుసు.

శంభళీస్త్రీ=మాలెత.

షరతు=ఒడంబడిక.

షరాబు=మద్యము.

షాఇర్=కవి.

షాదీ=పెండ్లి.

షికారు=వేఁట.

షినో ప్యారకే ... ఇక్ సానమ్. బల్కే షాఇరమ్=వినుకోకిలా... నేను మనుజుఁడను. ఇంకను కవిని.

షీషా=గాజుబుడ్డి.

షుందర్ బంది=సుందరపాండ్యుఁడు.

సైతాన్=సైతాను.

సకినలమంచము = తాకిన కీచుకీచను కృత్రిమపక్షుల ప్రతిమలతో గూడిన మంచము.

సరంజామ్=సిద్ధము.

సరాసర్=మొత్తముమీద.

సాకీ=మధువును పానపాత్రయందుబోయు పనివాఁడు.

సాత్ ఆట్ మాహ్=ఏడెనిమిది మాసములు.

సింగాణిరౌతులు = కొమ్ముతో జేసిన విండ్లను దాల్చి యుద్ధము సేయు నాశ్వికులు.

సిపుర్దుచేయు = వశపఱచు, ఒప్పజెప్పు.

సిరందీబు = సింహాళము.

సిలెహ్దారు = కవచమును మోయువాఁడు.

సిళ్లుచూపు = (బరిగోలచే సేనఁగును పొడిచి యుద్ధమునకు) పురికొల్పు

సుబ్హానల్లా! ఔరత్క్ పకడ్లేవ్ చేసిన్యావ్? = అల్లా సంస్తవనీయుఁడౌగాక. స్త్రీని పట్టుకొంటివా?

సుల్తాన్జాద = సుల్తానుకుమారుఁడు.

సూళైబజారు = విజయనగరమున వారకాంతలు నివసించు వీథిపేరు.

సోదనదివిటి = చీకటిలో దాగియుండు శత్రువులను వెదకి కనుఁగొనుట కుపయోగించు దివిటీ.

స్కంధావారము = సేనలు విడిసియుండు స్థలము.

హజార రామస్వామిగుడి = విజయనగర రాయలనగరి హజారమున నుండు శ్రీరాముని దేవాలయము.

హఫ్త్ = వారము.

హషం = సైన్యము.

హుకుం = ఉత్తరువు.

హుజూరు = సముఖము.

హుర్మత్తు = ఊఁపు, పెట్టు (ఒక ఊఁపున, ఒక పెట్టున ఇత్యాది).

హెగ్గడికత్తె = అంతఃపురపు కావలికత్తె.